సవ్యాఖ్యాన శతకసాహిత్య పరంపర - 1

# శ్రీకృష్ణశతకము

(గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యా
జగత్కళ్యాణ సంహితా సహితము)


సంపాదకులు

**శ్రీ చల్లా సాంబిరెడ్డి,** బి. ఎ., ఎల్. ఎల్. బి.




శ్రీ పావని సేవా సమితి ప్రచురణ నెం. - 1

సవ్యాఖ్యాన శతక సాహిత్య పరంపర - 1

థమ ముద్రణము - 1998 జనవరి

ప్రతులు - 2000

| | | |
|---|---|---|
| *ri Krishna Satakamu* | - | Devotional Poems on ***Lord Krishna*** - well known Telugu Satakam by unknown Prachina Kavi |
| Vith Commentary named | | *"Gopeenayanotpalarchita Vyakhya" with "Jagatkalyana Samhita"*<br>"గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యా", జగత్కల్యాణ సంహితా సహితము |
| ivine Blessings by | | Avadhuta Datta Peethadhipathi, ***Sri Sri Sri Ganapati Sachchidananda Swamiji*** - Mysore. |
| ppreciations by | | ***Brahmasri Kuppa Venkata Krishna Murthy*** - Vidyadhikari Datta Peetham, Mysore.<br>***Brahmasri Yeluripati Anantaramayya*** Hyderabad. |
| dited by | | ***Sri Challa Sambi Reddy*** Advocate |
| ublished & rights eserved by | : | ***Sri Pavani Seva Samithi*** "Sri Sai Nilayam" SRT 270, Sanath Nagar, Hyderabad-18. A.P. ✆ : 272898 |
| itle Page Drawing | : | ***Gangadhar*** |
| rice | : | Rs. 75/- |
| ype setting at | : | ***Vasantha Graphics,*** Hyderabad - 4. Phone : 3320742 |
| rinted at | : | ***Sri Sai Ram Printers,*** Hyderabad - 4. Phone : 232316 |
| aper at concessional ate supplied by | : | ***ITC Bhadrachalam Paperboards Limited.*** Hyderabad. |



# శ్రీ అవధూత దత్త పీఠము

శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమము,
దత్తనగరు, మైసూరు - 570 004.
దూరవాణి : 0821 - 486486, 480424.
ఫాక్స్ : 0821-487487

అవధూత దత్తపీఠాధిపతి - పరమపూజ్య - జగద్గురు

## శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి

## ఆశీర్వర్షము

ఉత్పల సత్యనారాయణగారు కవితా రూపంలో తపస్సు చేసిన గృహస్థయోగి. యోగంలో వెనుకటి మెట్టు పైమెట్టును తనే అందిస్తుంది అని శాస్త్రం. ఉత్పలకవి కవితా తపస్సు, శ్రీ కృష్ణతత్త్వ మననంగా పరిణమించి, శ్రీ కృష్ణశతకవ్యాఖ్యగా ఫలించింది. ఇది ఈయన రచనకాదు, కలవరింత! పలికినవాడు........ ఎవడో........లోపల వెలుగైనవాడు! బయట ధ్వనియైన వాడు! అందీ అందనివాడు! అందక అందేవాడు! అతనిని పట్టివేశాడు ఈ కవి, ఈ వ్యాఖ్యాత. ఈ పట్టు స్థిరమై, ఆ స్వామి ఇతని గుండె కొలువై, నిలచుగాక!

దాత సాంబిరెడ్డి ఊతగా ఆచంద్రార్కం ఆంధ్రలోక మీ భాగ్యానికి భాగస్వామియై వెలయుగాక!

**జయగురుదత్త**

నిరంతరం నారాయణ స్మరణంతో
ఏకాదశి పుణ్యతిథిని పరంధామం చేరుకొన్న
మా అమ్మ చెన్నమ్మ పవిత్ర స్మృతికి.

– చల్లా సాంబిరెడ్డి

# మననము - మథనము

శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తి,
విద్యాధికారి,
శ్రీ అవధూత దత్త పీఠము, మైసూరు.

వ్యాఖ్యానాలు రెండు రకాలు. ఒకటి మల్లినాథఫక్కి. "నామూలం లిఖ్యతే కించిత్" అనేది వారి మంత్రం, ఇది మననం. రెండవది - భాష్యకారుల ఫక్కి, తద్వ్యాఖ్యాతల ఫక్కి, తదనుయాయుల ఫక్కి, గోపీనయనోత్పలార్చితవ్యాఖ్యలో శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులవారు ఆదరించిన ఫక్కి, ఇది మథనం.

దీనిలో మూలగ్రంథం కేవలం ఈషదాధారం.

మాటలు వస్తున్న రోజుల్లో పిల్లల నోటికి పెద్దలు నేర్పే పవిత్ర భాషామంత్రం శ్రీకృష్ణ శతకం, పూర్వం పెద్దలిలాగే చేసేవారు. నిజానికి యీ శతకానికి ఎక్కడైనా కావలసి వస్తే ప్రతిపదార్థం కావాలేమో గాని, వ్యాఖ్యానం అక్కరలేదు. ఆ ప్రతి పదార్ధ మాత్రానికి ఉత్పల వారి వంటి భక్తి ప్రతిభావ్యుత్పత్తుల పుంభావమూర్తులతో పనిలేదు.

సహృదయులు శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు ఉత్పలవారి రసహృదయాన్ని ఉసిగొలిపారు. అది ఉవ్వెత్తున పొంగింది. వారి కలంచుక్క తనపైబడగా శ్రీకృష్ణ శతక బిందువు శ్రీ కృష్ణతత్త్వ సింధువుగా మారింది. ఆ సింధువులో మునకలు వేసిన ఉత్పల కవిస్వామి రాసలోక గోపికగా మారాడు ! శ్రీకృష్ణ భావబంధురయైన ఆ గోపిక శిరసు ఈషదున్నమితమై, ఆమె కనులు అర్ధ నిమీలన ప్రక్రియోచ్చలితములై, ఉత్పలములైనాయి. (ఉత్-పలతి = ఊర్ధ్వం గచ్ఛతి = పైకి పోవునది, ఉత్పలము, కలువ). అట్టి నయనోత్పలాలు వేదాంత పురాణాగమ శాస్త్ర కావ్యాది వీథులలో వేలుపెట్టిన ప్రతిచోటా శ్రీకృష్ణ పదారవిందమే తగిలి, ఉత్పలార్చన అప్రయత్న సిద్ధమైంది. అక్కడితో ఆగక ఈ అర్చనాపారవశ్యంలో ఆ గోపిక రూపమే కరిగిపోయి, రసమూర్తి శ్రీకృష్ణస్వామియే అద్వితీయుడై ప్రకాశించాడు. అందువల్లే యీ వ్యాఖ్య గోపీనయ నార్చిత వ్యాఖ్యయై వ్యాఖ్యాత పాలలో పంచదార లాగా దానిలో కలిసిపోయాడు.

సామాన్యతః వ్యాఖ్యాతలు కవులు కారు. ఉత్పలవారు మాత్రం జన్మతః రససిద్ధుడైన కవి, తరువాత భావుకుడైన భక్తుడు, ఆ తరువాత వ్యుత్పన్నుడైన పండితుడు, భక్తిశాస్త్ర కేదారాలలో చెడుగుడులాడే వ్యాఖ్యాత!

శ్రీమద్భాగవతంలో రాధాదేవి ప్రసక్తిలేక పోవటానికి సాంప్రదాయికులు ఒక హేతువు చెపుతారు. రాధానామోచ్చారణ చేస్తే శ్రీశుకులు సమాధివశులవుతారట. అలా జరిగితే

సప్తాహావధిలో పరీక్షిత్తుకు భాగవతోపదేశం పూర్తి కావటం దుర్ఘటంగనుక, వారు భాగవతంలో ఆ పేరెత్తలేదని. అది ఏమోగాని, ఉత్పలవారికి మాత్రం రాధా శ్రీకృష్ణనామములు బొమ్మాబొరుసుల వంటివి. మొదటి పద్య వ్యాఖ్యలోనే వీరు శ్రీ శబ్దానికి రాధాదేవి అనే అర్థం చెప్పి, దానికి పురుషసూక్త వాక్య ప్రమాణాన్ని చూపి, తరువాతి గ్రంథంలో, తాము విస్తరించబోయే కృష్ణతత్త్వ వ్యాఖ్యానానికి మంచి ప్రాతిపదిక వేశారు.

నిజానికి యీ వ్యాఖ్య ఒక స్వతంత్రమైన భగవచ్ఛాస్త్ర వివరణ గ్రంథం. ఇందుకు నిదర్శనాలు దాదాపు అనుపదం మనకీ గ్రంథంలో కనిపిస్తూనే వుంటాయి.

19వ పద్యంలో గోపీ వస్త్రాపహరణ ఘట్టం వచ్చినపుడు మూలకవి భక్తిమాత్రపరుడై పద్యాన్ని నడిపించగా, వ్యాఖ్యాత తత్త్వాంబరవీధీ వీర విహారం చేసి, ఆ గోపికలు నానప్రస్థలని నిరూపించాడు. 36వ పద్యంలో అగణితవైభవ - అన్న చిన్న పదాన్ని ఆధారంగా చేసికొని శ్రీకృష్ణతత్త్వంలోని వివిధ విభిన్నాంశాలను పదిపేజీలలో వివరించాడు. 37వ పద్యంలో శ్రీకృష్ణుడు అవతారిగానీ, అవతారం కాదని నిరూపించాడు. 82వ పద్యంలో, కృష్ణతత్త్వాన్ని శ్రీకృష్ణనామ మాహాత్మ్యం అని శీర్షిక పెట్టి మరీ వివరించాడు. ఇది అంతా ఉత్పలవారి మథనం.

ఈ వ్యాఖ్యలో మరో అపూర్వ విశేషం, వీరు ఉదాహరించిన శ్రీకృష్ణస్తోత్రపరమైన రసగుళికలు సంస్కృతాంధ్రాలలో వందల సంఖ్యలో వున్నాయి. భగద్గీతా శ్లోకాలకు లెక్కేలేదు. ఇది వీరి మథనానికి వెనుక ఉన్న మననం. దీనివల్ల ఈ వ్యాఖ్య వెల నేల రెట్లు పెరిగింది.

త్రిమూర్తులపట్ల వ్యాఖ్యాతకు గల సమప్రతిపత్తి ఈ గ్రంథంలో అనేకచోట్ల నిరూపితమయింది. పరిణత ప్రజ్ఞాపవిత్రమైన యీ వయసులో వారు త్రిమూర్తి నవావతారులైన శ్రీగణపతి సచ్చిదానంద స్వామీజీవారిని శ్రీకృష్ణ మూర్త్యంతరంగా, తనుకు గురుమూర్తిగా, దర్శించి సేవించటం దానికి మరో నిదర్శనం.

ఉత్పలహృదయోత్పలం నుంచి యీ అమృతమయ వ్యాఖ్యాన మకరందాన్ని అందుకొని ఆంధ్రలోకం ఋణపడిందని భావిస్తున్నాను. ఇట్టి గ్రంథావిర్భావానికి ప్రేరకులైన శ్రీ చల్లా సాంబిరెడ్డి గారు ధన్యులని శ్లాఘిస్తున్నాను.

మూల రచయిత పేరు తెలియదు. వ్యాఖ్యాత తనపేరు బయటపెట్టుకోలేదు. వారిద్దరు శ్రీకృష్ణాభిన్నస్థితిలో ఉన్నారు. వారిని అభినందించగల సత్తా నాకెలా వుండగలదు? ఈ కృష్ణనామకుని గూడ తమ జతకు చేర్చుకోమని వారికై గురుదత్త స్మరణ చేస్తున్నాను.

జయగురుదత్త

27.12.97

**కుప్పా వేంకట కృష్ణమూర్తి**

# హైయంగవీనం

ఆంధ్రవ్యాస. కవికులరత్నదీప, వైదికాగమాలంకార, భాషాప్రవీణ
ఏలూరిపాటి అనంతరామయ్య, ఎం. ఏ. సంస్కృతము, ఎం. ఏ. తెలుగు, బి. ఇడి.,
గుంటూరు డా॥ కె. వి. కె. సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్,
అనంతసాహితి కార్యదర్శి,
16-1-24/సి/6/1, శ్రీసాయి ఎపార్ట్‌మెంట్స్,
సైదాబాద్ కాలనీ, హైదరాబాదు - 500 059.

శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు సమాజమూ వ్యక్తులూ ఉన్నరీతీ ఉండవలసిన తీరూ గురించి కచ్చితమయిన అభిప్రాయాలు కలవారు. దానినీ వారినీ కూడా ఉండవలసిన తీరుకు మలచటానికి వారేమి చేయాలి వీరేమి చేయగూడదు అన్న ఆలోచనల కంటె ఎవరేమి చేయాలన్నది ఎవరికి వారు నిర్ణయించుకొని తాము చేయవలసినది చేయగలిగినంత, తాము చేస్తే, పరిస్థితులు వాటంతట అవి సరిఅవుతాయన్న సదాశయమున్నవారు. జనంలో ధర్మం దైవం వీటి గురించిన సద్భావన లోపించినదనీ, ఈ రెంటి గురించీ సరయిన భావన ఉన్ననాడు అన్నీ చక్కబడతాయనీ వారి ఉద్దేశం. దీనిని సాధించటానికి ఇదివరలో పెద్దల ప్రవచనాలూ, పిల్లలకు చిన్నప్పటి నుంచీ ధర్మ-నీతి-జ్ఞాన బోధకాలయిన కథలూ, పద్యాలూ, పాటలూ, ప్రదర్శనలూ ఉండేవి. ఇటువంటి వాటి ద్వారా పిన్నలకూ పెద్దలకూ సద్భావము కలగటమూ, పెంపొందటమూ, ఆచరించటమూ ఉండేవి. అవి లోపించటం ప్రస్తుత పరిస్థితికి మూలకారణం అన్నది వారిలోకపరిశీలనఫలం, యుద్ధంలో కాని, పెద్ద ప్రమాదంలో కాని గాయపడినవారు ఎక్కువమంది ఉండి చికిత్స చేసేవారు తక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు చికిత్స చేస్తే నయమయే అవకాశం ఉన్నవారికి ముందు చికిత్స ప్రారంభించి, చేసినా బ్రతికే ఆశలేదు అనిపించినవారికి చివర విధ్యుక్త కర్తవ్యంగా భావించి చికిత్స చేస్తారు. సమాజంలో కూడా నడవడిలో ఉపద్రవం ఏర్పడినపుడు దీర్ఘకాలిక ప్రయోజన దృష్టితో చూచినపుడు, బాలురు, యువకులు, నడివయసువారు, వృద్ధులు - అనేవారిలో చిన్నవయసు వారి నుంచి ప్రారంభించి, వారిపై ఎక్కువ దృష్టి ప్రసరింపజేస్తూ పైమూడు తరగతుల వారి గురించే అదే - పూర్వపూర్వ - ప్రాధాన్య క్రమంలో కృషి చేయాలన్నది వారి అభిప్రాయం, ప్రవచనాలూ, ప్రసంగాలూ, సద్గ్రంథాలూ, అన్నదానాదులూ ఆ ముగ్గురికీ ఎక్కువ సంబంధించినవి. భావాలు లేతమనస్సులపై ముద్రితములై అనంతరకాలంలో వారి జీవితాలమీదనూ, వారి ద్వారా సమాజ జీవితం మీదనూ గాఢప్రభావం చూపిస్తాయి కనుక, గతంలో మహాపురుషులను తీర్చిదిద్ది, భవిష్య మహాపురుషులను రూపొందించగల శక్తిగల భావభండారాలు శతకాలని రెడ్డిగారి నమ్మకం.

ఇలా తాత్కాలిక దీర్ఘకాలిక ప్రణాళికతో సమాజాన్ని పావనం చేయటం ద్వారా చేతనైన సేవ చేయటానికి మరి నలుగురు మిత్రులతో వారు శ్రీపావని సేవాసమితి స్థాపించి దానికి తాము అధ్యక్షులుగా ఉంటూ క్రియప్రధానంగానూ ప్రకటన ప్రక్రియ అప్రధానంగా తత్తత్కాలోపయోగి సత్కార్యాలు కుడిచేత చేసినవి ఎడమచేతికి తెలియనీయకుండా చేస్తున్నారు. పావని ఆంజనేయునిలా, ప్రయత్నం ఉంటే, ఎంత

చిన్నవారైనా, ఎంతపెద్ద సముద్రాన్ని లంఘించి అయినా, దైవం సంతోషించే సందేశాన్ని అటు స్వీకరించగా వారి ద్వారా ఇటు సమాజానికీ అందించగలరనీ, తద్వారా పేట్రేగిపోతున్న భావకాలుష్యాన్ని తొలగించి సద్వర్తనాన్ని శ్లాఘనాపాత్రం చేయగలదనీ అపుడు తప్పక రాజ్యం రామరాజ్యం కాగలదనీ నమ్మి శ్రీ సాయిసేవా సమితి పరిశ్రమిస్తున్నది.

ఫలపుష్పాలుగా నిలువనీదా కావాలంటే చెట్టు కొమ్మలపై చిలికి తడపటం కాదు, చెట్టు మొదట పాదుకట్టి నీరుపోయాలని అనుభవాగత విజ్ఞానంతో రెడ్డిగారు చెప్పినారు ఇదివరలో సంకల్పం చేస్తూ చెప్పిన ఇపుడు మళ్లీ చేయవలసిన శ్రీకృష్ణ -దాశరథి -నరసింహ -నారాయణ-సర్వేశ్వర-శ్రీకాళహస్తీశ్వర-సుమతి-వేమన-భాస్కర-భర్తృహరి నీతిశతకాలనూ, కాలక్రమంలో గుర్తులచెదిరి శిథిలం పట్టినవాటిని ప్రతిపదార్థ -తాత్పర్య-విశేషాంశ -సహితవ్యాఖ్యానసహితంగా విస్పష్టంగా అందంగా శ్రీసాయిసేవా సమితి ద్వారా ప్రచురించాలని సంకల్పించారు.

శతకాలు ఇంత శక్తిమంతాలుగా రూపొందటానికి కారణమున్నది. శతకాలలోలా ఇతర ప్రక్రియలలో కవిభావం ఇంతసూటిగా దూసుకుపోయి చదువరి హృదయంలో సుడులుకోదు. కావ్యాలలో ఎక్కడనో తప్ప కవి పాత్రల వెనుకనో వర్ణనల చాటుననో ఉండి తన భావం వినిపిస్తాడు. శతకంలో అలా కాదు, చెప్పేది తనకు మిక్కిలి ఇష్టమయిన దైవంతో, భావం పుట్టినది పుట్టినట్టుగా స్నిగ్ధముగ్ధాస్ఫుటదిగ్ధంగా అరమరికా దాపరికమూ లేకుండా వెలువడుతుంది. పది పుస్తకాలు చదివి ఒక పుస్తకం వ్రాయటంలా కాకుండా, ఆర్తి కానీ, అర్థనకానీ, ఆక్షేపణకానీ అదేదైనా స్వీయానుభవనిశితమై నవంనవంగా ఉంటుంది. ఇందులో చదువరితాను కవిఐపోయి ఆయన అనుభూతి తనది అయి ఆనందాది ప్రయోజనాలు పుష్కలంగా పొందగలుగుతాడు.

భారతీయుల శతకరచనాభావమే అపూర్వమైనది. అనుభూతిస్వీకరణ కంటె అతివిలక్షణ ప్రయోజన విశిష్టమైనది. అష్ట విధనూనసిక పుష్పపూజకుదారితీసే ఇష్టదైవ పుష్పపూజ అష్టోత్తరశతనామ పుష్పపూజగా చేయటం మన సంప్రదాయం. అవి పద్య పుష్పాలయితే ఇష్టదైవప్రీతికీ, ఇష్టభావధారణ మనన రీతికీ ఉపయోగపడతాయని శతకరచన ఆరంభించారు. అన్ని ప్రక్రియలకు లాగానే శతక సృష్టికీ మూలం సంస్కృతమే అయినా శతక సరస్వతికి మకుటం పెట్టిన సుకృతశాలి తెలుగువాడే. శతకం అంటే నూరింటి సమూహం, నూరుకలది అని అర్థం. ఇలా మయూర సూర్యశతకాదులుగా దైవపూజాంగాలుగా ప్రారంభమైన శతకం సంస్కృతంలోలాగానే తెలుగులోనూ ఇష్టదైవ స్తుతిపరంగానూ, నీత్యుపదేశ సుందరంగానూ, సమాజ సంస్కరణబోధకంగానూ, సర్వవిధ భావ ప్రచారసాధకంగానూ పరిణమించింది. సహజం.

తెలుగు వారి ప్రతి బాలునీ చిన్ని కృష్ణమ్మగానూ, ప్రతిబాలికనూ ఒక యశోదమ్మగానూ తీర్చిదిద్దుతూ వస్తున్నది శ్రీకృష్ణ శతకం. నూటొక్క అందమైన కందాలున్న ఈశతకం శ్రీకృష్ణుని లీలలు, మహిమలు, వీరకృత్యాలు, లోకరక్షణ భక్తరక్షణ గుణగణాలు చిన్న చిన్న మాటలలో పిల్లల హృదయాలలో నాటుకొన జేస్తుంది. ఎంత దివ్యమైన సందేశాన్ని అందిస్తున్నది కృష్ణ శతకం! తను కర్తవ్యాలు తాను నిర్వహించుకుంటూ భగవంతుడు తమను బ్రతకమన్న రీతిని తాము తమమానాన బ్రతుకు వారిని బ్రతకనీయక తమదురహంకార దురాశలకు గురిచేసి బాధిస్తున్నవారిని మట్టు పెట్టటానికి ప్రయత్నించేవాడు

భగవంతుడైనాసరే ఎంత శ్రమపడాలి! తన కోసం తన తల్లి దండ్రులు చెరలో మ్రగ్గుతున్నారు. తన కాశ్రయమిచ్చారేమో అని అనుమానం కలిగినా వారిని నశింపజేసే ప్రయత్నాలు దుష్టులు చేస్తున్నారు. అన్నిటినీ తట్టుకొంటూ అడ్డంకులు తొలగించుకొంటూ దుష్టులందరిని సంహరిస్తూ, నేను వచ్చి సంహరించటం కాదు, మీ ప్రయత్నాలు మిమ్మల్నీ మీవంటి వారినీ ఉద్ధరించుకొనటానికి ఉద్ధరించటానికి మీరూ చేయండి, మీ కోసం నేనేమైనా చేస్తానని చెప్పి నడిపించినవాడు శ్రీకృష్ణుడు.

ఇట్టి శ్రీకృష్ణునిపై వచ్చిన ఈ శతకం వ్యాఖ్యాత ఇందులో పరమాత్మ తత్త్వం, శ్రీకృష్ణతత్త్వం, ఆయన లీలలు అలతిమాటల వెనుక ఎలా దాగి ఉన్నాయో, వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, శంకరాచార్యాదుల స్తోత్రాలు మొదలయినవి వాటినెలా సమర్థిస్తున్నాయో అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు వివరించారు. అవసరమైన చోట్ల ప్రమాణ వాక్యాలనుదాహరించటానికి శ్రమ అనుకొనలేదు. కృష్ణ శతకంలోని మాటలు చాలావరకూ తెలిసేనయినా భావాలూ వాటి రహస్యాలూ పెద్దలూ తెలుసుకొనవలసినవనటానికి ఈ వ్యాఖ్య పదే పదే సాక్ష్య మిస్తుంది. ఈ వ్యాఖ్యాత జ్ఞానవయోవృద్ధులు. సంప్రదాయవేత్తృతా, భగవద్విషయనైదుష్యమూ, సరససరళ వివరణ నైపుణ్యమూ, మూర్తీభవించినవారు. శతకంలో విశేషణాలుగానో, విశేష్యాలుగానో, సంబోధనలుగానో సూచితములయిన శ్రీ కృష్ణుని లీలలనేగాక, ఆయా అవతారాల గాథలనూ, రహస్యాలనూ ఓపికతో వ్రాశారు. ఇవి ఎంతయినా అవసరమైనవి. అచ్యుతాష్టకం, జితంతాస్తోత్రం, ఆళువందారుస్తోత్రాల భావాలు - ఇట్టివి ఈ శతకంలో ఎలా ప్రతిబింబించాయో, పోతనగారి భాగవతం ఈ శతకకవి కెలా వచోవిధేయమో సోదాహరణంగా చెప్పారు. గజేంద్రమోక్షణం శతకకవికి ఇష్టమంటూ ఆ గాథ వెనుక గల ఆధ్యాత్మిక తత్త్వం విశదం చేశారు. 51వ పద్యంలో సజ్జన సాంగత్యం ముఖ్యమని యోగవాసిష్ఠం ఉదాహరించారు. 76వ పద్యంలో 'పురసంహారమిత్రుడ' అన్న సంబోధనను వివరించే సందర్భంలో శ్రీ కృష్ణునికీ శివునికీ భేదభావం చూపేవాడు శాశ్వతంగా నరకవాసము ననుభవించునని శివపురాణం చెపుతున్నదని ఆభావం గల శ్లోకాలు ఉట్టంకించి తమ సమదృష్టి చాటి వీరిందులో ఉదాహరించినందున అంతదూరం పోలేనివారికి వేదాంతదేశికుల న్యాసదశకం వంటివి అందుబాటులోనికి వస్తాయి. ప్రతిపద్యానికి వ్రాసినదీ బహువిషయభరితముగా వ్యాఖ్య వ్రాయటమే కాక దానికి గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య అని పేరుపెట్టటం విశేషం. ఇంత చక్కని వ్యాఖ్య వ్రాసిన వీరు బహుధా అభినందనీయులు. శ్రీసాయినిసేవాసమితికీ శ్రీ సాంబిరెడ్డిగారికీ తెలుగు వారు తమ ఋణం తీర్చుకోలేరు. అయినా మార్గం లేకపోలేదు. మిగిలిన శతకాలకు వ్యాఖ్యలు వ్రాయనంగీకరించిన వారూ త్వరలో వాటిని పూర్తిచేసి ఇవ్వటం తరవాయిగా, ఆ వ్యాఖ్యలతో పాటు వీరు ప్రచురించనున్న శతకాలు తాము చదవుతూ తమ పిల్లల చేత చదివిస్తూ ఉండటం ఒకటే ఆ మార్గం.

**ఏలూరిపాటి అనంతరామయ్య**

# మా మాట

మానవప్రాణికి జన్మనిచ్చేది కన్యాదానం. అది ప్రకృతి సహజమైన కర్తవ్యం. అన్నదానం మహాదానమంటారు. విద్యాదానం చాలా గొప్పది. అన్నిటికంటె మహోన్నతమైనది ఆధ్యాత్మిక జ్ఞానదానం. సామాన్య విశేషాంశాలతో కూడిన సనాతనధర్మం సంస్కృత వాఙ్మయాన్ని పరిపుష్టం చేసింది. ప్రాపంచిక వస్తు వివేచనకోశమైన వేదం మానవుని అవగాహనకు వీలుగా తనను తాను ఆవిష్కృతం చేసుకొని అపౌరుషేయంగా ప్రసిద్ధి కెక్కింది. వేదోక్తమైన వస్తు విషయ వివరణ చాలా సంక్షిప్తంగా ఉండటం వల్ల జనసామాన్యానికి అర్థమయ్యే విధంగా వివరించడానికి మేధాసంపత్తి, అవధాన ప్రధానమైన కవిత్వం అవసరమయింది. ప్రతి పదార్థాన్ని ఇతి (ఇది) అని పరిగ్రహించి పరిశీలించి విశ్లేషణానంతరం నేతి నేతి (ఇది కాదు) అని పరిత్యజించిన ప్రక్రియలో ఉపనిషత్తులు, పురాణేతిహాసాది శాస్త్రాలు ప్రవచింపబడినవి. అన్నిటికి వేదమే మూలము - ప్రామాణికము అయింది.

ఆధునిక వైజ్ఞానిక ఆవిష్కరణలకు ముగ్ధమై, భౌతిక భోగాసక్తమై నాగరికమనబడుతున్న నేటి సమాజం అంతర్గతంగా హింస, మోసం, దోపిడీ, దౌర్జన్యం, దురాచారం, అత్యాచారాది అమానుషకృత్యాలకు ఆలవాలమయింది. నిరంతరం అశాంతికి గురి అవుతున్నది. లోకంలో అభివృద్ధి చెందిన - చెందుతున్న దేశాలన్నిటికి ఈ వైపరీత్య బాధ తప్పడం లేదు. ఈ దుష్పరిణామాలకు కారణం మానవ సమాజంలో ఆధ్యాత్మికమైన విలువలు క్షీణించి, మనిషి భగవదాభిముఖ్యం నుండి మరలి పోవడమే.

సాహిత్యం చాలా ప్రభావవంతమైన వస్తువు. దానికి భగవద్వైముఖ్యం కలిగించడంలోను, భగవదాభిముఖ్యం కలిగించడంలోను అప్రతిమానమైన సామర్థ్యం ఉంది. అది నేడు చేస్తున్న భగవద్వైముఖ్యం వల్లనే దేహాత్మజ్ఞానం లేనివారై తుచ్ఛమైన భోగాలకోసం జనులు పరుగులు దీస్తున్నారు. అందువల్ల దురాచారాలు, భ్రష్టాచారాలు అత్యాచారాలు సమాజంలో ప్రబలుతున్నాయి. అది నిజంగా సాహిత్యం దుర్వినియోగమైన దుష్ఫలితమే.

సాహిత్యం భగవత్ప్రీత్యర్థమైన దైతే మనుష్యుల అంతరంగాలలో సుప్తమైన పవిత్ర సాత్త్విక వాసనలను జాగృతం చేసి వారికి భగవదాభిముఖ్యం కలిగిస్తుంది. మానవకళ్యాణానికి తోడ్పడి అది సత్సాహిత్యమవుతుంది.

ఇందుకు విరుద్ధమైన సాహిత్యం మనుష్యులలో తుచ్ఛమైన భోగవాసనలను రేకెత్తించి మనస్సును మలినం చేసి అసద్వృత్తులను మేల్కొల్పి, మనుష్యుణ్ని పశుప్రాయుణ్ని చేస్తుంది భగవద్విముఖుడైనవాడు సుఖభోగాల పట్ల, అదమ్యమైన లాలసల పట్ల ఆకర్షితుడై సమాజానికి

చీడపురుగవుతాడు. అసత్సాహిత్యం మానవాళిని సర్వతోముఖపతనావస్థకు దారితీస్తుంది.

గతంలో మాదిరి మానవ మానస వికాసం ధర్మావగాహన - పారలౌకిక చింతన అనే పునాదులపై జరగడం లేదనేది గమనార్హం. ఈ లోటు పూరించడానికి లౌకిక పారలౌకిక ధర్మసంగ్రహశక్తిసంపన్నమైన శతకసాహిత్యం మీదికి దృష్టి మళ్లించి, పరిచయించి, యువతకు విద్యార్థిలోకానికి అధ్యయనాభిలాష కలిగించటం ముఖ్యావసరంగా శ్రీ పావని సేవాసమితి గుర్తించింది. ప్రథమంగా భక్తి సంప్రదాయ శతక సాహిత్య ప్రచురణ - ప్రాచుర్యానికి నడుము కట్టింది.

ప్రథమ ప్రయత్నంగా శ్రీకృష్ణశతకం, దాశరధి శతకం, శ్రీకాళహస్తీశ్వర శతకాలకు అనుభవజ్ఞులైన పండిత ప్రకాండుల చేత వివరణాత్మక విశ్లేషణలను జోడించి ముద్రించాలని సంకల్పించి శ్రీ పావని సేవాసమితి కార్యోన్ముఖమయింది. మున్ముందు వేమనశతకం, సుమతిశతకం, భాస్కర - శ్రీ నృసింహ - నారాయణశతకాలకు కూడా ఈ ఒరవడినే చేపట్టడం జరుగుతుంది.

శ్రీకృష్ణశతకం బాలసాహిత్యంలో సుబోధకము, సుప్రసిద్ధము అయిన రచన, అది వ్యాఖ్యాన గమ్యం కాదు. దాని కింత పెద్ద వ్యాఖ్యానం అవసరం లేదు. కాని ఈ కాలంలో ఈ శతకాన్ని పిల్లలచే చదివింపజేయడం ఎలా? ఈ శతకాన్ని తొలుతగా పెద్దలు చదివినవారైతే వారీ శతకంలోని పరమార్థాన్ని గ్రహించి, భగవద్భక్తి యుక్తులై అధికాధిక లాభం పొంది ప్రీతితో తమ పిల్లలను తప్పక చదివింపజేస్తారన్న దృఢవిశ్వాసంతో ఈ సవ్యాఖ్యాన శతక సాహిత్య పరంపరకు మేము పూనుకొన్నామని సవినయంగా పెద్దలకు నివేదించుకొంటున్నాము.

ఈ బృహత్కార్యానికి నాందిగా మహాకవి శ్రీ ఉత్పల సత్యనారాయణా చార్యులు గారు శ్రీ కృష్ణ శతకానికి వ్యాఖ్య అడిగినదే తడవుగా అందజేయడం శ్రీకృష్ణచంద్రునిపై వారికున్న ప్రేమభక్తికి నిదర్శనం. ఆంధ్రసాహితీకేదారంలో తనదైన ప్రత్యేకమైన శైలిలో అనేక కావ్యసస్యాలను పండించిన శ్రీ ఉత్పలవారు ఈ శతకంలో చేసిన శ్రీకృష్ణానుశీలనమును, భక్తి మాధుర్య వివేచనలను మీరు రుచి చూడబోతున్నారు. శ్రీకృష్ణశతక కర్తృత్వం తెలియనందున వ్యాఖ్యాతయైన శ్రీ ఉత్పల వారు తమ పేరును గ్రంథంలో ప్రకటించుకోడానికి ఇష్టపడలేదు. వారికి మా సాధువాదములు తెలుపుకొంటున్నాము.

ఈ వ్యాఖ్యాత చేసిన శ్రీకృష్ణానుశీలనం ఆ అనంత సౌందర్య మాధుర్య నిధి అయిన అఖిల రసామృతమూర్తికి కలికితురాయిగా, భక్తిమార్గంలో ముక్తికి సోపానంగా, సాహిత్యానంద బృందావనంలో ప్రేమభక్తి బంధుర సుగంధాలను వెలయిస్తూ అన్ని కాలాల పాఠకుల హృదయాలను పరవశింపజేస్తుందని మా విశ్వాసం. జిజ్ఞాసువుల సందేహాలను తీర్చి, సాధకులకు

సాఫల్యాన్ని చేకూర్చి పఠితలను శ్రీకృష్ణభక్తిభావనులను చేస్తుందని మా గట్టి నమ్మకం.

శ్రీకృష్ణకథాసుధాపానం చేసే సాధుపురుషుల హృదయాలలో శ్రీహరి ప్రవేశించి కామాది వాసనారూపమైన బాహ్యాభ్యంతరిక అనుంగళాలను తొలగిస్తాడన్నది శాస్త్ర వచనం.

"భగవత్తత్త్వమునందు అనభిజ్ఞులైన జనులకు అమృతరూపజ్ఞాన ప్రకాశాన్ని వెలయించి వారిని సన్మార్గానికి తెచ్చేవారిపై సమస్త దేవగణాలు కృపావృష్టి కురియిస్తా" యన్న ఆర్యోక్తియే మా ఉద్యమానికి స్ఫూర్తిదాయకమయింది. ఇంతకుముందుగానే సాక్షాత్తు శ్రీ దత్తాత్రేయ స్వరూపులు శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద అవధూత స్వామివారి అనుగ్రహం మాకు లభించి మమ్మల్ని ముందుకు నడిపింది. వారి ఆశీర్వర్షంతో భక్తి పులకిత గాత్రులమయ్యాము. వారికి మాసాష్టాంగ ప్రణామములు. దత్తపీఠ విద్యాధికారి వేద శాస్త్ర పురాణ కావ్య నాటకాలంకారాది బహుశాస్త్ర పారంగతులు, పరమ బ్రహ్మణ్యులు, నిష్ఠాగరిష్ఠులు అయిన శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తి గారి అభిమానానికి ఈ వ్యాఖ్యా గ్రంథం నోచుకొన్నదనగా, ఇక దీని విలువ చెప్పనక్కర లేదు. ఆ మహా విద్వాంసునికి సర్వదా కృతజ్ఞులము.

ఈ పుస్తకానికి 'హైయంగవీనం' అనుగ్రహించిన 'ఆంధ్రవ్యాస' 'కవికుల రత్నదీప' 'వైదికాలంకార' 'భాషాప్రవీణ' శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య మహోదయులకు శ్రీపావనిసేవాసమితి పాలకవర్గం కృతజ్ఞతలను తెలుపుకొంటున్నది.

ఈ పుస్తకానికి ముఖపత్రాలంకరణ కావించిన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ గంగాధర్ గారికి, ముచ్చటగా టైపు చేసిన వసంతా గ్రాఫిక్స్ వారికి, సుందరంగా ముద్రించిన శ్రీ సాయిరాం ప్రింటర్స్ అధినేత శ్రీ నాగేశ్వరరావు గారికి మా కృతజ్ఞతలు.

జి. సి హెచ్. రామారావు
కార్యదర్శి, శ్రీపావనిసేవా సమితి

# నివేదన

నా దైవంబగు కృష్ణుడే సుజన సాంగత్యంబు చేకూర్చి నా
చేఁదత్త్వము తన్మహామహిమమున్ చెప్పించుకో నెంచియే
కాదా? నీకిడి పంపినాడు ప్రభు వీ గ్రంథం బపేక్షించి ఆ
హ్లాదంబొందితి ధన్యవాదములు చల్లా సాంబిరెడ్ద్యగ్రణీ!

భవ్యముగాగ కృష్ణభగవానుని గొల్చుట సత్యమైన క
ర్తవ్యము, ఆ మహాప్రభువుదాసులతోడిది దివ్యమైన బాం
ధవ్యము, వారు మెట్టిన పథంబది యొక్కటె భవ్యమైన గం
తవ్యము సవ్యమైన భవితవ్యమటన్నను సాంబిరెడ్డిదే

వృత్తియు సత్యవాదిత, ప్రవృత్తియు ధార్మికనిష్ఠ, సర్వదా
చిత్తము కృష్ణచంద్రుపయిజేర్చిన పుణ్యుడు సాంబిరెడ్డి సా
క్షాత్తు హరిప్రియుండయిన శంకరుడో యనిపించు; వాని స
ద్వృత్తముతోడియిచ్చ సఫలీకృతమైనదగున్ శివంబగున్.

అత్యధికంబులైన విజయాలు శుభాలకు మూలమైన సం
ప్రత్యయచిత్తవృత్తి భగవంతునియందున నిల్పువాని కౌ
న్నత్యమె కల్గుగాని, అవనత్యణు మాత్రము కల్గదన్న సా
తత్యచిరంతనప్రథ కుదాహరణీయుడు సాంబిరెడ్డియే

అల నీపల్కులు చేతలున్ భగవదీయంబైనవై మా పయిన్
వెలుగుల్‌నింపును, ధర్మదీక్షగరపున్ నీనాల్క పేరింటి లో
పలిగుమ్మంబున కృష్ణనామమణి దీపంబుండె నీలోను వె
ల్వలనున్ జ్ఞానమయ ప్రకాశములె చల్లా సాంబిరెడ్డ్యగ్రణీ!

పిల్లలు పెద్దలుంజదివి పెంపువహింపగ నిట్టి యుద్యమం
బుల్లసితం బొనర్చితివహో! భగవత్కృప నీపయిన్ విరా
జిల్లినదానికిన్ ప్రబలచిహ్నము నీదగు సద్విచారమే!
కొల్లగ సాంబిరెడ్డి! కయికొమ్మిదె మా అభినందనమ్ములన్

నాలుగు వేదముల్ ప్రపఠనం బొనరింపకయుంటి, బ్రహ్మసూ
త్రాలు పఠింపకుంటిని, పురాణములన్ వినకుంటినంచునున్
జాలిపడంగనేల? మనసారగ కృష్ణుని నమ్మి కొల్చినన్
చాలు; సమస్త శాస్త్రముల సార మెఱింగినవారలౌదురే!

ఇయ్యెడ సాంబిరెడ్డి సదభీష్టముతోడుత నా అభీష్టమున్
వియ్యమునొంది నన్నలసునిన్ కృతకృత్యునిజేసె దీనికిన్
★ సయ్యపరాజమిత్రుడు పొనర్చిన సాయము, ★ గట్టుపల్లిరా
మయ్యమహోదయుండిడిన అధ్యవసాయము సంస్మరించెదన్

ఈ నిరుపేద నీ వనునయింపక పోయినఁజింతలేదు, మృ
ద్వీనిభమైన నా హృది ద్రవించును నీదయకున్ వ్రజేశ! గో
పీనయనోత్పలార్చితము పిచ్ఛిలమౌ నవనీతమైన వ్యా
ఖ్యానము నీదు కృష్ణశతకంబున జేర్చితి స్వీకరింపవే!

---

★ సయ్యపరాజు రామకృష్ణంరాజు ; ★ శ్రీ గట్టుపల్లి చెంచురామారావు

# శ్రీకృష్ణ శతకము

**శ్రీ రుక్మిణీశ! కేశవ!**
**నారద సంగీతలోల! నగధర! శౌరీ!**
**ద్వారక నిలయ! జనార్దన!**
**కారుణ్యముతోడ మమ్ము గావుము కృష్ణా! 1**

శ్రీకృష్ణా! శ్రీ రుక్మిణీ + ఈశ = రాధాదేవికిని, రుక్మిణీ దేవికిని భర్త అయినవాడా! కేశవ = బ్రహ్మ ఈశానులను గన్నవాడా! నారద సంగీతలోల = దివ్యర్షియు, మహాభక్తుడునైన నారదుని సంకీర్తన గానమునందు ఆసక్తి గలవాడా! శౌరీ = శూరవంశీయులైన వసుదేవాదులకు తన మహిమను ప్రదర్శించినవాడా! ద్వారక నిలయ = ద్వారకానగరము నివాసముగా గలవాడా! జనార్దన = భక్తులకు విరోధులైనవారిని నిర్దాక్షిణ్యముగా అణచి స్వభక్తులను రక్షించువాడా! కారుణ్యముతోడ = దయతో; మమ్మున్ కావుము=మమ్ములను రక్షింపుము.

శ్రీ అనగా ఇక్కడ రాధాదేవి అని అర్థము. శ్రీశ్చ తే లక్ష్మీశ్చ తే పత్న్యౌ వహోరాత్రే అని వేదములోనున్నది. "శ్రియా రాధయా సహితః కృష్ణః శ్రీకృష్ణ" శ్రీదేవి అయిన రాధతో సహితుడైన కృష్ణుడు శ్రీకృష్ణుడవుతాడు. కృష్ణశబ్దానికి ముందు శ్రీ శబ్దం తప్పకుండా ఉండాలి. శ్రీదేవి భగవంతునికి నిత్యానపాయిని. అనగా భగవంతు డేరూపంతో ఎక్కడున్నప్పటికీ ఆయన్ను వదలక సేవిస్తూ మెలగే ఆహ్లాదినీ (= ఆనందింపజేసే) శక్తి లేదా అంతరంగిక శక్తి రాధాదేవి.

రుక్మిణీదేవి లక్ష్మీదేవి అంశతో జన్మించింది. "రుక్మిణీ కృష్ణజన్మని" అని విష్ణుపురాణం చెబుతున్నది. విష్ణువు కృష్ణరూపంతో ఆవిర్భవించినపుడు లక్ష్మి రుక్మిణిగా అవతరించింది.

కేశవ శబ్దానికి రెండుమూడు సాధారణమైన అర్థాలున్నాయి. అవి భగవానుని లోక విడంబనేచ్ఛ (లోకాన్ని అనుకరించాలనే కోరిక)తో ప్రచారం పొందినవే

చక్కని కేశాలు కలవాడని, కేశిఅనే రాక్షసుణ్ని వధించినవాడనీ సామాన్యమైన అర్థాలను చెబుతారు. కేశవుడను పదానికి హరివంశంలో చెప్పిన అర్థమిది.

కో బ్రహ్మేతి సమాఖ్యాత ఈశో౽హం సర్వదేహినాం
ఆవాం తవాంశ సంభూతౌ తస్మాత్ కేశవనామవాన్.

శివుడు భగవంతుణ్ని స్తుతిస్తూ "ఓదేవదేవా! 'క' బ్రహ్మవాచకము, నేను సమస్త దేహధారులకు ప్రభువును. మేమిద్దరము నీ అంశతో జనించినవారము. అందుచేత నీకు కేశవుడను నామమేర్పడినది" అన్నాడు. భగవన్నామాలు 'కేశవాయ స్వాహా"తో ప్రారంభమై "శ్రీకృష్ణాయ నమః"తో ముగుస్తాయి.

కృష్ణ శబ్దానికి నల్లనివాడని సామాన్యార్థం చెబుతారు. ద్వాపరయుగంలో అనగా శ్రీకృష్ణావిర్భావకాలంలో ఎందరికో కృష్ణశబ్దం నామధేయమై ఉన్నది. ఆకాలంలో యమునానదికి 'కృష్ణ' అని పేరు. ద్రౌపదికి 'కృష్ణ' అను మరొక పేరుంది. అర్జునుడికి కృష్ణుడనే పేరున్నది. వేదవ్యాసుణ్నికూడా కృష్ణుడంటారు. లోకవిడంబనకై భగవానుడు 'కృష్ణుడు' అనగా నల్లనివాడన్న సామాన్యార్థంతోనే వ్యవహరింపబడ్డాడు. కాని, కృష్ణుడనగా కృషతీతి కృష్ణః = లీలార్థంగా ఆనందించేవాడు, 'కృషిర్భూవాచకః శబ్దః ణశ్చ నిర్వృతివాచకః కృష్ణః తద్భావయోగాచ్చ కృష్ అనునది భూమికి వాచకం. "ణ" ఆనందానికి వాచకం. సచ్చిదానంద స్వరూపుడగుటచే కృష్ణుడయ్యాడని నిరుక్తంలో ఉంది. సమస్త జీవులను తన పాదాల దగ్గరికి చేర్చుకొనేవాడు శ్రీకృష్ణుడనీ. సచ్చిదానంద స్వరూపుడగుటచే అతడు శ్రీకృష్ణనాముడయినాడనీ శ్రీశంకర భగవత్పాదులవారు తెలిపియున్నారు.

"నారద వీణోజ్జీవన సుధోర్మి నిర్యాస మాధురీపూర
త్వం కృష్ణనామ కామైః స్ఫుర మే రసనే రసేన సదా"

ఓ కృష్ణనామమా! నీవు నారదుని వీణాజీవనమవు. అమృత తరంగ సారమాధుర్యం తో నిండినదానవు. నా నాలుకను రసమయం చేస్తూ, ప్రేమోల్లాసంతో పాటు

పరమానంద సుఖానుభవం కలిగిస్తూ సదా నా జిహ్వాగ్రాన నర్తించుము అన్నాడొక భక్తకవి.

ద్వారక భారతభూమికి పశ్చిమ ద్వారమని ప్రసిద్ధి. పురుషోత్తమ క్షేత్రమైన పూరి తూర్పుద్వారం. బదరికాశ్రమం ఉత్తర ద్వారం. రామేశ్వరం దక్షిణ ద్వారమని పెద్దలంటారు. ద్వారకను ద్వారవతి, కుశస్థలి అనికూడా అంటారు.

"కారుణ్యముతోడ మమ్ముగావుము" సాంసారిక బద్ధులైన జీవులు భగవదనుగ్రహము కంటె మరి దేనిని కోరతారు?

కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః
జలం భిత్వా యథా పద్మం నరకాదుద్ధరా మ్యహమ్.

హేకృష్ణా కృష్ణా కృష్ణా అని ప్రతిదినము నన్ను స్మరించేవారిని పద్మము జలాన్ని భేదించుకొని పైకి వచ్చినట్లుగా నరకం నుండి వెడలించి ఉద్ధరిస్తాను అనేది శ్రీముఖోక్తి.

శ్రీకృష్ణనామ మహిమను గూర్చి ఈ శతకంలో పలుచోట్ల ప్రస్తావించవలసి ఉన్నది. చదువరులు పునరుక్తులుగా భావింపకుందురుగాక!

**నీవే తల్లివి తండ్రివి**
**నీవే నాతోడు నీడ నీవే సఖుడౌ**
**నీవే గురుడవు దైవము**
**నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా! 2**

ఓకృష్ణా! నిజముగా = సత్యముగా; నీవే = నీవు మాత్రమే తల్లివంటివాడవు. తండ్రివి = కన్నతండ్రివంటివాడవు. నీవే నాతోడు = నీవు మాత్రమే సహాయ పడువాడవు. నీడ = నీడవలె వెన్నంటియుండువాడవు. నీవే సఖుడు+ఔ = నీవు మాత్రమే స్నేహితుడవు. నీవే గురుడవు, దైవము = దైవమును; నీవే నా పతియు = నీవు మాత్రమే నాకు ప్రభుడవు. గతియు = పొందదగినవాడవు.

ఇది సమస్త మత సంప్రదాయముల వారును చేయు ప్రార్థన.

"త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ

త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ"

గీతోపదేశ సందర్భమున శ్రీకృష్ణుని విశ్వరూపమును దర్శించి అర్జునుడు ఆశ్చర్యచకితుడై అంటాడు :

"పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
న త్వత్సమో ఽస్త్యభ్యధికః కుతో ఽన్యో
లోకత్రయే ఽప్యప్రతిమప్రభావ" గీత. 11-43

"శ్రీకృష్ణా! నీవు ఈచరాచర ప్రపంచమునకు తండ్రివి. ఆచార్యుడవు. నీతో సమానుడు గానీ, నీకంటె అధికుడుగానీ లేరు. నీప్రభావము సాటిలేనిది." అని.

కృష్ణ నామ మహిమను గురించి పద్మపురాణము:-

కీర్తనాదేవ కృష్ణస్య విష్ణో రమితతేజసః
దురితాని విలీయంతే తమాంసీవ దినోదయే

అప్రమేయ తేజస్విఅయిన శ్రీకృష్ణనామ సంకీర్తన మాత్రముచేత సూర్యోదయముతో అంధకారము సమసి పోవునట్లుగా పాపము పటాపంచలై పోవును అంటున్నది.

గీతలోని శ్రీకృష్ణోక్తిని మననము కావించియే ఈకవి ఈపద్యము రచించెనను కొందును.

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్ (గీత 9-18)

శ్రీకృష్ణుడు అనేక రూపాలలో అభివ్యక్తమవుతాడు. శ్రీకృష్ణుడు లక్ష్యమైనవాడు జీవుడు. ఆయనను అనుగమించుట ఆవశ్యకముగాన ఆయన "గతి" అయినాడు. ఈ విశ్వభరణ పోషణలకు కారణమైనవాడు కావున ఆయన "భర్త" అయినాడు. విశ్వమును శాసించువాడు కనుక "ప్రభు"వైనాడు. జీవుల కృతాకృత కర్మలకు ద్రష్ట ( = చేసిన, చేయని పనులను చూస్తూ ఉండేవాడు) కావున ఆయన 'సాక్షి' అయినాడు ఈ విశ్వమునందు వసించువాడు కావున 'నివాసు'డైనాడు. అర్తుల

పీడలను తొలగించువాడు కావున 'శరణ' మైనాడు. ప్రత్యుపకారము కోరని మిత్రుడు కనుక 'సుహృత్తు' అయినాడు. విశ్వోత్పత్తి చేయువాడు కావున "ప్రభువు"ఐనాడు. అంత్యకాలమున విశ్వము ఆయనలో లీనమగునుగావున 'ప్రళయ'మైనాడు. జగత్తుయొక్క అధిష్ఠానము ఆయనలో ఉన్నది కనుక "స్థాన' 'మైనాడు. కాలాంతరమున ఉపభోగయోగ్య కర్మలకు భండారమైనవాడు కావున 'నిధాన'మైనాడు. సమస్తమునకు ఉత్పత్తికి బీజమైనవాడు కావున 'అవ్యయు' డైనాడు.

**నారాయణ! పరమేశ్వర!**
**ధారాధర నీలదేహ! దానవవైరీ!**
**క్షీరాబ్ధిశయన! యదుకుల**
**వీరా! ననుగావు కరుణ వెలయగ కృష్ణా! 3**

నారాయణ= ఓ విష్ణూ! పరమ+ఈశ్వర = శ్రేష్ఠుడవైన ఓప్రభూ! ధారాధర నీలదేహ=మేఘము వలె నల్లని శరీరము గలవాడా! దానవవైరీ= రాక్షసులకు శత్రువైనవాడా! క్షీర+అబ్ధి-శయన = పాలసముద్రమందు శయనించిన వాడా! యదుకుల వీరా=యాదవవంశమునందు వీరుడైనవాడా! కృష్ణా! కరుణ వెలయగన్=కారుణ్యాతిశయముతో; ననున్ కావుము=నన్ను కాపాడుము.

"విష్ణుః నారాయణః కృష్ణో" అని అమరనిఘంటువు. అమరనిఘంటువు రచించిన అమరుడు బౌద్ధ సంప్రదాయమునకు చెందినవాడు. అతడు విష్ణువునకు నారాయణునకు కృష్ణునకు భేదమును చెప్పలేదు. నారాయణుడే కృష్ణుడు. విష్ణువే కృష్ణుడు అని సమస్త పురాణములు చెప్పిన విషయమును స్వీకరించి అమరకవి విష్ణునామములలో కృష్ణనామమును చేర్చియున్నాడు.

భగవన్నామములలో అప్రాకృతమైనవి, అతిరహస్యమైనవి నారాయణ, వాసుదేవ శ్రీకృష్ణ గోవిందాది నామములు.

నరమనగా ఆత్మయని అర్థము. అందు నుండి ఉత్పన్నమైన ఆకాశాదులు నారములు. వాటిలో కారణరూపమున కార్యరూపమున వ్యాప్తమై నివసించువాడు

నారాయణుడు.

యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః

అని వేదమంత్రము వర్ణిస్తున్నది.

ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్ద మేకం విముక్తదుఃఖాః సుఖినో భవన్తి

పీడితులు, విషాదగ్రస్తులు, భయభీతులు, భయానకమైన రోగములచే పీడింపబడువారలు ఒకసారి నారాయణ నామ కీర్తనము కావింతురేని సమస్త దుఃఖములకు దూరమైనవారై సుఖమును పొందుదురు. భక్త రక్షణకు శ్రీమన్నారాయుణుడు - శ్రవణ స్మరణ కీర్తన ధ్యానములకు శ్రీకృష్ణుడు సంపన్నమైన వారగుదురు.

వామన పురాణమున :

నారాయణో నామ నరో నరాణాం
ప్రసిద్ధ చౌరః కథితః పృథివ్యామ్
అనేక జన్మార్జిత పాపసంచయం
హరత్యశేషం శ్రుతమాత్ర ఏవ.

భూతలమందు నారాయణనామరూపుడైన సుప్రసిద్ధుడగు చోరుడొకడున్నాడు. అతని పేరు విన్న మాత్రము చేతనే అనేక జన్మలలో మనుష్యులు సంపాదించుకొన్న పాపసంచయమంతయును అపహరింపబడుచుండును.

'ఓమ్ నమో నారాయణాయ' ఇది అష్టాక్షర మంత్రము. "ఓమ్ నమో భగవతే వాసుదేవాయ" ఇది ద్వాదశాక్షర మంత్రము. ఈమంత్రములను సద్గురువు వద్దనే ఉపదేశము పొందవలయును. "ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునఃపునః, ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా" (పద్మపురాణం) సమస్త శాస్త్రాలను పదేపదే పరిశీలింపగా తేలిన సారాంశ మేమంటే సదా ధ్యానింప దగినవాడు శ్రీమన్నారాయణుడే అని. స్కాందపురాణ ప్రభాస

ఖండమందు, లింగపురాణమునందును చెప్పబడినది.

**హరియను రెండక్షరములు**
**హరియించును పాతకముల నంబుజనాభా!**
**హరి నీ నామమహత్త్వము**
**హరిహరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా! 4**

అంబుజనాభా = పద్మము నాభిగా కలిగిన ఓకృష్ణా! హరి అనే రెండక్షరములు కలిసి, పాతకములను = పాపములను, హరించును= పోగొట్టును; హరిహరి = కృష్ణకృష్ణా! నీనామమహత్త్వమున్= నీనామము యొక్క మహిమను, పొగడంగ వశమె=పొగడుటకు సాధ్యమగునా! హరి అయిన ఓ శ్రీకృష్ణా!

"సకృదుచ్చారితం యేన హరిరిత్యక్షర ద్వయం
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి"

ఎవడొక్కసారి 'హరి' అను రెండక్షరములను శ్రద్ధగా ఉచ్చరించునో అతడు మోక్షము పొందుటకు సన్నాహమైనవాడగును.

కలిసంతరణోపనిషత్తులోని మహామంత్ర మిది:

"హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే"

ఇది మహామంత్రము. ఇందలి పదహారు నామములను శ్రద్ధాభక్తులతో ఉచ్చరించినచో కలి ప్రభావమున కలిగిన సకల పాపములు నష్టమై పోవును.

"హరతి యోగిచేతాంసీతి హరిః" యోగుల చిత్తము హరించువాడని అర్థము.

హరి ర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః

అనిచ్ఛతో తాకినప్పటికి అగ్ని అంటుకొను విధమున దుష్టచిత్తుడు సైతము ఇష్టములేకయే హరిని స్మరించుచో అతని పాపములు భస్మీపటలమగును.

"సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్" అని గీత.

సమస్త జీవుల యందు సమాన భావముతో ఉండినవాడు పరమేశ్వరుడు. ఏ పురుషుడు తనను చూచునో అతనిని తాను చూచువాడు పరమేశ్వరుడు.

నామ్నోఽస్య యావతీ శక్తిః పాపనిర్హరణే హరేః
తావత్కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జనః

- బృహద్విష్ణుపురాణం

శ్రీహరి అనే నామంలో పాపనాశనశక్తి ఉన్నంతగా పాతకులకు పాపంచేసే శక్తి ఉండదు.

హరినామపరా యే చ ఘోరే కలియుగే నరాః
త ఏవ కృతకృత్యాశ్చ న కలి ర్బాధతే హి తాన్ (బృహన్నారదీయము)

ఈఘోరమైన కలియుగంలో మనుష్యులు హరినామాన్ని శరణుచొచ్చినచో ధన్యులగుదురు. కలికాలం వారిని బాధింపదు.

"హరిశ్శరణమ్" అనునది ఒక మంత్రము. హరిని అనగా శ్రీకృష్ణుని తన మనస్సులో దృఢముగా పాదుకొల్పుకొన్న శ్రీకృష్ణభక్తులను కాలమెంత కఠిన మైనను బాధింపజాలదు.

భగవత్యేవ సతతం స్థాపనీయం మనః స్వయం
కాలోఽయం కఠినోఽపి శ్రీకృష్ణభక్తాన్న బాధతే
హరిః సేవ్యో, హరిః జ్ఞేయో, హరిర్ధ్యేయో నిరంతరం,
హరిః శ్రావ్యో, హరిర్గేయో, హరిమేవాప్నుయా త్తదా

భగవన్నామము అనంత శక్తి భండారము.

న గంగా న గయా సేతుర్న కాశీ న చ పుష్కరం
జిహ్వాగ్రే వర్తతే యస్య హరిరిత్యక్షరద్వయం
ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః
అధీతాస్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్
అశ్వమేధాదిభిర్యజ్ఞైః నరమేధైః సదక్షిణైః
యజితం తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్

ప్రాణప్రయాణపాథేయం సంసారవ్యాధిభేషజం
దుఃఖక్లేశపరిత్రాణం హరిరిత్యక్షరద్వయం.

ఎవనినాల్కమీద 'హరి' అనే ఈ రెండక్షరాలు నిరంతరం వసించుచుండునో వానికి గంగా గయాది పుణ్యక్షేత్రాల ఆవశ్యకత ఉండదు. అనగా పుణ్యనదీ స్నానఫలము, పుణ్యక్షేత్ర పర్యటన ఫలము ఆరెండక్షరాలే ప్రసాదిస్తాయి. 'హరి' అను రెండక్షరాలను ఉచ్చరించువానికి వేదాదులను అధ్యయనము చేయవలసిన పని ఉండదు. అనగా ఆ రెండక్షరాలే అతనికి ఆపుణ్యఫలాన్ని చేకూరుస్తాయి. అలాగే యజ్ఞయాగాది ఫలాన్ని కూడా 'హరి' అను రెండక్షరాలే సమకూరుస్తాయి. సంసారమనే వ్యాధికి సిద్ధౌషధమువంటిది 'హరి'అను అక్షరద్వయము. జీవితంలోని దుఃఖాన్ని క్లేశాన్ని తొలగించి, మనుష్యుణ్ని రక్షిస్తుంది "హరి" అనే అక్షరద్వయము.

"తస్మాద్లోకోద్ధారణార్థం హరినామ ప్రకాశయేత్" లోకాన్ని సముద్ధరించడం కోసం హరినామాన్ని ప్రచారం చేయవలసిందని శ్రీశంకరుడు పార్వతీదేవికి చెప్పాడు.

**క్రూరాత్ముఁ డజామీళుడు**
**నారాయణ యనుచు నాత్మనందను బిలువన్**
**ఏరీతి నేలుకొంటివి**
**యేరీ నీసాటి వేల్పు లెందును కృష్ణా! 5**

కృష్ణా! క్రూర + ఆత్ముడు = దుష్టమనస్సుగలవాడైన, అజామీళుడు= అజామీళుడను బ్రాహ్మణుడు, ఆత్మనందను=తనకుమారుని; నారాయణ= నారాయణ అని సంబోధించి, పిలువన్=పిలువగా, ఏరీతిన్= ఏవిధముగా; ఏలుకొంటివి=రక్షించితివి. ఎందును=ఎక్కడనైనను, నీసాటి వేల్పులు=నీతో సమానమైన దేవతలు; ఏరీ= ఎక్కడనున్నారు?

భగవన్నామ మహిమను తెలుపుటకు ఉద్దేశించినది భాగవతమందలి అజామిళుని వృత్తాంతము. (అజామిలుడు రూపాంతరము అజామిళుడు)

అజామిళుడు కర్మనిష్ఠుడైన ఒక బ్రాహ్మణుడు. అనేక శాస్త్రములను

చదివి ప్రసిద్ధుడైనవాడు. పవిత్రుడు. అతడొకనాడు తండ్రి అనతితో అడవికి వెళ్ళి పూలు, పండ్లు సమిధలు తెస్తూ ఉండగా శరీరసంపర్కంతో తన్మయత్వం చెందే వేశ్యస్త్రీపురుషులను చూచాడు. వారిద్దరు మద్యం త్రాగి విచ్చలవిడిగా విహరిస్తున్నారు. ఆవేశ్య అర్ధనగ్నంగా ఉంది. ఆమె హావభావాలను చూచే సరికి అజామీళుని మనస్సు చెదరి పోయింది.

అజామీళుడు ఆ దాసి సంపర్కం కోరుకొని, ఆమెను తనయింటికి తెచ్చుకొని, కట్టుకొన్న భార్యను వదలివేశాడు. ఆ వేశ్యాసంపర్కంతో నీచమైన వృత్తిలోనికి దిగాడు. అనేక దుష్కార్యాలు చేశాడు. అతనికి ఆమెవల్ల పదిమంది పుత్రులు కలిగారు. వారిలో చిన్నవాని పేరు 'నారాయణ'. ఆ నారాయణుణ్ని అజామీళుడు చాలా ప్రేమతో చూచేవాడు. పిలిచేవాడు.

అజామీళుడు వృద్ధుడైనాడు. మంచాన పడ్డాడు. అతని సూక్ష్మజీవాన్ని తీసుకుపోవడానికి యమదూతలు వచ్చారు. తన ప్రాణం సంగతి తెలుసుకొని దూరాన ఆడుకొంటున్న నారాయణుణ్ని ఎలుగెత్తి పిలిచాడు అజామీళుడు.

నామం - నామాభాసం - భక్త్యాభాసం - భక్త్యాభాసాపరాధం కూడా వ్యర్థం కావు అనడానికి దృష్టాంతమిది.

నారాయణ అనే పిలుపు వినే సరికి అక్కడికి విష్ణుదూతలు వచ్చారు. అజామీళుని సూక్ష్మజీవాన్ని తీసుకుపోతున్న యమదూతలను విష్ణుదూతలు అడ్డగించారు. యమ-విష్ణుదూతలు వివాదపడ్డారు.

యమదూతలు అజామీళుడు చేసిన దుష్కార్యాలనన్నిటిని ఏకరువు పెట్టి ఇతడు నరకవాసానికే అర్హుడని వాదించారు. అతని పాపానికి ప్రాయశ్చిత్తం లేదని తెలిపారు. అప్పుడు విష్ణుదూతలు ఇలా తెలిపారు.

"అయం హి కృతనిర్వేశో జన్మకోట్యంహసా మపి
యద్ వ్యాజహార వివశో నామ స్వస్త్యయనం హరేః
ఏతేనైవ హ్యఘో నోఽస్య కృతం స్యాదఘనిష్కృతం
యదా నారాయణా యేతి జగాద చతురక్షరమ్" (శ్రీమద్భా. 6-2-7,8)

"యమదూతలారా! ఈఅజామిళుడు కోటికోటి జన్మలలోని పాపరాశికి పూర్తిగా ప్రాయశ్చిత్తం చేసుకొన్నాడు. ఏమనగా; ఇతడు వివశుడైయుండి కూడా పరమకళ్యాణమయమూ, మోక్షప్రదమూ అయిన నారాయణ నామాన్ని ఉచ్చరించాడు. కాబట్టి ఇతని పాపాలకన్నింటికి ప్రాయశ్చిత్తం జరిగి పోయింది. ప్రాయశ్చిత్తక్రియల కన్నిటికంటె భగవన్నామోచ్చారణమే గొప్ప ప్రాయశ్చిత్తం. భగవన్నామోచ్చారణ వల్ల భగవంతునికి అతని యందు ఆత్మీయత ఏర్పడింది. అందుచేత విష్ణులోకానికి తీసుకవెళ్లడానికి మేము వచ్చాము. మీరు అడ్డువస్తే, మీకేకాదు, మీప్రభువునకు కూడా హాని కలుగుతుంది. జాగ్రత్త" అని హెచ్చరించి దాసీపతి అయిన అజామిళుని పరంధామానికి తోడ్కొని పోయారు విష్ణుదూతలు.

యమదూతలు తిరిగివచ్చి యమధర్మరాజుతో తమ పరాభవాన్ని గూర్చి చెప్పుకొన్నారు. విష్ణుదూతల వాదన వినిపించారు. అంతా విని యముడు విష్ణుభక్తుల జోలికి పోవద్దని వారికి హితవు చెప్పి, విష్ణుదూతల దర్శనమైనందుకు వారి అదృష్టాన్ని మెచ్చుకొని ఇలా అన్నాడు.

తే దేవసిద్ధపరిగీతపవిత్రగాథా
యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః
తాన్ నోపసీదత హరే ర్గదయాభిగుప్తాన్
నైషాం వయం న చ వయః ప్రభవామ దండే (శ్రీమద్భా. 6-3-27)

సమదర్శనులు, ప్రపన్నులు అయినవారు భగవంతుణ్ని తమకు సాధ్యంగాను, సాధనంగాను భావించి, భగవంతుని యందు తమ భారమంతా మోపి నిశ్చింతగా ఉంటారు. పెద్దపెద్ద దేవతలే, సిద్ధపురుషులే వారి పవిత్ర చరిత్రను గానం చేస్తుంటారు. ఓనాదూతలారా! అలాంటి వారి దగ్గరికి మీరు పొరపాటుననైనా పోవద్దు. వారి వద్ద భగవంతుని గదాయుధం ఉండి, సదా వారిని రక్షిస్తుంటుంది. అట్టివారిని దండించడానికి నాకు సాధ్యంకాదు సరిగదా సాక్షాత్తు మహాకాలునికి కూడా సామర్థ్యం లేదు.

పరమహంసలు, దివ్యరసలోలుపులై తమ శరీరం పట్ల మమత, అహంతల

విడనాడి అకించనులై నిరంతరం శ్రీకృష్ణభగవానుని పాదారవింద మకరందాన్ని క్రోలుతూ ఉంటారు. అట్టి దివ్యరసానికి విముఖులై సంసారాసక్తి పీడితులైన వారిని నరకద్వారం దాకా ఈడ్చుక వచ్చి నావద్దకు తీసుకురండి. ఎవని నాలుక భగవంతుని గుణాలను, నామాలను కీర్తించదో ఉచ్చరించదో, ఎవని చిత్తము భగవచ్చరణారవిందాలకు పదేపదే మ్రొక్కదో ఆపాపులను నావద్దకు తీసుకు రండి. కఠినంగా శిక్షిస్తాను. ఇవ్వేళ మీరు భగవత్పార్షదులను అవమానించారు. అది నా అపరాధం.

జిహ్వా న వక్తి భగవద్గుణనామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిందం
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయధ్వ మసతోఽకృతవిష్ణుకృత్యాన్ (శ్రీమద్భా. 6-3-29)

అజామిళుడు ప్రాణాపాయ సమయంలో తన ప్రియపుత్రుణ్నే అయినా ఆర్తితో పిలిచాడు. ద్రౌపది కౌరవరాజసభలో దుశ్శాసనుని చేత అవమానింపబడుతూ ఆర్తితో మరెవరినీ కాక, తననే పిలిచినందులకు శ్రీ కృష్ణుడు వెంటనే వచ్చి ఆమెను కాపాడినాడు. ఆర్తితో పిలిచిన ఆపిలుపు తనకు తీర్చజాలని అప్పుగా వ్రేగై ఉన్నదని శ్రీకృష్ణభగవానుడు పాండవులకు సదా సహాయుడై నిలిచాడు.

"యద్ గోవిందేతి చుక్రోశ కృష్ణా మాం దూరవాసినం
ఋణమేతత్ ప్రవృద్ధం మే హృదయాన్నాపసర్పతి" -(మహాభారతం)

"ఏరీ నీసాటి వేల్పు లెందును కృష్ణా!" "నీకు సాటివచ్చు దేవతలెవ్వరును లేరు" అను ఈస్తుతి వాక్యంలో స్వభావోక్తియేకాని, అతిశయోక్తి లేదు.

భగవద్గీతలో అర్జునుడు శ్రీకృష్ణుని విశ్వరూపం దర్శించినపుడు ఈవిధంగానే స్తుతించాడు.

"న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ"

"ముల్లోకాలలో నీతో సమానుడు గాని, నీకంటె అధికుడుగాని లేడు" అని.

**చిలుక నొక రమణి ముద్దుల**
**చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతి పేరం**
**బిలిచిన మోక్షము నిచ్చితి**
**వలరగ మిము దలచు జనుల కరుదా కృష్ణా! 6**

కృష్ణా! ఒక రమణి=ఒక సౌభాగ్యవతి, చిలుకను=పక్షిజాతికి చెందిన చిలుకను, ముద్దులు చిలుకన్= ముద్దులొలుకునట్లుగా శ్రీరామ అనుచు= శ్రీరామా అని సంబోధించుచు, శ్రీపతి పేరన్= శ్రీవిష్ణునామముతో, పిలిచినన్= పిలిచినందువల్ల, మోక్షమును+ఇచ్చితివి= ముక్తినొసగితివి. అలరగ = సంతోషముగా మిమున్ తలచు జనులకు= సంతోషంగా మిమ్ము ధ్యానించే జనులకు, ముక్తి, అరుదా= ఆశ్చర్యమా! కృష్ణా!

శ్రీరామనామము: "రమంతే యోగినోఽస్మిన్నితి రామః" దేనియందు యోగీశ్వరులు ఆనందింతురో దాని పేరు శ్రీరాముడు.

"రమంతే యోగినోఽ నంతే నిత్యానందే చిదాత్మని,
ఇతి రామపదేనాసౌ పరంబ్రహ్మాభిధీయతే"

అనంతమైన చిదాత్మయగు ఏపరబ్రహ్మమునందు యోగీశ్వరులు ఆనందింతురో అదియే 'రామ'నామము.

"రమతే సర్వభూతేషు స్థావరేషు చరేషు చ
అంతరాత్మస్వరూపేణ యశ్చ రామేతి కథ్యతే"

పరమాత్ముడు నిరాకారరూపంతో స్థావర జంగమాది సమస్తప్రాణులలో రమణ మొనర్చుచుండుట చేత "రాము"డైనాడు.

అజామీళుడు మరణాసన్నసమయంలో నారాయణా అని తన కుమారుణ్ని పిలిచినందువల్లనే భగవంతుడు సంతోషించి అతనికి ముక్తినిచ్చాడు. అజామీళుడు భగవంతుణ్ని పిలువలేదు- తన కుమారుణ్ని పిలిచాడు. ఇక్కడ పంజరంలోనున్న పక్షిజాతికి చెందిన చిలుకను ఒక విలాసవతి శ్రీరామా అని పేరుపెట్టి ఉల్లాసంతో పిలువసాగేది. ఆమె పిలిచినది చిలుకనే కాని నిజానికి శ్రీరాముణ్ని కాదు.

అంతమాత్రానికే సంతోషించి భగవంతు డామెకు మోక్షమిచ్చాడు.

సంతోషసమయంలో భగవంతుణ్ని ధ్యానించడం సౌభాగ్యం. ఆపత్సమయం లో భగవంతుణ్ని తలచుకోవడంలో ఏమంత విశేషం లేదు.

ఒక నగరంలో జీవంతి అనే వేశ్య పడుపువృత్తితో జీవిస్తున్నది. ఒకనాడు చిలుకలు అమ్మేవాని నుండి ఒక చిలుకను కొన్నది. తనకు సంతానం లేదు. కావున, ఆచిలుకను అతి ప్రేమతో పెంచుతూ దానికి 'రామరామ' అనుమాటలను నేర్పింది. రామ అనగానే ఆచిలుక లేచి వచ్చి జీవంతి తొడపై వ్రాలుతుండేది. కొంతకాలానికి జీవంతికి, చిలుకకు అవసానకాలం ప్రాప్తించింది. ఇద్దరూ రామరామ అంటూ మరణించారు.

లోక పరలోక భయం లేకుండగా వ్యభిచరించిన వేశ్యను కొనిపోయేందుకు యమదూతలును, 'రామరామ' అని మరణించడం చేత ఆమెను స్వర్గానికి కొనిపోవుటకు విష్ణుదూతలును వచ్చారు. ఒకరు ఈమె పాపి అనగా, మరొకరు పుణ్యవతి అని వాదింపసాగారు. వారి కలహం చివరకు యుద్ధంగా మారింది. విష్ణుదూతలచే దెబ్బలు తిని యమదూతలు యముని దగ్గరికి వెళ్లి జరిగినదంతా చెప్పి "ప్రభూ! ఈ పరాభవం మాది కాదు. ఇదిమీదే" అని చెప్పుకొని ఖేదపడసాగారు. అప్పుడు యముడు

దూతా యది స్మరంతౌ తౌ రామనామాక్షరద్వయమ్
తదా న మే దండనీయౌ తయో ర్నారాయణః ప్రభుః

"దూతలారా! వారు మరణించు సమయమున రామ అను రెండక్షరాలు పలికినవారు కావున, వారు మనచేత దండింపదగినవారుకాదు.

వారికి ప్రభువు శ్రీమన్నారాయణుడు. కావున వేశ్యయు చిలుకయు వైకుంఠమున కేగుటకు అర్హులు" అని చెప్పాడు.

మృత్యుకాలే ద్విజశ్రేష్ఠ రామేతి నామ యః స్మరేత్
స పాపాత్మాపి పరమం మోక్షమాప్నోతి జైమినే

ఓ జైమినీ! మృత్యుసమయమందు రామనామ స్మరణచేసినవాడెంత

పాపాత్ముడైనను మోక్షపదవిని పొందుతాడు. రామనామం సమస్త అమంగళాలను అణచి, మనోభీష్టాలను నెరవేర్చి మోక్షం ప్రసాదిస్తుంది.

**అక్రూరవరద! మాధవ!**
**చక్రాయుధ! ఖడ్గపాణి! శౌరి! ముకుందా!**
**శక్రాది దివిజసన్నుత**
**శుక్రార్చిత! నన్ను కరుణ జూడుము కృష్ణా!** 7

కృష్ణా! అక్రూర వరద=అక్రూరుడను భక్తునకు వరము లిచ్చినవాడవు. మాధవ= లక్ష్మీపతివి. చక్రాయుధ=సుదర్శన చక్రము ఆయుధముగాగలవాడవు. ఖడ్గపాణి= నందకమను పేరుగల ఖడ్గము చేతియందు గలవాడవు. శౌరి = పరాక్రమము గలవాడవు, అయిన ముకుందా=మోక్షమునిచ్చువాడా! శక్ర+ఆది= దివిజ సన్నుత= ఇంద్రాది దేవతలచే స్తుతింప బడువాడా! శుక్ర+అర్చిత= భార్గవునిచే పూజింపబడిన వాడా! ఓకృష్ణా! నన్ను కరుణతో చూడుము.

అక్రూరుడు యాదవవంశీయుడు. ఇతడు శ్రీకృష్ణునికి మామ వరుసవాడవుతాడు. ఇతని తల్లిదండ్రులు గాందినీశ్వఫల్కులు. కంసుడు శ్రీకృష్ణబలరాములను బృందావనం నుండి ధనుర్యజ్ఞానికి మథురకు తోడ్కొని వచ్చే భారాన్ని అక్రూరునికి అప్పగించాడు. ఈపనిమీద అక్రూరుడు బృందావనానికి రావడం తెలుసుకొని గోపికలు అక్రూరుణ్ని క్రూరునిగా పేర్కొన్నారు. కృష్ణబలరాములతోడి వియోగం సహింపలేక ఇలా పేర్కొన్నారు. కాని, అక్రూరుడు సజ్జనుడు, శ్రీకృష్ణభక్తుడు.

శ్రీకృష్ణబలరాములను తోడ్కొని అక్రూరుడు ప్రాతఃకాలమున మథురకు ప్రయాణమయ్యాడు. యమునానది దగ్గరికి రాగానే అక్రూరుడు కృష్ణబలరాములను తన రథంలోనే కూర్చుండ నియమించి యమునలో స్నానాకి దిగాడు. అతడు యమునానది జలాలలోను, ఇతర స్థలాలలోను సర్వత్ర శ్రీకృష్ణుణ్ని విష్ణుభగవానునిగా దర్శించాడు. అతని ఆశ్చర్యానికి అంతులేదు. భగవంతుని అవతార దశకాన్ని స్తుతించాడు. శ్రీకృష్ణుణ్ని సర్వలోకేశ్వరునిగా గ్రహించాడు.

కంసుని వధించిన తర్వాత శ్రీకృష్ణుడు బలరామునితోను, ఉద్ధవునితోను అక్రూరుని ఇంటికి వెళ్లాడు. అప్పుడతడు మహావైభవముగా శ్రీకృష్ణునికి స్వాగతమిచ్చాడు.

శ్రీకృష్ణుని ఆనతితో అక్రూరుడు హస్తినాపురంలో ఉన్న కుంతీపుత్రుల స్థితిగతులను తెలుసుకోడానికి వెళ్లాడు. ధృతరాష్ట్రునికి, కృష్ణబలరాముల పరాక్రమం తెలిపి, అతని కూటనీతిని బైటపెట్టి పాండవులపట్ల గౌరవంగా వ్యవహరించమని బోధించాడు. ఉగ్రసేనుని యాదవసభాసదులలో అక్రూరుడొకడు. జరాసంధుడు దండెత్తి వచ్చినపుడు శ్రీకృష్ణుడితని సేవలను అందుకొన్నాడు.

స్యమంతకమణి కలహంలో శతధన్వుడు సత్రాజిత్తును అర్ధరాత్రి వధించి అతని వద్దనున్న స్యమంతకమణిని హరించాడు. ఈసంగతి తెలుసుకొన్న శ్రీకృష్ణునికి భయపడి శతధన్వుడు అక్రూరుని సహాయమర్థించాడు. శ్రీకృష్ణుణ్ని గెలిచేవారు ముజ్జగాలలో లేరని తెల్పి అక్రూరుడు శతధన్వుని మైత్రికి స్వస్తిచెప్పాడు. అప్పుడు శతధన్వుడు స్యమంతకమణిని అక్రూరుని వద్ద భద్రపరిచి పారిపోయాడు. శ్రీకృష్ణబలరాములు శతధన్వుని వెంబడించారు. శ్రీకృష్ణుడు చక్రాయుధంతో శతధన్వుని వధించాడు. శతధన్వుని వధ విని అక్రూరుడు భయపడి ద్వారక విడిచి కాశికి వెళ్ళాడు. అక్రూరుడు ద్వారకలో లేనందున అనావృష్టి వంటి ఉపద్రవాలు కలిగాయనే నెపంతో కాశినుండి ద్వారకకు రప్పింపబడ్డాడు. అప్పుడతడు తనవద్దనున్న స్యమంతకమణిని శ్రీకృష్ణునికిచ్చి శ్రీకృష్ణునిపట్లనున్న అపోహలను తొలగించాడు.

శ్రీకృష్ణుడు బంధుమిత్రులకందరికి స్యమంతకమణిని చూపించి, తన అపకీర్తిని పోగొట్టుకొని, మరల ఆమణిని అక్రూరునికే అప్పగించాడు.

**నందుని ముద్దుల పట్టిని**
**మందరగిరిధరుని హరిని మాధవు విష్ణున్**
**సుందరరూపుని మునిగణ**
**వందితు నినుదలతు భక్తవత్సల కృష్ణా! 8**

కృష్ణా! భక్తవత్సల=భక్తులయందు వాత్సల్యము గలవాడా! నందుని ముద్దుల పట్టిని=నందుని గారాబు కుమారుని, మందరగిరి ధరుని=మందరమను పర్వతమును ధరించినవానిని, హరుని=పాపములను హరించువానిని, మాధువున్ =లక్ష్మీదేవికి పతియగువానిని, విష్ణున్=సర్వవ్యాపకుడగువానిని; మునిగణ వందితున్= మునుల సమూహము చేత నమస్కరింపబడినవానిని, నిన్ను తలతున్= స్మరింతును.

దేవమీఢుడను యాదవరాజునకు ఇద్దరు భార్యలు. వారిలో ఒకరు క్షత్రియ స్త్రీ. వేరొకరు వైశ్యస్త్రీ. క్షత్రియ స్త్రీకి శూరుడు, వైశ్యస్త్రీకి పర్జన్యుడు జన్మించారు.

శూరుని భార్య మారిష. ఈమెకు తొలికాన్పున కుంతి జన్మించింది. ఆతర్వాత ఆమెకు వసుదేవుడు జన్మించాడు. ఇంకను పెక్కండ్రు పుత్రీపుత్రులు ఆమెకు కలిగారు. వసుదేవుని భార్య దేవకి.

పర్జన్యునకు అయిదుగురు కుమారులు. వారిలో మధ్యముడు నందుడు. నందుని భార్య యశోద. పూర్వ జన్మలో నందుడు ద్రోణుడను వసువు. "ద్రోణో వసూనాం ప్రవరః" వసువులలో ద్రోణుడు మిక్కిలి శ్రేష్ఠుడు. యశోద 'ధర' అను పేరుతో ద్రోణునకు భార్య అయింది. ఆదంపతులు శ్రీవిష్ణువును గూర్చి తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి శ్రీవిష్ణువు వరమువేడుమన్నాడు. సచ్చిదానంద స్వరూపుడవైన నీవంటి కుమారుడు కావలయునని వారు కోరారు. శ్రీవిష్ణువు వారికోరిక నెరవేర్చడానికి ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడై వారింట ఆవిర్భవించాడు. నందయశోదలు ఆ కృష్ణుని లాలనపోషణలు జరిపారు. ఒక భక్తుడిలా అన్నాడు. భవసాగరభయంతో కొందరు శ్రుతులను, స్మృతులను మహాభారతాన్ని కొలుస్తారు. నేనైతే నందుణ్ని కొలుస్తాను. ఎందుకంటే ఆయన ఇంటిలో సాక్షాత్పరబ్రహ్మం శోభిల్లుతున్నాడు. "శ్రుతిమపరే స్మృతిమపరే భారత మపరే భజంతు భవభీతాః, అహమపి నందం వందే యస్యాళిందే పరంబ్రహ్మ".

శ్రీవిష్ణువు సముద్రమథన సమయంలో మహాకూర్మమై మందరగిరిని ధరించాడు.

సుందరరూపుడు శ్రీకృష్ణుడు. మన్మథ మన్మథుడని శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణుని అత్యద్భుత సౌందర్యము వర్ణితమయింది. 'మా' అనగా లక్ష్మి. ధవుడనగా భర్త. మాధవుడు= లక్ష్మీపతి.

**ఓ కారుణ్యపయోనిధి!**
**నా కాధారంబ వగుచు నయముగ బ్రోవన్**
**నాకేల యితర చింతలు**
**నాకాధిపవినుత! లోకనాయక! కృష్ణా!** 9

కృష్ణా! ఓ కారుణ్యపయోనిధి, ఓదయాసముద్రుడా! నాక+అధిప, వినుత = స్వర్గమునకు అధిపతి అయిన దేవేంద్రునిచే స్తుతింపబడినవాడా! లోకనాయక= పదునాలుగు భువనములకు అధిపతి యగు ఓ శ్రీకృష్ణా! నీవు, నాకు+ ఆధారంబవు+అగుచు= నాకు ఆధారమైనవాడవై, నయముగ= ప్రియముగా, ప్రోవన్= సంరక్షించుచుండగా, నాకు+ఏల ఇతర చింతలు = ఇతరమైన విచారములు నాకెందులకు? ఇక నేను దేనిని గూర్చి విచారింపవలసిన పనిలేదు.

ఈపద్యంలో శ్రీకృష్ణ భగవానుడిచ్చిన చరమ శ్లోకార్థం స్ఫురిస్తున్నది.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

(గీత. 18 66)

భక్తుడు భగవంతుణ్ని శరణుచొచ్చిన తర్వాత అతనిని రక్షించే భారం భగవంతునిదై ఉంటుంది. అప్పుడిక భక్తునికి విచార మెందులకు? 'మా శుచః' దుఃఖింపకు. భగవంతుని ఆశ్రయించిన తర్వాతకూడా భక్తుడు దుఃఖిస్తే భగవంతుని రక్షణభారం పట్ల అతనికి విశ్వాసం లేనట్లవుతుంది.

భగవంతుణ్ని శరణుచొచ్చినచో అతడు కరుణాసముద్రుడు కనుక తప్పక రక్షిస్తాడు. భక్తుని యోగక్షేమాలను ఆయనయే వహిస్తాడు. భగవంతుడు భక్తవత్సలుడు. ఈపద్యంలో ఈరెండును సాభిప్రాయ విశేషణాలు.

'నాకాధిప వినుత' దేవేంద్రునిచే నుతింపబడినవాడా! అను సంబోధనలో

భాగవతార్థము స్ఫురిస్తున్నది.

గోపకులు ఎప్పటివలె ఇంద్రయాగం మొదలుపెట్టి తనను పూజించకుండా ఒక కొండను పూజించడం చూచి దేవేంద్రుడు కోపంతో మండిపడి గోపకుల ఇండ్లపై రాళ్లవాన కురిపించి చాలా బీభత్సం చేశాడు. అప్పుడు శ్రీకృష్ణుడు గోవులను, గోపకులను సంరక్షించేందుకు గోవర్ధనగిరి ఎత్తి దాన్ని ఒక వ్రేలితో నిలిపాడు. గోకులమంతా ఆకొండక్రిందికి చేరి సురక్షితమయింది. దేవేంద్రుడు కురియించిన వర్షంవల్ల గోపకులకెట్టి బాధ కలుగలేదు. ఏడుదినాలు గడిచాయి.

ఈవృత్తాంతం తెలుసుకొని దేవేంద్రుడు భయ విస్మయాలకు లోనై శ్రీకృష్ణుని వద్దకు వచ్చాడు. ఆయన సర్వలోకేశ్వరుడని గ్రహించి తన తప్పు మన్నించమని పాదాలపై పడి వేడుకొన్నాడు. ఇంద్రుని ప్రార్థనను మన్నించి శ్రీకృష్ణుడు "ఇకపై నా ఆజ్ఞను పాలిస్తూ యథా ప్రకారంగా ఇంద్ర పదవిలో ఉండు. ఐశ్వర్యవంతుడవై గర్వించవద్దు. నిన్ను మన్నించాను. ఇక పొ"మ్మని సెలవిచ్చి పంపాడు.

ఆ సందర్భంలోనే గోలోకంనుండి కామధేనువు అవతరించి శ్రీకృష్ణునికి గోవింద పట్టాభిషేకం చేసింది.

**వేదంబులు గననేరని**
**ఆది పరబ్రహ్మమూర్తి వనఘ మురారీ!**
**నా దిక్కు చూచి కావుము**
**నీ దిక్కే నమ్మినాడ నిజముగ కృష్ణా!** 10

కృష్ణా! అనఘ= పుణ్యాత్ముడా! ముర+అరీ= మురాసురునికి శత్రువై, ఆతనిని వధించినవాడా! వేదంబులు కననేరని= వేదములకు కూడా అంతుపట్టని, ఆది పరబ్రహ్మమూర్తివి= ఈజగత్తుకు ఆదియైన పరబ్రహ్మమవు! నాదిక్కు చూచి, కావుము= నాయెడ దయతో చూచి నన్ను సంరక్షింపుము. నిజముగన్, నాదిక్కు నీవే అని నమ్ముకొనియుంటిని.

కృష్ణా! నీవు వేదాంతానికి కూడా అతీతుడవు. వేదాలు నీ స్వరూపరూపగుణ

విభవాలను గూర్చి వెదకుతూ ఇదికాదు, ఇదికాదు అని (న+ఇతి = నేతి నేతి ) వెదకుచు నిన్ను కనిపెట్టలేక పోయినవి.

భగవంతుని రూపమాధుర్యాన్ని కనుగొనుటానికి వేదాలు శ్రుతిరూపలై గోపికలతో కలిసి బృందావనంలో శ్రీకృష్ణుని మహారాసంలో పాల్గొన్నాయి.

**పదునాలుగు భువనంబులు**
**కుదురుగ నీకుక్షి నిలుపుకొను నేర్పరివై**
**విదితంబుగ నా దేవకి**
**యుదరములో నెట్టులొదిగి యుంటివి కృష్ణా! 11**

ఓకృష్ణా! పదునాలుగు భువనంబులున్= చతుర్దశలోకములను, నీకుక్షిన్= నీ బొజ్జలో, నిల్పుకొను నేర్పరివై, విదితంబుగ= స్పష్టముగా, ఆదేవకి ఉదరములోన్= దేవకీదేవి గర్భమున, ఎట్టులు = ఏవిధముగా; ఒదిగి యుంటివి?= ఇమిడి యున్నాడవు? మహాశ్చర్యముగదా!

పదునాలుగు భువనములు= చతుర్దశ భువనములు, అవి ఇవి: భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము, (ఈఏడు ఊర్ధ్వలోకాలు). అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము (ఈఏడును అధోలోకాలు). ఈ చతుర్దశలోకాలు విష్ణుమూర్తి ఉదరమందున్నవి. విష్ణువే శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు తన శైశవంలో మన్నుతినియు తినలేదని తల్లి యశోదకు చెప్పినప్పుడు, ఏదీ చూతము నోరు తెరువుము అని ఆమె గద్దించి అడిగింది. శ్రీకృష్ణుడు నోరు తెరిచాడు. అందులో చతుర్దశ భువనాలను యశోద చూచి ఆశ్చర్యచకితురాలయింది.

బ్రహ్మాండ రూపుడవైన నీవు దేవకి గర్భంలో ఎట్లు ఇమిడినావో ఆశ్చర్యం కృష్ణా! అని భక్తు డడుగుతున్నాడు.

**అష్టమి రోహిణి ప్రొద్దున**
**అష్టమ గర్భమున బుట్టి యా దేవకికిన్,**
**దుష్టుని కంసు వధింపవె**
**సృష్టి ప్రతిపాలనంబు సేయగ కృష్ణా! 12**

కృష్ణా! నీవు; అష్టమి రోహిణి ప్రొద్దున= అష్టమినాడు రోహిణి నక్షత్రము ఉదయింపగనే, దేవకికిన్= దేవకీదేవికి; అష్టమ గర్భమున= ఎనిమిదవ చూలున, పుట్టి, దుష్టుని కంసు వధింపవె= దుష్టుడైన కంసుని వధించినవాడవు గదా? ఎందులకు? సృష్టి ప్రతిపాలనంబు చేయుటకు= జగత్తును రక్షించుట కొరకు.

వైవస్వత మన్వంతరంలో ద్వాపరయుగాంత భాద్రపదమాసం, అష్టమీతిథి, రోహిణీ నక్షత్రాన బుధవారం అర్ధరాత్రి కంసుని కారాగారంలో దేవకీ వసుదేవుల కుమారునిగా ఈశ్వరుడైన శ్రీకృష్ణుడు సచ్చిదానందరూపుడై ఆవిర్భవించాడు. అప్పుడు దేవకి దేవరూపిణిగా భాసించింది.

సమగ్రములైన జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులకు భగమని పేరు. అవి అన్నీ అనంతంగా కలవాడు భగవానుడు. అట్టి పూర్ణ పురుషుడు శ్రీకృష్ణుడు.

పూర్ణానందః పూర్ణభుక్
పూర్ణకర్తా పూర్ణజ్ఞానః పూర్ణశక్తిః
పూర్ణైశ్వర్యాత్ భగవాన్ వాసుదేవో
విరుద్ధశక్తి ర్న చ దోషస్పృగీశః

అని "న్యాయ వివరణ"మనే గ్రంథం భగవంతుడైన శ్రీకృష్ణుని పరిపూర్ణతను వివరించింది.

షడైశ్వర్యపూర్ణుడైన భగవానుని యందు పూర్ణానందం, పరిపూర్ణ భోక్తృత్వం, పూర్ణకర్తృత్వం, సంపూర్ణ జ్ఞానం, పూర్ణజ్యోతి, సమగ్రశక్తి, సంపూర్ణైశ్వర్యం, విరుద్ధశక్తిత్వం, అదోషస్పర్శిత్వాలు ప్రకాశిస్తుంటాయి.

విరుద్ధధర్మాశ్రయత్వములు లేకపోయినచో భగవానుడు పూర్ణుడు కానేరడు.

కనుక వేదాలు విరుద్ధధర్మాలు కలవాడే పరబ్రహ్మమని నిర్దేశిస్తున్నాయి.

అణోరణీయాన్ మహతో మహీయాన్ (కఠోపనిషత్తు).

సూక్ష్మాలలో సూక్ష్మరూపుడు, మహనీయులలో మహామహనీయుడు.

ఆసీనో దూరే వ్రజతి శయానో యాతి సర్వతః (కఠోపనిషత్తు)

కూర్చుండినవాడైనను దూరదూరాలకు పోగలిగినవాడు. నిద్రితుడైనను అన్నిచోట్లకు పోగలవాడు.

"తేదేజతి తన్నైజతి తద్ దూరే తద్వంతికే" (ఈశావాస్యోపనిషత్తు)

ఆయన తిరుగును-మరియు తిరగడు. ఆయన దూరముగా నున్నప్పటికి దగ్గరనున్నవాడే.

బ్రహ్మపురాణంలో, శ్రీమద్భగవద్గీతలోను, నృసింహోత్తర తాపనీయోప నిషత్తులోను విరుద్ధధర్మాశ్రయము శ్రీకృష్ణభగవానుని లక్షణంగా చెప్పబడింది.

**అల్ల జగన్నాథుకు వ్రే**
**పల్లియ క్రీడార్థమయ్యె పరమాత్మునకున్**
**గొల్లసతి యా యశోదయు**
**తల్లియునై చన్నుగుడిపె దనరగ కృష్ణా! 13**

కృష్ణా! అల్ల జగన్నాథుకున్=సకలలోకములకు ప్రభుడవైన నీకు, వ్రేపల్లియ= గోకులమే, క్రీడా+అర్థము= లీలావిలాస స్థానమయ్యెను. పరమాత్మునకున్= పరమాత్ముడు, పరబ్రహ్మము, భగవానుడు అని పిలువబడు నీకు, గొల్లసతి= నందుని ఇల్లాలు అగు, ఆయశోద, తల్లియును అయి, తనరగన్= సంతోషముగా, చన్నుఁగుడిపెన్= పాలిచ్చెను.

వ్రే= గోకులము; వ్రేఁడు= గోపకుడు; వ్రేతలు= గోపస్త్రీలు.

అఖిల లోక నియంతవగు నీకు గోకులము విహార క్షేత్రమయింది. చరాచర సృష్టికి కారణభూతుడవు, జగన్నాథుడవగు నీకు వ్రజరాణియగు యశోద చనుగుడిపినది. నీవు పరాత్పరుడవు, వైకుంఠవాసుడవు వ్రజభూమికి ఆడుకోటానికి విచ్చేశావు. బ్రహ్మను ప్రతిష్ఠించినవాడవు, సచ్చిదానందరూపుడవు

అయిన నీవు గొల్లయిల్లాలి పాలు త్రావితివి. ఇవికూడా విరుద్ధధర్మాశ్రయత్వాలే.

శ్రీకృష్ణుడు గోలోకం లేదా వైకుంఠం నుండి గోకులంలో ఆవిర్భవింపగానే ఆ గోకులం త్రిపాద విభూతిని పొందింది. గోలోకవాసులందరు ముందే గోకులంలో అవతరించి ఉన్నారు. కావున గోకులము, బృందావనము చతుర్ముఖబ్రహ్మసృష్టి కాదని, అది కేవలము శ్రీకృష్ణ పరబ్రహ్మము యొక్క సృష్టియే యని గ్రహింపవలయును. గోకులమే వన వైకుంఠము.

గోకులము తన సృష్టి కాకపోవడం చూచి విస్మయం చెంది బ్రహ్మ అచ్చోటికి వచ్చి, గోవులను, గోపకులను మాయచేసి, శ్రీకృష్ణునిచే పరాభవం పొందిన ఘట్టం శ్రీమద్భాగవతంలో వర్ణింపబడింది. "న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః" "తన ప్రాకట్య రహస్యము దేవతాగణాలకు, మహర్షులకు తెలియదు" అని శ్రీకృష్ణుడే చెప్పాడు. ముక్తజనుల అభిలాషలను తీర్చి వారిని సంతృప్తి పరచడానికే బృందావన ధామాన్ని తన క్రీడాస్థలిగా చేసికొని భగవానుడు స్వయంగా అతిలోక సుందరరూపంలో ఆవిర్భవించి వారి మనోభీష్టాలను నెరవేర్చాడు. గోకులాన్ని గోలోకానికి పర్యాయపదంగా చేసినవాడు భగవానుడు. నామంలోను, అర్థంలోను, స్వరూపంలోను గోలోకానికి గోకులం పర్యాయమైనది. శ్వేతవరాహ కల్పంలో ద్వాపరాంతాన, కలియుగారంభ సంధికాలంలో శ్రీకృష్ణావిర్భావంతో ఈ ధరాతలము ధన్యమైనది. దివ్యధామము, దివ్యభావము, దివ్యరూపమునొందినది. కాళిందీ బృహద్వనాలు ధన్యమైనవి. అచ్చటి పాదపపుంజాలు, లతానికుంజాలు, తృణ దళ పశు పక్షి నరనారీ బాలవృద్ధులు మూర్తిమంతులైన గోలోకవాసులుగా భాసించారు. ధరాతలంలో ఒక భాగం త్రిపాదవిభూతిని పొంది స్రష్ట కళానైపుణ్యానికి కృతార్థతను కలిగించింది.

**అందెలు గజ్జెలు మ్రోయగ**
**చిందులు ద్రొక్కుచును వేడ్క చెలువారంగా**
**నందుని సతి యా గోపిక**
**ముందర నాడుదువు మిగుల మురియుచు కృష్ణా! 14**

కృష్ణా! అందెలు గజ్జెలు ఘలుఘల్లున మ్రోయునట్లు గంతులు వేస్తూ, వేడుక ఒప్పునట్లుగా, నందునిసతి= నందరాయని భార్యయగు యశోదాదేవి ముందర, మిగుల = మిక్కిలి; మురియుచు = సంతోషించుచు, ఆడుదువు= నర్తింతువు.

"యశోదా యా సమా కాపి దేవతా నాస్తి భూతలే
ఉలూఖలే యయా బద్ధో ముక్తిదో ముక్తి మిచ్ఛతి"

అని యశోదాభాగ్యమును తెలిపినాడొక కవి.

లోకంలో యశోదతో సమానమైన ఏ దేవతయు లేనేలేదు. ఆమె చేత రోటికి బంధింపబడి మోక్షమిచ్చు భగవంతుడగు శ్రీకృష్ణుడే మోక్షమిమ్మని యామెను బతిమాలినాడని కవులు చమత్కరించారు.

కిం బ్రూమస్త్వాం యశోదే కతి కతి
సుకృతక్షేత్రవృందాని పూర్వం
గత్వా కీదృగ్విధానైః కతి కతి
సుకృతాన్యర్జితాని త్వయైవ
నో శక్రో న స్వయంభూర్న చ
మదనరిపు ర్యస్య లేభే ప్రసాదం
తత్ పూర్ణం బ్రహ్మ భూమౌ విలుఠతి
విలపన్ క్రోడమారోఢుకామః

అహో! యశోదాదేవీ! నీతో మేమని చెప్పుకోగలము? నీవు ఒంటరిగా ఎన్నెన్ని పుణ్యక్షేత్రాలకు వెళ్లి ఎన్నెన్ని పుణ్యవ్రతాలు చేసి ఉన్నావో! ఆహా! ఎవరి కృపాకటాక్షానికై బ్రహ్మేంద్ర మహాదేవులు తపించి పొందజాలని భగవదను గ్రహాన్ని నీవు పొందినదానవు. నీ ఒడిలోనికెక్కుటకు భగవానుడు నేలమీద పడి పొర్లిపొర్లి ఏడ్చినాడట!

ముక్తినొందిన మునీశ్వరులు ముక్తితో తృప్తిచెందిక ఏ ఫలంకోసం అన్వేషించడంలో వ్యగ్రులైనారో ఆ ఫలవృక్షమే దేవకీదేవి. ఆ ఫలాన్ని

పెంపొందించినది యశోదాదేవి. దాన్ని యథేచ్ఛగా అనుభవించినవారు గోపికలు.

"గోభిః ఇంద్రియైః భక్తిరసం పిబతి సా గోపీ" అని వ్యుత్పత్తి. ఇంద్రియములతో భక్తిరసము గ్రోలువారు గోపికలు. ఇంద్రియములద్వారా పరమతత్త్వమును సాక్షాత్కరింపజేసికొన్నవారు.

గోపీశబ్దానికి ప్రకృతి స్వరూపశక్తి అని మరొక అర్థము. జనశబ్దానికి సముదాయమని అర్థం. గోపీజనములకు తాను వల్లభుడు. ప్రకృతి స్వరూపశక్తి సముదాయానికి ఈశ్వరుడు శ్రీకృష్ణుడు. "గోపీజనవల్లభుడు".

రాధా శబ్దానికి పర్యాయపదం గోపి. ఆమె మహాలక్ష్మీ స్వరూప. లక్ష్మీదేవిని గోపనమొనర్చుటకు రాధ గోపీనామాన్ని ధరించిందని మరొక విశేషార్థమున్నది.

**హరిచందనంబు మేనున**
**కరమొప్పెడు హస్తములను కంకణరవముల్**
**ఉరమున రత్నము మెఱయగ**
**బరగితివో నీవు బాలప్రాయము కృష్ణా! 15**

కృష్ణా! మేనునన్= శరీరమునందు: హరిచందనంబు= మంచిగంధము: కరము= మిక్కిలి ఒప్పెడు= అందమగు, హస్తములను= చేతుల యందు, కంకణరవమున్= మురుగుల యొక్క ధ్వనులును, ఉరమున = వక్షమునందు, రత్నము= (కౌస్తుభ) రత్నము, మెఱయగన్= శోభింపగా:
బాలప్రాయము= చిరుతవయస్సున, పరగితివి+ఔ = శోభిల్లితివిగదా.

కృష్ణా! నీవు చిన్నప్పుడు మంచిగంధం పూసుకొన్న శరీరంతోను, చేతులకు అందమైన మురుగుల ధ్వనితోను, వక్షస్థలమున (కౌస్తుభ) రత్నముతోను ప్రకాశించుచుండెడివాడవుగదా!

హరిచందనం చందనాలలో విశిష్టమైనది. ఇది శ్రీహరికి ప్రియమైనది. శ్రీలీలాశుకబిరుదాంచితుడు బిల్వమంగళకవి శ్రీకృష్ణుని బాలరూపాన్ని ఈవిధంగా

కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్
సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠే చ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాల చూడామణిః

**పాణితలంబున వెన్నయు**
**వేణీమూలంబునందు వెలయగ పింఛం**
**బాణీ ముత్యము ముక్కున**
**నాణెముగా దాల్చు లోకనాథుడ! కృష్ణా! 16**

కృష్ణా! పాణితలంబున= అరచేతియందు, వెన్నయు; వేణీమూలంబునందు=సిగమొదటను, పింఛంబు=నెమలి పింఛమును, వెలయగన్=శోభింపగా, ముక్కునన్= ముక్కున, ఆణీ ముత్యము= ప్రశస్తమైన గుండ్రని ముత్యము, నాణెముగా=చక్కగా, తాల్చునట్టి, లోకనాథుడ=లోకములకన్నిటికి ప్రభువైనవాడా!

కృష్ణా! నీవు సర్వలోకాలకు నాయకుడవయ్యును, చేతిలో వెన్న ముద్దను, సిగపై నెమలిపింఛాన్ని, ముక్కున మంచి ముత్యాన్ని ధరించి వ్రజశిశువు వలె ప్రకాశిస్తున్నావు.

దీని అసలు రూపము "ఆణిముత్యము". అట్లే కొన్ని పూర్వపు ముద్రిత గ్రంథములందున్నది.. అక్కడ గణభంగము. దీనికి "ఆణీముత్యము" అను పాఠాంతరమున్నది. దీని నొక కవి దీర్ఘాంతముగా బ్రయోగించినాడు, అని వ్రాసి సూర్యరాయాంధ్ర నిఘంటువు ఈ పద్యమునే యుదాహరించినది. ఇందట్లే గ్రహింపబడినది.

**మడుగుకు జని కాళీయుని**
**పడగలపై భరతశాస్త్ర పద్ధతి వెలయన్**
**కడు వేడుకతో నాడెడు**
**నడుగులు నామదిని దలతు నచ్యుత! కృష్ణా! 17**

కృష్ణా! అచ్యుత= శరణుకోరి వచ్చినవారిని విడువనివాడా! శాశ్వతమైనవాడా! మడుగుకున్చని= సరస్సులోనికి వెళ్లి (అందు నివసించు) కాళీయుని= కాళీయుడను పేరుగల సర్పము యొక్క, పడగలపై భరతశాస్త్ర పద్ధతి=

నాట్యశాస్త్రము యొక్క పద్ధతిలో, వెలయన్= ప్రకాశింపగా, వేడుకతోడన్= ఉత్సాహముతో; ఆడెడు= నాట్యము చేసెడి, అడుగులు= నీపాదములను, నా మదినిన్-తలతు= నా మనస్సులో ధ్యానింతును.

'అచ్యుతుడు' అనగా తన స్వరూప శక్తిని ఎన్నటికిని విడువనివాడు; శ్రీకృష్ణుడు.

"శాశ్వతం శివ మచ్యుతమ్" అని శ్రుతి. తన భగవత్తత్వాన్ని విడువని వాడు. "షడ్భావవికార రహితత్వాత్ అచ్యుతః" అని శ్రీశంకరభగవత్పాదులు వ్యాఖ్యానించారు. అనగా షడ్భావ వికారములు లేనివాడు కావున అచ్యుతుడు అని అర్థం.

యమునానది ప్రక్కన ఒక మడుగున్నది. అందులో కాళీయుడనే మహాసర్పం చిరకాలంనుంచి కాపురమున్నది. ఆ సర్పవిషంతో అందలి జలాలు విషమయమయ్యాయి. దాని విషాగ్నులచే చుట్టుపట్ల చెట్లన్నియు మాడి మోడువారినవి. ఆ మడుగుపై ఒక పక్షికూడా ఆకాశాన తిరుగాడదు. ఆ విషజలవాయువు సోకినంతనే అక్కడి చెట్లు, పక్షులు చనిపోతుండేవి. ఆ భయంకర విషవాయువులు సోకి గోవులు, గోవత్సములు హఠాత్తుగా మరణిస్తుండేవి. శ్రీకృష్ణుడీ విషయం గమనించి తన బృందావన ఖేలనకు కాళీయుడు ఆటంకంగా ఉన్నాడని అతనిని అక్కడి నుండి తొలగింప నిశ్చయించాడు.

అక్కడ ఒక విశాలమైన కదంబవృక్షం ఉంది. పూర్వం గరుత్మంతుడు దేవలోకం నుండి అమృతభాండాన్ని తెస్తూ, ఆ చెట్టుపై దానినుంచి కొంతసేపు విశ్రమించాడని పురాణవచనము.

శ్రీకృష్ణ డా చెట్టెక్కాడు. ఆయన పాదస్పర్శతో ఆచెట్టు ఆపాదమస్తకం పులకించి చిగిర్చింది. ఆచెట్టు చివరి నుండి మడుగులోనికి గభీలున దూకాడు కృష్ణుడు. ఆ మడుగులోనున్న కాళీయుడు అత్యంతక్రూరుడు. కాని, అతని పత్నుల హృదయంలో భగవంతుని పట్ల ఒక కోరిక ఉన్నది. శ్రీకృష్ణుడు తన

బాల్యలీలారసముతో వారిని తృప్తి పరుపనెంచి ఆ మడుగులోనికి దూకి తన రూపలీలా మాధుర్యాలు వారికి ప్రసాదించాడు. మడుగులోని నీళ్లన్నీ అటునిటు పైకెగశాయి. శ్రీకృష్ణుడు ఆమడుగులో కొంతసేపు జలకేళి జరిపాడు. ఇంతలో కాళీయుడు మేల్కాంచి, తన నివాసానికి సాహసించి వచ్చిన వానిని మట్టుపెట్టదలచి అటునిటు పరిక్రమించాడు. సుకుమార శరీరుడైన శ్రీకృష్ణుని చూచి కాళీయుడు తన తోకతో ఆతనిని చుట్టి వేశాడు.

ఒడ్డుననున్న శ్రీకృష్ణుని సఖు లా దృశ్యాన్ని చూచి భయపడి దుఃఖంతో నేలపై పడి దొర్లసాగారు. గోవులు, వత్సములు మేతమాని దీనదృక్కులతో శ్రీకృష్ణుని కొరకు చూడసాగాయి. బృందావనవాసులకు ఈవిషయం తెలిసి కాళీయునిమడుగు దగ్గరకు పరుగిడి వచ్చారు. నందయశోదలు బలరాముడును వచ్చారు.

మడుగులోగల నల్లని పెనుబాముతో పోరాడుతున్న శ్రీకృష్ణుని చూచి యశోద దుఃఖంతో గుండెలు బాదుకొంటూ ఆ మడుగులోకి దూకబోయింది. గోపిక లామెకు అడ్డుపడ్డారు. పూతనాదులను వధించిన శ్రీకృష్ణునికి ఎట్టి ప్రమాదం కలగదని గోపకులు ఆమెకు ధైర్యం చెప్పసాగారు. ఎంత చెప్పినా వినక నందాదులు మడుగున దూకి ప్రాణాల విడువదలచారు. అప్పుడు బలరాముడు వారిని నివారించి ధైర్యం చెప్పి, శ్రీకృష్ణుడు కాళీయుని వధించి బయటికి వస్తాడని చెప్పి బలాత్కారంగా వారిని నివారించాడు. మడుగులో ఉన్న శ్రీకృష్ణుడు తన కోసం గోపకులెల్లరు దుఃఖిస్తున్నారని తెలుసుకొని, సర్పబంధం వదలించు, తన శరీరాన్ని పెంచి ఆ సర్పాన్ని అణగద్రొక్కాడు. కాళీయుని పడగలను కాళ్లతో త్రొక్కిత్రొక్కి వానిని వివశుణ్ని చేశాడు. కాళీయుడు ముక్కులనుండి, నోటినుండి విషం కక్కసాగాడు. కాళీయునిపై గరుడుడు ఎక్కినట్లు శ్రీకృష్ణుడు ఎక్కి వానిని తనకాళ్లతో త్రొక్కి నాట్యమాడసాగాడు. కాళీయుడు విషం కక్కుతూ పడగలను వ్రేలవేశాడు. అతని పడగలపై గల అనేక రత్నాలను ఒరసికొని శ్రీకృష్ణుని పదతలములు కందినట్లుగా కనిపించాయి.

శివనృత్యాన్ని తాండవమంటారు. పార్వతీ నృత్యాన్ని లాస్యమంటారు. నృత్యగానకళానిధి యగు శ్రీకృష్ణుని తాండవకేళిని ఒడ్డుననున్న గోపకులెల్లరు చూచి ఆనందించారు. అటు కాళీయుని జీవశక్తి క్షీణింపసాగింది. అతని శరీరం ఛిన్నాభిన్నమయింది. ముఖాలనుండి నెత్తురొలికింది. ప్రాణాలు కడముట్టాయి. నారాయణుని స్మరించాడు. తమ భర్త క్షీణదశను చూచి నాగపత్నులు శ్రీకృష్ణుని శరణుచొచ్చారు. వారు అత్యంత ఆతురతతో చేతులు మోడ్చారు. శరణాగత రక్షకుడైన శ్రీకృష్ణుడు వారి మొర ఆలకించాడు. "ప్రభూ! నీవు అపరాధులను శిక్షించడానికి అవతరించినవాడవు. మా భర్త అపరాధియే. శిక్షార్హుడే. నీవు దుష్టులను శిక్షించే నెపంతో వారి పాపాన్ని హరిస్తావు. ఈ కాళీయుడు పాపంలేనివాడైతే సర్పంగా ఎందుకు జన్మిస్తాడు? వీనిపై నీ క్రోధం కూడా ఒకవిధమైన అనుగ్రహంగా భావిస్తాము. ఇతడు ప్రభువైన నిన్నెరుగడు. కృప వహింపుము. ఇతడు మరణాసన్నుడైనాడు. మాకు పతి భిక్ష పెట్టుము. మేము నీదాసులము. మమ్మాజ్ఞాపించుము. నీ కెట్టి సేవచేయవలెనో తెలుపుము" అని తన భార్యలు ప్రార్థించుచుండగా కాళీయుడు దీనుడై శ్రీకృష్ణుని ఇట్లు వేడుకొన్నాడు. "ప్రభూ! నేను తమోగుణ ప్రధానుడనైన సర్పాన్ని, క్రోధజీవిని. నా స్వభావం క్రోధము. నేను నీయెడ అపరాధం చేశాను. నీవు సంపూర్ణ జగత్తునకు స్వామివి. నన్ను క్షమించుము" అని.

అప్పుడు శ్రీకృష్ణుడు "ఓ సర్పమా! నీవు నీభార్యాపుత్రులతో ఈ మడుగు విడచి సముద్రంలోనికి తక్షణమే వెళ్ళిపో. నేనీ మడుగులో క్రీడిస్తాను. నేను క్రీడించిన ఈమడుగులో స్నానంచేసినవారు, తర్పణాలు చేసినవారు సర్వపాపాల నుండి విముక్తులౌతారు. గరుడుని భయంతో నీవీ మడుగున దాగుకొన్న విషయం నాకు తెలుసు. నీ పడగలపై నాపాదముద్రలు పడినవి. వాటిని చూచి గరుడుడు నీజోలికి ఇకనుండి రాడు. కావున నీవు వెళ్లి సముద్రంలో కాపురముండు" మని ఆజ్ఞాపించాడు.

కాళీయుని భార్యలు అందుకు సంతోషమొంది మణులను కానుకగా నొసగి శ్రీకృష్ణుని పూజించి, ప్రదక్షిణించి అనుమతి కోరి అప్పుడే యమునానది నుండి భర్తతోపాటు సముద్ర గర్భానికి చేరుకొన్నారు.

**బృందావనమున బ్రహ్మా**
**నందార్భకమూర్తి వేణునాదము నీ వా**
**మందార మూలమున గో**
**విందా! పూరింతువౌర వేడుక కృష్ణా! 18**

కృష్ణా! గోవిందా!=కృష్ణా! బృందావనమున=బృందావనములో, నీవు, ఆ మందారమున= పారిజాత వృక్షము మొదట (కూర్చుండి) బ్రహ్మానంద+ అర్భకమూర్తిన్= బ్రహ్మానందము మూర్తిమంతమైనట్లున్న పసివాని రూపముతో, వేణునాదమున్= పిల్లనగ్రోవి ధ్వనిని, పూరింతువు= నిండింతువు, ఔర= ఆశ్చర్యముగదా!

కృష్ణా! నీవు బృందావనములో బ్రహ్మానందస్వరూపుడవైన బాలకుడవై మందారతరుమూలమున వేణునాదము చేయువాడవుగదా!

భగవంతుని నామాలలో అత్యంత మహిమగలది, భగవంతునికి మిక్కిలి ప్రియమైనది గోవిందనామము. వేదములచే తెలునుకోదగినవాడు, వరాహావతారమున భూమిని ఉద్ధరించినవాడు అని అనేకార్థములున్నవి. "కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా" అని శ్రీకృష్ణమహామంత్రము. ఈ మంత్రమునకు ముందు "క్లీమ్" అను బీజాక్షరము చేర్చినచో ఇది అష్టాదశాక్షర మంత్రమవుతుంది. దీనిని శుచివ్రతులై 16 లక్షలు భక్తితో జపిస్తే భక్తి జ్ఞానమహైశ్వర్యములు కలుగుతాయి. ఇష్టసిద్ధి అవుతుంది. రాధాకృష్ణుల సాక్షాత్కార భాగ్యమబ్బుతుంది. " అనారాధిత గోవిందో యే నరాః దుఃఖ భాగినః" గోవిందుని ఆరాధింపనివారు దుఃఖాల పాలవుతారని శాస్త్రం.

శ్రీరాధాకృష్ణుల నిత్య విహారస్థానం బృందావనము. బృందావన పాలిక, అధిష్ఠాత్రి రాధాదేవి. బృందయనగా తులసి అనియు, రాధయనియు. భక్తి

అనియు అర్థము. శ్రీకృష్ణుడు మూర్తిగొన్న బ్రహ్మానంధము. బృందావనమందలి వృక్షాలన్నీ కల్పవృక్షాలే. కల్పవృక్షం క్రింద శ్రీకృష్ణుడు వేణుగానం చేశాడు. దేవీరూపలు, శ్రుతిరూపలు, ఋషిరూపలు అయిన గోపికలు ఆ వేణుగానం విని మహానందంలో ఓలలాడారు. శ్రీకృష్ణుని వేణుగానంతో జడములు చేతనములుగా చేతనములు జడములుగా మారుతాయి. విక్షిప్తము సమాధిస్థము, సమాధిస్థము విక్షిప్తము అవుతుంది. జీవన్ముక్తుల చిత్తాన్ని హరించేవాడు కృష్ణుడు. ఆయన "ఆత్మారామగణాకర్షి". శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణుని వేణుగానం అత్యద్భుతమైన విషయం. కల్పవృక్షాల నీడ యందు చింతామణి వేదిక గల దనియు దానిపై నిలిచి శ్రీకృష్ణుడు వేణుగాన మాచరించెననియు ఉపనిషన్మంత్రాలు తెలుపుతున్నాయి. భక్తి క్షేత్రమైన బృందావనంలోనికి భగవంతుడు ప్రవేశించాడు.

బృందావనంలో ఉండిన శ్రీకృష్ణుడు పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మంలో దేవకీదేవికి జన్మించిన కృష్ణుడు విలీనమయ్యాడు. యశోదకు కూడా దేవకి అను పేరుంది.

ద్వే నామ్నీ నందభార్యాయా యశోదా దేవకీతి చ
అతః సఖ్య మభూత్తస్యా దేవక్యా శౌరిజాయయా

-స్కాందపురాణము

వసుదేవునిపై గల గౌరవంతో నందుడు తనభార్యకు యశోదయని పేరుపెట్టాడు. దేవకీదేవికి జన్మించినవాడు ఈశ్వరుడు అనగా సర్వనియంత అయిన శ్రీవిష్ణువు. యశోదకు జన్మించినవాడు సచ్చిదానందస్వరూపుడైన పరబ్రహ్మము. వీరిద్దరు విగ్రహైక్యం చెందిన రూపమే శ్రీకృష్ణభగవానుడు.

"తద్బ్రహ్మ కృష్ణయోరైక్యాత్" అని శ్రీయామునాచార్యులు దేవకీ నందనునిలో యశోదానందనుడు ఐక్యమొందెనని తెలిపియున్నారు. అందుచేత శ్రీకృష్ణుడు పరబ్రహ్మ పూర్ణపురుషోత్తముడు, ప్రేమానందరస విగ్రహుడు, సచ్చిదానందస్వరూపుడు అయినాడు.

వసుదేవసుతః శ్రీమాన్ వాసుదేవాఖిలాత్మని
లీనో నందసుతే రాజన్ ఘనే సౌదామనీ యథా

శ్రీకృష్ణయామలము

వాసుదేవుడైనవాడు నందసుతునితో లీనమై నాడు. యశోద ఒక మగపిల్లవానిని మరొక ఆడపిల్లను కన్నది. మగపిల్లవాడు పరబ్రహ్మము. ఆడపిల్ల అంబికాదేవి. ఆమెయే యోగమాయ.

**వారిజనేత్రలు యమునా**
**వారిని జలకంబులాడ వచ్చిన నీ వా**
**చీరలు మ్రుచ్చిలి యిచ్చితి**
**నేరుపురా యదియు నీకు నీతియె కృష్ణా! 19**

కృష్ణా! వారిజనేత్రలు=పద్మములవంటి కన్నులుగలవారైన గోపికలు; యమునా వారిని = యమునానది జలాలలో, జలకంబులాడ= స్నానము చేయుటకు; వచ్చినపుడు, నీవు+ఆ చీరలు = నీవు వారి చీరలను, మ్రుచ్చిలి= దొంగిలించి, ఇచ్చితి = మరల ఇచ్చితివి. నేరుపురా = ఇట్లు దొంగిలించుట నీ నేర్పరితనమా? నీకు = నీవంటి వానికి ఇది నీతియె = ఇది మంచి నడవడియా? చెప్పుము.

బృందావనవాసులందరు యథార్థానికి వానప్రస్థులు. గోపికలు కూడా అట్టివారే. వారు సంసారమందున్నప్పటికి సంసారులుకారు. వారు నిజమైన భగవత్సాధనాసిద్ధులు. శ్రీకృష్ణుడు ఈ సమస్తచరాచర ప్రకృతికి ఏకమాత్రుడైన అధీశ్వరుడు. సమస్తక్రియలకు ఆయన కర్త. భోక్త, సాక్షియు ఆయనయే. ఆయనకు గోచరింపని అవ్యక్తమూ వ్యక్తమూ అయిన పదార్థమేదియు జగత్తునందుండదు. ఆయన సర్వవ్యాపకుడు, అంతర్యామియు ఆయనయే.

శ్రీకృష్ణుడు గోపికల వస్త్రరూపమైన సమస్త సంస్కారావరణాన్ని తీసికొని చెట్టుపైకూర్చున్నాడు. గోపికలు జలాలలో ఉన్నారు. తమను కృష్ణుడు చూడలేదనీ, తాము గుప్తంగా ఉన్నామనీ భావించారు. శ్రీకృష్ణుడు సర్వవ్యాపకుడనీ

సర్వదర్శియనీ మరచినారు. తామున్న జలాలు కృష్ణస్వరూపమను సంగతియు విస్మరించినారు. వారి పూర్వపు సంస్కారం శ్రీకృష్ణుని దరిజేర్చడానికి బాధకమైనది. ఆ గోపికలు శ్రీకృష్ణునికై సమస్తమును మరచినవారు కాని; తమను మాత్రము మరచినవారు కాదు.

శ్రీకృష్ణుడు గోపికలయొక్క వస్త్రరూపమైన సమస్తసంస్కారావరణలను తన చేతికి తీసికొని కదంబవృక్షంమీద కూర్చున్నాడు. ప్రేమికుల మధ్య ఏమాత్రము అడ్డుండగూడదు. వారి కలయిక వ్యవధానరహితము - అబాధమూ అనంత మిళనమూ కావలసి ఉన్నది.

"ఓ గోపికలారా! మిమ్మల్ని మీరు మరచి పోయి ఒకసారి నా వద్దకు రండి. మీ హృదయాలలోనున్న అవ్యక్త త్యాగాన్ని ఒక్క క్షణం వ్యక్తం చేయండి. మీరింత మాత్రం చేయలేరా"? అడిగాడు శ్రీకృష్ణుడు.

"కృష్ణా! నిన్ను మేమెట్లు మరువగలము? మేమీ సంసారాగాధజలాలలో ఆకంఠమగ్నలమై ఉన్నాము. ఈ చలిని భరింపలేకున్నాము. మా జన్మజన్మల నిశ్చితాశయాన్ని మేమెలా మరువగలము? నీకు మేము దాసులము. నీ ఆజ్ఞను పాలించేవాళ్లము. మా హృదయాలు నీముందు ఉన్ముక్తమై ఉన్నాయి. కాని, నీవు మమ్మల్ని నీవద్దకు రమ్మని పిలువకు" అని గోపికలు మొరపెట్టుకొన్నారు.

సంసారంలో కొట్టుమిట్టాడుతున్నవారి దశ ఇది. సంసారావరణాన్ని వదలి వారు వెలుపలికి రాలేరు.

సంసారమును వదలలేకపోవుట, సంస్కారము అడ్డుపడుట, ఇట్టి ద్వివిధమైన దశకు లోనై సాధకుడు భగవత్సాన్నిధ్యమునకు చేరలేకపోతాడు.

శ్రీకృష్ణు డీ విషయాన్ని గోపికలకు బోధపరపదలచి "గోపికలారా! మీరు సంసారానికి సంబంధించిన సంస్కారం లేనివారై, నిరావరణలై, మాయా యవనిక(= తెర)ను ఛేదించుకొని నావద్దకు రండి. మీకడ్డుపడుతున్న ఈ మాయా యవనికను నేనే ఛేదించాను. మీకింక ఆ యవనికా మోహమెందుకు? ఈ మాయ పరమాత్మునికి జీవునికి మధ్య వ్యవధానము కలిగించేదవుతుంది.

అదిప్పుడు తొలగిపోయింది. మీకు శుభమవుతుంది. ఇప్పుడు నావద్దకు రండి. మీ చిరకాల సంచితాకాంక్షలు నెరవేరగలవు" అని ఆహ్వానించాడు.

శ్రీకృష్ణుని ఆహ్వానం గోపికల ఆత్మలలో ప్రవేశించింది. వారు ప్రేమ నిమగ్నలై సమస్తమూ విడిచి, సకలమూ మరచి, శ్రీకృష్ణుని పాదసన్నిధికి పరుగెత్తారు. వారికి తమ మొలమీది వస్త్రాలను గూర్చిన ధ్యాసలేదు. లోకానికి చెందిన చింత లేదు. అదే భగవత్ప్రేమ రహస్యం. విశుద్ధమూ, అనన్యమూ అయిన భగవత్ప్రేమ అది. విషయానురాగమే కామము. భగవదనురాగము ప్రేమ. గోపికలు వచ్చి మౌనంగా శ్రీకృష్ణుని ముందు నిలిచారు. తమ ఆత్మలనే విస్మరించారు. పూర్ణ సమర్పణ చేశారు.

"గోపికలారా! మీ సంకల్పం నెరవేరింది. రానున్న శరద్రాత్రియందు మీ ఆశయము నెరవేరుతుంది" అని చెప్పి, శ్రీకృష్ణుడు వారి వస్త్రాలను వారి సంసారావరణలను వారికందజేశాడు. తన స్వరూపమే అగు జలములందు నగ్నంగా స్నానమాచరించిన దోషం నుండి గోపికలను తొలగించాడు.

శ్రీకృష్ణునితో సమానమైన వయస్సుగల గోపకన్యకలు యమున ఒడ్డున గుమిగూడి శ్రీకృష్ణలీలాగానం చేస్తూండేవారు. యమునలో దిగంబరలై దిగి స్నానం చేసి తదుపరి వస్త్రధారణం చేసి, ఇసుకతో కాత్యాయనీ ప్రతిమను పెట్టి పూజించేవారు. తమ అంతరంగమందలి కోర్కెను రహస్యంగా "నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః" అని తెలిపి మొక్కి ఒక్క మాసం పాటు వ్రతానుష్ఠానం చేశారు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణ చంద్రుని హృదయం ద్రవించింది. ఆ గోపకన్యల మనోనిశ్చయం గ్రహించి సర్వవ్యాపియు, సర్వాంతర్యామియు, విశ్వాత్ముడును అయిన వ్రజరాజనందనుడు వారి వ్రతాన్ని సఫలం చేయనెంచి స్వయంగా అచ్చటికి విచ్చేశాడు. నదిలో నగ్నశరీరిణులై స్నానమాడు గోపకన్యల చీరలను హరించాడు.

ఇది శ్రీకృష్ణుని అంతరంగలీల. ఈ లీలలో పాల్గొన్నవారు తేజోరూపిణులైన గోపికలు. ఈఘటనలో విపరీతార్థాలను చేసుకొనేవారుంటారు. భగవంతుని

లీలలను ప్రాకృత మానవచరిత్రకు సమకక్ష్యలో పెట్టడం శాస్త్రదృష్టితో చూస్తే మహాపరాధ మవుతుంది. భగవల్లీలలను అనుకరించటం అంతకంటె మహా పరాధమని వేరే చెప్పనవసరం లేదు.

సమస్త వ్రజవాసులు శ్రీకృష్ణుని శరణుచొచ్చిన వారే. శ్రీకృష్ణుడు వారినందరిని స్వీకరించాడు. వారికందరికి తాను ఏకమాత్రరక్షకుడు. తన యోగమాయతో వారిని సర్వదా రక్షిస్తుంటాడు. "సజ్జనులను రక్షించడం నా వ్రతము. వారిని పాలించే అవసరము ఆసన్నమైనది" అని భాగవత శ్లోకం తెలుపుతున్నది.

తస్మాత్ మచ్ఛరణం గోష్ఠం, మన్నాథం మత్పరిగ్రహం,
గోపాయే స్వాత్మయోగేన సోఽయం మే వ్రత ఆహితః॥

గోపికలు శరణాపన్నలు. అందుచే వారు శ్రీకృష్ణస్వీకృతలు. శ్రీమద్రామాయణంలో శ్రీరాముడిట్లే వాగ్దానం చేశాడు, "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" 'నన్నొక్కసారి శరణుచొచ్చి నేను నీవాడను అని యాచించిన సంపూర్ణ ప్రాణులకు అభయమిచ్చుట నా వ్రతము' అని.

బహుజన్మల పుణ్య పరిపాకమున గోపికలై జన్మించిన వారందరు శ్రీకృష్ణుని ప్రియలే. శరణాగతలే. అచింత్యానంత సౌభాగ్య శాలినులైన నిత్య సిద్ధలు, సాధన సిద్ధలు, కఠోరతపస్సు చేసి వరదానం పొందిన కల్పలతలు, గోపీరూపం ధరించిన శ్రుతులు; స్వయం బ్రహ్మ విద్య, మహర్షులు, మహామునులు, స్వసుఖవాంఛలను సర్వదా పరిత్యజించితమ, సర్వత్యాగమయ పరమ మధుర ప్రీతి రసం ద్వారా పరమానందమయుడు, పరమప్రియతముడు అయిన శ్రీకృష్ణునికి అనంత సుఖం కలిగించి మహానందం పొందేవారు గోపికలు. శ్రీకృష్ణునితో అంతరంగ సంయోగము, బహిరంగ వియోగము కలవారు వారు.

"అనేక జన్మ సిద్ధానాం గోపీనాం పతిరేవ వా నందనందన ఇత్యుక్త స్త్రైలోక్యానందవర్ధనః" -గౌతమీయ తంత్రము - దశార్ణవ్యాఖ్య.

"గోపీనాం నయనోత్పలార్చిత తనుః" ఇది శ్రీకృష్ణమంత్రానికి ధ్యాన విధానము.

**దేవేంద్రు డలుకతోడను**
**వావిరిగా ఱాళ్ళవాన వడి గురియింపన్**
**గోవర్ధన గిరి యెత్తితి**
**గోవుల గోపకుల గాచుకొఱకై కృష్ణా! 20**

కృష్ణా! దేవేంద్రుడు= దేవతల ప్రభువు ఇంద్రుడు అలుకతోడను= కోపముతో, వావిరిగా= ఎడ తెగకుండగా, వడిన్= వేగముగా, ఱాళ్ళవాన= వాన కురిసినట్లుగా రాళ్లను, కురియింపగా, గోవులన్= ఆవులను, గోపకులను= గోపజనులను, కాచుకొఱకై= రక్షించుటకై, గోవర్ధనగిరిన్= గోవర్ధనమను పర్వతమును, ఎత్తితి= ఎత్తితివి గదా!

కృష్ణా! దేవేంద్రుడు కోపముతో రాళ్ల వాన కురియింపగా గోవర్ధనగిరిని గొడుగు వలె పట్టి గోవులను, గోపాలుర నెల్లరను రక్షించినావు.

దేవేంద్రుని గర్వాన్ని పోగొట్టుదలచాడు సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు. అనాది నుండి వస్తున్న ఇంద్రయాగాన్ని విరమింపజేయదలచాడు. తాము వైశ్యులము. గోరక్షణ తమ వృత్తి. తమ గోవులకు పచ్చికను ఆహారంగా ఇస్తున్న గోవర్ధనగిరిని పూజించడం ఉత్తమమని శ్రీకృష్ణుడు నందునితో వాదించాడు. కృష్ణుని వాదనలోని సమంజసతను గమనించి నందాదులు గోవర్ధన గిరిని పూజించారు. శ్రీకృష్ణుడు గిరిరాజావతారమెత్తి నందాదుల పూజానైవేద్యాలను పరిగ్రహించాడు. గిరిరాజు తామిచ్చిన ఫలపుష్పాదులను అన్నశాకాపూపాదులను గ్రహిస్తుండటం చూచి వ్రజవాసులు ఆశ్చర్యం పొందారు.

వ్రజవాసులు తనకు చేసిన అవమానానికి దేవేంద్రుడు క్రోధోద్రేకముతో ఐరావతమెక్కి తన వెంట సాంవర్తకాది ప్రళయమేఘాలను తోడ్కొని వచ్చాడు. ప్రచండ వాయువులను వెంటతెచ్చాడు. వ్రజవాసుల నివాసాలపై కుంభవృష్టి కురియించాడు. ఉరుములు, మెఱపులతో, ముసలధారగా వర్షం కురియించిన తర్వాత వడగండ్ల నెపంతో రాళ్లవర్షం కురియించాడు.

గోవులు, గోపాలకులు భయభ్రాంతులయ్యారు. ఎక్కడనూ తలదాచు

కోడానికి వీలులేక పోయింది. కొందరు నందభవనానికి వెళ్లి తలదాచుకొన్నారు. పశువులకు రక్షణ లేక పోయింది. చలికి, రాళ్ల దెబ్బలకు గోవులు గోపాలకులు భయపడి వడవడ వణక సాగారు. శ్రీకృష్ణుని చూచి "కృష్ణా! మేము నీశరణుచొచ్చినాము. నీవే మాకు ఏకైక రక్షకుడవు. ఇంద్రుడు క్రోధం వహించి ఇలాంటి పనికి పూనుకొన్నాడు. ఇపుడు మాకు నీవే దిక్కు" అని ప్రార్థించారు.

ఇంద్రయాగాన్ని విరమించినందులకు కక్షతో ఇంద్రుడిట్టి దురాగతానికి పూనుకొన్నాడని తెలుసుకొని, "గోపకులారా! మీరు విచారపడవద్దు. దేవేంద్రాది దేవతలు సత్వగుణప్రధానులై ఉండవలయును. అట్లుండక మనపై క్రోధము వహించడం ఇంద్రునికి తగదు. సత్వగుణాన్ని కోల్పోయిన దేవేంద్రునికి ఇప్పుడు మానభంగం కలిగించి, అతనికి బుద్ధి చెబుతాను"అని శ్రీకృష్ణుడు అక్కడున్న గోవర్ధనగిరిని పెల్లగించాడు. దానిని ఎత్తి ఒక వ్రేలిపై ధరించాడు. ఆ పర్వతం క్రిందికి చేరండని గోపకులను పిలిచాడు.

వెంటనే గోవులు, గోపాలకులు ఆ పర్వతం క్రిందికి చేరి తలదాచుకొన్నారు. రాళ్లవర్షం నుండి తప్పించుకొన్నారు. గోవు లా గిరి క్రిందికి చేరి హాయిగా నెమరు వేయసాగాయి. దూడలు తల్లుల దగ్గర పాలు త్రావసాగాయి. గోపస్త్రీలందరు అక్కడికి చేరి తమ నిత్యకృత్యాలను చేసుకోవడం మొదలుపెట్టారు. దేవేంద్రుడు కురియించిన వర్షం వలన వారికెట్టి ఆటంకం కలుగలేదు. అట్లు ఏడు దినాలు గడిచాయి.

ఇంద్రుడు శ్రీకృష్ణుని యోగమాయా ప్రభావానికి ఆశ్చర్యచకితుడయ్యాడు. ఈబాలుడు సామాన్యుడు కాడు, సర్వయోగేశ్వరుడు, సర్వేశ్వరుడని ఎరిగి పరుగుపరుగున వచ్చి శ్రీకృష్ణుని పాదాలపై పడ్డాడు. వర్షం వెలిసింది. మేఘాలు మటుమాయమయ్యాయి. సూర్యుడు మింట ప్రకాశించాడు. శ్రీకృష్ణుడు గిరి క్రిందనున్న వారినందరిని పంపివేసి ఆ గిరిని యథాస్థానంలో నిలిపాడు.

గోవర్ధనగిరి యెత్తి గోవులను, గోపాలకులను కాపాడిన శ్రీకృష్ణుణ్ని యశోదా రోహిణులు నందుడు మొదలైనవారు వచ్చి కౌగిలించుకొన్నారు.

అంతట దేవలోకం నుండి పుష్పవర్షం శ్రీకృష్ణునిపై కురిసింది. ఆకాశాన నిలిచి సిద్ధులు, గంధర్వులు శ్రీకృష్ణుని స్తుతించారు. గంధర్వ రాజు తుంబురుప్రభృతులు శ్రీకృష్ణుని కీర్తించారు. గోపికలు శ్రీకృష్ణుని చేతిని ముద్దాడారు. ఇంద్రుడు కామధేనువుతోపాటు వచ్చి శ్రీకృష్ణునికి అమృతాభిషేకం కావించాడు. దేవతలు, నాలుగువేదాలు శ్రీకృష్ణుణ్ని గోవిందుడని అని కీర్తించాయి. నాటినుండి శ్రీకృష్ణుడు గోవిందుడైనాడు. గోవిందుడనగా వేదవేద్యుడని అర్థము.

**అండజవాహన! విను బ్ర**
**హ్మాండంబుల బంతులట్ల యాడెడి నీ వా**
**కొండల నెత్తితివందురు**
**కొండిక పనిగాక దొడ్డకొండా కృష్ణా! 21**

కృష్ణా! అండజవాహన! = పక్షియగు గరుత్మంతుడే వాహనముగా గల ఓ సర్వేశ్వరా! వినుము. బ్రహ్మాండంబులన్= సకల విశ్వమును, బంతులట్ల= బంతులవలె ఆటలాడెడు, నీవు, ఆకొండలన్= మందరాది పర్వతములను, ఎత్తితివందురు = ఎత్తినాడవని చెప్పుదురు, (అది) కొండిక పనిగాక= బాల్యచేష్టయే యగునుగాని, నీకది, దొడ్డకొండా?= కొండంత పనియా ఏమి?

సమస్త విశ్వాన్ని సృష్టించినవాడు చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు ఆ బ్రహ్మను ప్రతిష్ఠించినవాడు సనాతన పరబ్రహ్మము శ్రీకృష్ణుడు. సృష్టికి పూర్వావస్థ ఉండదు.

"బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్ అమృతస్యావ్యయస్య చ" -గీత.14-27

"బ్రహ్మను ప్రతిష్ఠించినవాడను నేను" అని గీతలో శ్రీముఖోక్తి. అట్టి సర్వేశ్వరునికి, అఖిలబ్రహ్మాండనాయకునికి ఒకకొండను భరించడం, దాన్ని చిటికెన వ్రేలిపై నిలపడం ఒక పెద్దపనియా? కాదు అని అర్థము. భగవంతుడు అఘటనాఘటన పటిమగలవాడు. ప్రకృతి సమస్తమూ ఆయన కనుసైగలలో మెలగి తన విధులను నెరవేరుస్తుంటుంది. శ్రీకృష్ణభగవానుడు ప్రకృతికి పరుడై, బాలుడై బ్రహ్మాండాలను బంతులవలె ఎగురవేసి ఆడుకొనగలడు. ఆయన సామర్థ్యం

అచింత్యము, అతర్క్యము. "అచింత్యాః ఖలు యే భావాః నతాం స్తర్కేణ యోజయేత్". అంచిత్యమైన విషయాలను తర్కంతో కూర్చగూడదు.

**అంసాలంబితకుండల!**
**కంసాంతక! నీవు ద్వారకా పురిలోనన్**
**సంసారిరీతి నుంటివి**
**హంసేంద్ర! విశాలనేత్ర! అచ్యుత కృష్ణా! 22**

కృష్ణా! అంస+ఆలంబిత కుండల= భుజముల వరకు వ్రేలాడు కుండలములు కలవాడా! కంస+అంతక=కంసుని సంహరించినవాడా! హంస+ఇంద్ర=శుకాది పరమ యోగులకు ఆరాధ్యదైవమైనవాడా! విశాలనేత్ర = విశాలమైన నయనములు కలవాడా! అచ్యుత= అవినాశియయినవాడా! అంతటివాడవైన నీవు ద్వారకాపురిలోన; సంసారిరీతిని = గృహస్థుడవలె ఉన్నాడవు. ఇది ఆశ్చర్యకరమైన విషయము.

ఈ కృష్ణశతకకర్త ఈపద్యపుటెత్తుగడ "అంసాలంబితకుండల" అని ప్రారంభించడం చూడగా ఇతడీ క్రింది చక్కని శ్లోకాన్ని సదా పఠించినవాడని గుర్తింపవచ్చు.

"అంసాలంబిత వామకుండలధరం మందోన్నత భ్రూలతం
కించిత్కుంచిత కోమలాధరపుటం సాచి ప్రసా రీక్షణం
ఆలోలాంగుళి పల్లవై ర్మురళికా మాపూరయంతం ముదా
మూలే కల్పతరో స్త్రిభంగిలలితం ధ్యాయే జగన్మోహనమ్"

"జగన్మోహనుడైన శ్రీకృష్ణుని ధ్యానిస్తున్నాను. ఆయన ఎడమ చెవికి పెట్టుకొన్న కుండలం బుజము వరకు వ్రేలాడుతున్నది. (ఎడమవైపు తల వ్రాల్చటం ఇది సూచిస్తున్నది. తీగవంటి కనుబొమలు కొంచెం పైకి లేవనెత్తాడు. సుకుమారమైన దొన్నెవంటి క్రింది పెదవిని కాస్త ముడిచాడు. అడ్డంగా చూపు ప్రసరింప చేస్తున్నాడు. బాగా కదలుతున్న వ్రేళ్ళతో పిల్లనగ్రోవిని సంతోషముతో పూరిస్తున్నాడు. కల్పవృక్షము మొదలు త్రిభంగిగా - ఎడమ కాలికెడమవైపున ముని వ్రేళ్ళపై కుడి పాదమానించి అందంగా నిలిచాడు") అని కల్పతరువు

సమీపాన నిల్చి బృందావనంలో వేణుగానం చేసే శ్రీకృష్ణభగవానుని మనోజ్ఞవర్ణన మిది. శ్రీకృష్ణ భక్తి భావనులకు ఈశ్లోకం ధ్యానయోగ్యము.

సర్వజగత్కారణుడు, ప్రకృతికి అతీతుడు, అప్రాకృతశరీరుడు అయిన శ్రీకృష్ణుడు ద్వారకాపురిలో అష్టభార్యల గృహాలలో సంసారిగా ఎట్లున్నాడనే విషయం నారదమునిని ఆశ్చర్యపరిచింది.

అదీగాక శ్రీకృష్ణునికి ఎనిమిది మంది భార్యలు. రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, లక్షణ అనువారలు. వీరే కాక పదహారువేలమంది రాజకన్యలు శ్రీకృష్ణునికి భార్యలైనారు.

నరకాసురుడు పదహారువేలమంది రాజకన్యలను అపహరించి తెచ్చి తన దుర్గంలోని చెరసాలలో బంధించాడు. నరకాసురుడు వామాచారాలు గల క్షుద్రమంత్రోపాసకుడు. తన క్షుద్రోపాసనకు రాజకన్యలను బలిపెట్టదలచాడు.

శ్రీకృష్ణుడు నరకాసురుని వధించి ఆ రాజకన్యల చెరవిడిపించాడు. వారందరు శ్రీకృష్ణునియందు మనసుంచారు. వారి భద్రతకై శ్రీకృష్ణుడు వారినందరిని వివాహమాడాడు. వారికి ధనకనక వస్తువాహనగృహపరిచారికాది సౌఖ్యాలను కలిగించాడు.

ఇంతమంది భార్యలతో శ్రీకృష్ణుడెలా కాపురం చేస్తున్నాడో అతని గృహస్థచర్యలెట్టివో తెలుసుకోడానికి నారదుడు కుతూహలపడి ఒకనాడు ద్వారకకు వచ్చి ఒక గృహం ముందు నిలిచి చూచాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి మందిరంలో ఉన్నాడు. నారదుని రాకను చూచి శ్రీకృష్ణుడు అతనిని తోడ్కొని పోయి ఉన్నతాసనం మీద కూర్చుండబెట్టి పూజించాడు. అసాధారణమైన బ్రహ్మణ్యదేవుడనే తన పేరును సార్థకమొనర్చు కొనుటకు ఆ నారదుని పాదాలకు మ్రొక్కి పూజించాడు.

అనంతరం నారదుడు మరియొక గృహానికి వెళ్లి త్రొంగి చూచాడు. అక్కడ శ్రీకృష్ణుడు ఉద్ధవునితో సంభాషిస్తూ తన భార్యతెచ్చిన పూజాద్రవ్యాలను అతని కిస్తున్నాడు.

నారదుడు వేరొక గృహానికి వెళ్లిచూచాడు. అక్కడ శ్రీకృష్ణుడు తన భార్యతో కూడి తన చిన్నారుల ముద్దుముచ్చటలతో కాలము గడపుతున్నాడు.

ఈ విధంగా శ్రీకృష్ణుడు తన యోగమాయా ప్రభావంతో ఇంటింట తన భార్యలతో నిత్యనైమిత్తిక కర్మలను ఆచరిస్తూండటం చూచి నారదుడు ఆశ్చర్యపడి శ్రీకృష్ణభగవానునికి సాష్టాంగపడి మ్రొక్కాడు.

నారదా! నేను ధర్మోపదేశికుడను మాత్రమే కాదు, ధర్మపాలనం చేయడం దానిని అనుష్ఠించడం నావిధి. సంసారులకు ధర్మశిక్షణ ఇచ్చే తలంపుతోడనే నేనిట్టి సద్ధర్మాచరణానికి పూనుకొన్నాను. నీవు మాత్రం నా యోగ మాయాప్రభావానికి లోనుకావద్దు అని హెచ్చరించాడు.

తరువాత శ్రీకృష్ణుడు నారదుని వెంటబెట్టుకొని పోయి, తన అష్టమహిషులనందరి యిండ్లలో తానెట్లు మెలగునో చూపించాడు. రుక్మిణి మొదలగు భార్యలు చిరుసిగ్గుతో, ప్రేమ భరిత హృదయాలతో శ్రీకృష్ణుణ్ని నారదుణ్ని పూజించారు.

**పదియాఱువేల నూర్వురు**
**సుదతులు నెనమండ్రు నీకు సొంపుగ భార్యల్**
**విదితంబుగ బహురూపుల**
**వదలక రమియింతువౌర వసుధను కృష్ణా! 23**

కృష్ణా! నీకు, వసుధను= భూలోకములో, పదియారువేల నూర్వురు, సుదతులు= స్త్రీలు, వీరుగాక, సొంపుగన్= అందముగా; ఎనమండ్రు భార్యలు= ఎనిమిదిమంది పట్టమహిషులుగలరు, వీరిని, బహురూపములన్=అనేక రూపములతో, వదలక=విడువక; రమింతువు=క్రీడింతువు. ఔరా! ఆశ్చర్యముగదా!

శ్రీకృష్ణునకు పదహారువేలమంది భార్యలు, ఎనమండ్రు పట్టమహిషులు కలరని శ్రీమద్భాగవతంలో ఉంది. పదహారువేలమంది భార్యలకు ద్వారకలో "తత్రషోడశభిః సద్మసహస్రైః సమలంకృతమ్" పదహారువేల చక్కని భవనాలున్నాయని తెలిపింది. కాని, "పదహారువేల నూర్వురు" భార్యల వృత్తాంతం

శ్రీవిష్ణుపురాణంలో ఉంది.

"షోడశస్త్రీ సహస్రాణి శతమేకం తతోఽధికం
తావన్తి చక్రే రూపాణి భగవాన్ మధుసూదనః"

విష్ణుపురాణం, పంచమాంశం అధ్యా. 32-18

పదహారువేలనూర్వురు కన్యలను పెండ్లాడునపుడు శ్రీకృష్ణభగవానుడు తానన్ని రూపాలను పొంది వివాహమాడి లోకాన్ని ఆశ్చర్యపరిచాడని శ్లోకార్థము.

శ్రీమద్భాగవతము వేదవ్యాసుడు రచించినది. విష్ణుపురాణం వేదవ్యాసుని తండ్రియగు పరాశరమహర్షి రచించినది. శ్రీకృష్ణావిర్భావానికి ముందే పరాశరుడు భవిష్యద్రష్ట అయి ఆ పురాణాన్ని రచించాడనడం స్పష్టం. శ్రీకృష్ణుని రాణులు నూర్గురు. వారితో పదహారు వేలరాజపుత్రికలను కలిపి మొత్తము పదహారువేలనూర్గురని భావింపవలసి ఉన్నది.

**అంగన పనుపున దోవతి**
**కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిన యా**
**సంగతి విని దయ నొసగితి**
**రంగుగ సంపదలు లోకరక్షక! కృష్ణా! 24**

కృష్ణా! అంగన పనుపునన్= భార్య పంపుట చేత; దోవతి కొంగునన్= కట్టు వస్త్రము చివర అటుకులను, ముడుచుకొని = మూటకట్టుకొని వచ్చిన, (సుదాముని) సంగతి విని=సుదాముని వృత్తాంతమును, ఆకళించుకొని, దయన్= దయతో, రంగుగ= వివిధములైన; సంపదలు= ఐశ్వర్యములను, ఇచ్చితివి= ప్రసాదించితివి; ఓ లోకరక్షక = లోకములను సంరక్షణ చేయు శ్రీకృష్ణా!

శ్రీకృష్ణునికి బాల్యసఖుడు, సహాధ్యాయి ఒక బ్రాహ్మణుడున్నాడు. అతడు బ్రహ్మజ్ఞాని. విషయవిరక్తుడు. శాంతచిత్తుడు, జితేంద్రియుడు. ఏ సంపన్నుడేమి ఇచ్చినను పుచ్చుకొనేవాడు కాడు. ఏవిధమైన ధనసంపాదన లేదు. అతని వస్త్రీ చినిగిన బట్టలే. అతడు కుచేలుడు. అతని భార్య సుశీలయు అట్టిదే. ఆమె

మహాపతివ్రత. తనభర్త తిండిలేక ఆకటితో సొటసొటలాడుట ఆమె చూడలేక పోయింది. ఆమెకూడా ఆకటి చిచ్చుతో చిక్కి సగమయింది.

ఒకనాడా సుశీల భర్తతో ఇలా అన్నది. "లక్ష్మీనాథుడగు శ్రీకృష్ణుడు మీకు పరమమిత్రుడు. బాల్యసఖుడు, ఆయన భక్తవాంఛాకల్పతరువు. శరణాగత వత్సలుడు, బ్రాహ్మణులకు పరమ భక్తుడు. అట్టి శ్రీకృష్ణుని దగ్గరికి వెళ్లి మన పేదతనం గూర్చి విన్నవించండి. ఆయన కృపాళువై మన పేదతనాన్ని తీర్చగలడు. భగవానుడు భక్తులు కోరినచో ధనాన్ని సుఖాలను ప్రసాదించడంలో ఆశ్చర్యమే మున్నది? నాపై దయయుంచి ద్వారకాధీశుడగు శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళండి" అని ఆమె వేడుకొన్నది.

ఆమె మాటను విని ఆ బ్రాహ్మణుడు ధనం కోసం కాకపోయినా చిరమిత్రుడైన శ్రీకృష్ణుని దర్శిస్తే చాలు శుభప్రదమని యెంచి "వెళతాను. కాని, ఆయనకు కానుకగా ఇవ్వడానికి మనయింట ఏమైన ఉన్నదా?" అని భార్యను అడిగాడు.

అప్పుడతని భార్య తనయింట స్వల్పంగా ఉన్న అటుకులను మూడు గుప్పెళ్లు, అతని ధోవతికి మూటగట్టి పంపింది.

ఆ బ్రాహ్మణుడు తనకు ద్వారకాధీశుడగు శ్రీకృష్ణుని దర్శనమవుతుందో కాదో, తన దారిద్ర్యరూపాన్ని చూచినవారు శ్రీకృష్ణభవనంలోనికి రానిస్తారో లేదో అని సంశయిస్తూ ద్వారకకు చేరాడు.

ద్వారకలో శ్రీకృష్ణుడు భవనద్వారం దగ్గరే ఎదురుపడి, బ్రాహ్మణమిత్రుని కౌగిలించుకొని అంతఃపురంలోనికి తోడ్కొనిపోయాడు. ఆతని దుర్దశకు కంటనీరు పెట్టుకొన్నాడు.

శ్రీకృష్ణుడా బ్రాహ్మణుని బంగారు సింహాసనంమీద కూర్చుండబెట్టి, అతని పాదాలను రుక్మిణీదేవి నీరు పోయగా తాను స్వయంగా కడిగి శిరస్సున చల్లుకొన్నాడు. శ్రీకృష్ణుని తక్కిన భార్యలు వింజామరలు వీస్తూ ఆ బ్రాహ్మణునికి సకలోపచారాలు చేశారు. రెండు రోజులు ఆ బ్రాహ్మణుడు మహోపచారాలను

పొందుతూ, ఇద్దరు తమ బాల్య జీవిత విశేషాలను చెప్పుకొంటూ ఆనందమగ్ను లయ్యారు. మరునాడు శ్రీకృష్ణుడు నాకేమి కానుకగా తెచ్చావు? నీవు ప్రేమతో పత్రమైనా పుష్పమైనా తోయమైనా ఇస్తే నేను ప్రీతితో ఆరగిస్తాను. ఏమి తెచ్చావు? అని అడిగాడు. తన దోవతికి మూటగట్టిన అటుకుల సంగతి చెప్పడానికి ఆ బ్రాహ్మణుడు బిడియపడ్డాడు. అవి నిజానికి అటుకులా? అటుకులు తెల్లగా ఉంటాయి. అవి పరిశుద్ధమైన పుణ్యకర్మలుగా భావించాలి. తన పుణ్యకర్మలను చూపి భగవంతునికి సమర్పించడానికి జీవుడు సిగ్గుపడటం సహజమేగదా?

శ్రీకృష్ణుడే ఆమూటను విప్పుకొని అటుకులను చూచి ఇవి నాకెంతో ఇష్టమైనవని ఒక గుప్పెడు నోట్లో పోసుకొన్నాడు. రెండవ గుప్పెడు అటుకులు నోట్లో పోసుకొంటూండగా లక్ష్మ్యంశతో అవతరించిన రుక్మిణీదేవి శ్రీకృష్ణుని వారించి, "ఇప్పటికే ఈబ్రాహ్మణుడు మహాధనవంతుడైనాడు, మరొక గుప్పెడు అటుకులను మీరు ఆరగిస్తే దేవేంద్రవిభవుడు కాగలడు, ఈతనికీ సంపద చాలు" అని శ్రీకృష్ణునికి ఎరుకపరచింది.

ఆ మరునాడు బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని అనుజ్ఞపొంది ఇంటికి బయలు దేరాడు. శ్రీకృష్ణుడతనిని కౌగిలించుకొని సాగనంపాడు. బ్రాహ్మణుడు గృహోన్ముఖుడై వస్తూ, "శ్రీకృష్ణుని నేనేమీ ధనమడుగలేదు. ఆయన ఇయ్యను లేదు. ఈపేద బ్రాహ్మణుని అంతగా పూజించి, కౌగిలించుకొని మహోపచారాలు కావించినవానిని నేనేమి కోరాలి? నాకీభాగ్యము చాలదా? అది సామాన్య భాగ్యమా? నిర్ధనులకు ధనమబ్బితే గర్వించి తనను మరచిపోతారేమో అన్న తలంపున నన్ను సద్వర్తనుణ్ని చేయగోరియే శ్రీకృష్ణుడు ధనదానం చేయడానికి వెనుదీశాడేమో? స్వర్గ, మోక్ష, యోగ సంసిద్ధులకు మూలమైనది ఆశ్రీకృష్ణుని చరణార్చనము" అని నిశ్చయించి ఆ బ్రాహ్మణుడు స్వగ్రామానికి చేరుకొన్నాడు.

అల్లంత దూరంలో కృష్ణసఖుడగు సుదాముని చూచి మేళతాళములతో సర్వాభరణభూషితలైన పడతులు పూర్ణకుంభాలను, పూజాపాత్రలను పట్టివచ్చి

సుదామునికి స్వాగతం పలికారు. మెల్లగా అతనిని ఒక మహాభవనానికి తోడ్కొని పోయారు. అక్కడున్న వస్తువులు అనర్ఘఅమూల్యదివ్యాలు. తన పిల్లలు, భార్య వెలలేని వస్త్రాలు ఆభరణాలు ధరించి ఉన్నారు. భవనము సకల వస్తువులతో నిండి శోభాయమానంగా ఉంది.

సుదాముడు ఆ ఇల్లు తనదే అని తెలిసి శ్రీకృష్ణుని దానశీలతకు, భక్తవత్సలతకు అంతులేని ఆశ్చర్యం పొందాడు. దానితో పాటు శ్రీకృష్ణుని అపార కృపాళుతను ఆయన మహిమను తెలుసుకొన్నాడు. అట్టి భగవంతుడు తనకు చెలికాడై ఉండునట్టి మహాదశ ముందు ఈసంపదలేపాటివి? అని భావించాడు. ఆతనికి శ్రీకృష్ణునిపై అచంచల మైన భక్తి, నశ్వరములగు సంపదలపట్ల విరక్తి కలిగింది.

ఆ బ్రాహ్మణుని పేరు సుదాముడు. దామమనగా త్రాడు. దామోదరుడనగా త్రాటిచేత కట్టబడిన ఉదరము గలవాడు శ్రీకృష్ణుడు. యశోద కృష్ణుణ్ని రోటికి త్రాటితో కట్టడం వల్ల ఆపేరేర్పడింది. సుదాముడనగా త్రాటిచే కట్టబడినవాడని అర్థము- అనగా బద్ధజీవుడు. సాంసారిక మాయాపాశంతో బంధితుడైన సుదాముడు భగవత్సన్నిధానానికి తాను చేసుకొన్న పుణ్యాలనెడి పిడికెడు అటుకులను కానుకగా పట్టుక పోయాడని ఈకథలోని ఆధ్యాత్మిక రహస్యం. ఆ పుణ్యాలను భగవానుడు పరిగ్రహించాడు. సుదాముని సకలేంద్రియాలు శ్రీకృష్ణుని మంగళమూర్తిని ఆరాధించటంలో నిమగ్నమైనాయి.

**హా! వసుదేవ కుమారక!**
**కావుము నా మానమనుచు కామిని వేడన్**
**ఆ వనజాక్షికి నిచ్చితి**
**శ్రీవర! అక్షయమటంచు చీరలు కృష్ణా! 25**

కృష్ణా! శ్రీవర= లక్ష్మీపతీ! హా! వసుదేవ కుమారక= వసుదేవుని పుత్రుడవగు ఓకృష్ణా! నా మానమును = స్త్రీనైననాకు సహజముగాగల గౌరవమును, కాపాడుము, అనుచు కామిని(స్త్రీ) = ద్రౌపది, వేడన్= ప్రార్థింపగా, ఆ వనజాక్షికి= పద్మములవంటి

కన్నులుగల ఆస్త్రీకి ద్రౌపదికి, అక్షయము+అటంచున్= క్షయముకాకుండుగాక యని చీరలు ఇచ్చితివి.

ఓవాసుదేవా! కృష్ణా, గోవిందా, గోపికా వల్లభా! అని దీనురాలై ద్రౌపది తన మానమును కాపాడుమని వేడుకొనగా, ఆమెకు అంతులేని చీరలనిచ్చి నిండు సభలో ఆ మహిళయొక్క గౌరవమును కాపాడినాడవు.

దుర్యోధనుడు ఏర్పరచిన మాయాద్యూతంలో ధర్మరాజు ఓడిపోయాడు. అతనితోపాటు భీమాదులందరు ఓడినవారయ్యారు. ధర్మరాజు తాను ఓడినపిదప, ద్రౌపదిని పణంగా పెట్టాడు. ఆ ఆటలో కూడా ధర్మరాజు పరాజితుడయ్యాడు. తాను ఓడిన పిమ్మట మరొకరిని పందెపు ద్రవ్యంగా పెట్టే అధికారం ఓడిన వానికి ఉండదు.

ద్రౌపదిని కూడా ఒడ్డి ఓడెనని దుష్టులైన కౌరవులు ఆమెను సభకు పిలిపించారు. ఆమె తాను ఓడి ధర్మరాజు నన్నోడెనా? నన్నోడి తానోడెనా? న్యాయం చెప్పండని సభాసదులను ప్రశ్నించింది. ఎవరును బదులు పలుకలేదు. ఇది అన్యాయం, అధర్మం అని పలుకలేదు. అప్పుడు దుశ్శాసనుడు ద్రౌపదిని సభలోనికి ఈడ్చి తెచ్చి, ఆమె చీరలను ఒలిచి అవమానించడానికి పూనుకొన్నాడు. పాండవులు ఆమె దీనస్థితిని చూచి కూడా ఏమీ చేయజాలక చిత్రాకృతులుగా ఉండి పోయారు. భీష్మాది కురువృద్ధులు ఇది తగదని ఎదిరింపజాలక పోయారు. క్రూరుడు, దుష్టుడునైన దుశ్శాసనుడు ద్రౌపది చీరలను లాగు తున్నాడు. అప్పుడు ద్రౌపది అశరణ్య శరణ్యుడగు శ్రీకృష్ణుణ్ని "శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత, గోవింద పుండరీకాక్ష రక్షమాం శరణాగతాం" అనీ, కృష్ణా! గోవిందా! గోపికా వల్లభా! కౌరవ మహాసముద్రమున మునిగిపోతున్నాను. నా మానమును కాపాడుము అని ఎలుగెత్తి శ్రీకృష్ణుని ప్రార్థించింది. వెంటనే శ్రీకృష్ణుడు ద్రౌపదికి అక్షయమైన చీరలను ప్రసాదించాడు. ఇది శ్రీకృష్ణుని వస్త్రావతారము. శరపరంపరలుగా ద్రౌపది శరీరం నుంచి వచ్చే చీరలను లాగడంలో దుష్టుడగు దుశ్శాసనుడు అశక్తుడయ్యాడు. అలసి పోయాడు.

ఆచీరల కుప్పలో అతడు వివశుడై పడి మూర్ఛితుడయ్యాడు. ద్రౌపది పాతివ్రత్యమహిమకు, శ్రీకృష్ణుని అపార కృపాళుతకు కౌరవులు ఆశ్చర్యచకితులయ్యారు. ఆ తర్వాత భీష్మద్రోణాదులు ద్రౌపదికి జరిగిన అవమానానికి ఖేదపడ్డారు. దుర్యోధన దుశ్శాసనాదుల దుర్నీతిని నిరసించారు.

"వసుదేవగృహే సాక్షాత్ భగవాన్ పురుషః పరః, జనిష్యతే తత్ప్రియార్థం సంభవంతు సురస్త్రియః". వసుదేవుని యింటిలో సర్వేశ్వరుడు ఆవిర్భవిస్తాడు. ఆయన్ను ప్రసన్నుణ్ని చేసుకోడానికి దేవవధూగణాలు గోకులంలో జన్మగ్రహణం చేస్తారు. వసుదేవకుమారుడు వాసుదేవుడు. 'సత్వం విశుద్ధం వసుదేవ శబ్దితం' విశుద్ధమైన అంతఃకరణాన్ని వసుదేవమంటారు. భగవదపరోక్షానుభవం అలాంటి విశుద్ధాంతఃకరణంలోనే కలుగుతుంది.

**శుభ్రమగు పాంచజన్యము**
**అభ్రంకషమగుచు మ్రోవ నాహవభూమిన్**
**విభ్రమలగు దనుజసుతా**
**గర్భంబుల పగులజేయు ఘనుడవు కృష్ణా! 26**

కృష్ణా! నీవు; ఆహవభూమిన్=యుద్ధభూమి యందు, శుభ్రమగు= తెల్లనిదగు, పాంచజన్యము=పాంచజన్యమను పేరుగల శంఖము, అభ్రంకష మగుచు=ఆకాశమును ఒరసినదగుచు, మ్రోవన్= ధ్వనింపగా, విభ్రమలగు= విభ్రాంతిని పొందినవారయిన, దనుజసుతా= రాక్షసస్త్రీల యొక్క, గర్భంబులన్= కడుపులను, పగులజేయు= బ్రద్దలుచేయు; ఘనుడవు= గొప్ప వాడవు మేఘము వంటివాడవు.

నీవు రణరంగంలో పాంచజన్యశంఖం ఊది రాక్షసస్త్రీల గర్భాలు బ్రద్దలుకావించు వీరుడవుగదా!

సాందీపని శ్రీకృష్ణుని విద్యాగురువు. అతనిపుత్రులు సముద్రంలో పడి మాయమయ్యారు. శ్రీకృష్ణుడు తన విద్యను పూర్తి చేసుకొని, దక్షిణ కోరుడని గురువును అర్థించాడు. సాందీపని మహావిరక్తుడు. తనకేమియు అక్కరలేదన్నాడు.

గురుపత్ని శ్రీకృష్ణుని మహిమను తెలిసినదగుటచేత సముద్రం పాలయిన తన పుత్రులను తెచ్చి ఇమ్మని కోరింది.

శ్రీకృష్ణబలరాములు సాందీపని పుత్రులను తోడ్కొని రావడానికి సముద్రం దగ్గరికి వచ్చారు.

సముద్రుడు దివ్యరూపంతో వెడలి వచ్చి శ్రీకృష్ణ బలరాములకు నమస్కరించి ఓదేవాధిదేవా! సాందీపని పుత్రులను నేను అపహరించలేదు. నా జలాలలో పంచజనుడనే రాక్షసుడున్నాడు. అతడా బాలురను బంధించి తోడ్కొనిపోయాడని చెప్పాడు.

వెంటనే శ్రీకృష్ణుడు సముద్రంలో ప్రవేశించి పంచజనుని పట్టి చంపాడు. పంచజనుని అస్థులలోనున్న శంఖాన్ని శ్రీకృష్ణుడు చేజిక్కించుకొని యుద్ధరంగంలో దానిని ఊదుతూ ఉండేవాడు. పాంచజన్యధ్వని వింటే రాక్షసుల బలం నష్టమై పోతుండేది. దేవతల తేజస్సు వృద్ధి అవుతుండేది. అధర్మం నశిస్తుండేది.

పాంచజన్యాన్ని పూరిస్తూ శ్రీకృష్ణుడు యముని పట్టణానికి వెళ్లాడు. అక్కడ యమయాతనలను అనుభవిస్తున్న సాందీపని పుత్రులను యథావిధ శరీరులను కావించి తెచ్చి సాందీపనికి గురుదక్షిణగా సమర్పించాడు.

శ్రీమహావిష్ణువు యొక్క స్వరూపశక్తులలో పాంచజన్యమొకటి. అది చైతన్యముతో కూడినది.

శ్రీ మహావిష్ణువే శ్రీకృష్ణుడు. ఆయనకు పాంచజన్యం అవసరమయింది. అది పంచజనుని అస్థులలో లభించినట్లు చేయడం లోక విడంబనం మాత్రమే. వాసుదేవుడనగా సర్వవ్యాపియయన విష్ణువు. వసుదేవుని పుత్రుడను సామాన్యార్థము వంటిదే ఇదియు.

శ్రీవత్సం కౌస్తుభం మాలాం గదాం కౌమోదకీం మమ
సుదర్శనం పాంచజన్యం సుపర్ణం పతగేశ్వరమ్.

ఈ శ్లోకంలో విష్ణుదేవుని మంగళాయుధాలు పేర్కొనబడినవి.

శ్రీవత్సమనేది యొక మచ్చ. కౌస్తుభము అది యొక మణి. మాల-

వనమాల-మెడనుండి పాదముల వరకు వ్రేలాడు మాలను వనమాల అంటారు. విష్ణుదేవుని గదను కౌమోదకి అంటారు. సుదర్శన చక్రము, పాంచజన్యమను శంఖము, సుపర్ణుడు= గరుత్మంతుడు. ప్రాతఃకాలమున వీరిని నిత్యము స్మరించినవారి బుద్ధి మరణాసన్న సమయంలోకూడా నిర్మలంగా ఉంటుంది .

(ఈపద్యంలో నాల్గవ పాదంలోని ప్రాస పొరపాటున దొర్లింది కావచ్చును; భకార రకారములకు, రకారభరాలకు ప్రాస ఉండదు.)

**జయమును విజయున కియ్యవె**
**హయములు ములుకోలమోపి యదలించి మహా**
**రయమున రొప్పవె తేరును**
**భయమున రిపుసేన విఱిగి పాఱగ కృష్ణా! 27**

కృష్ణా! నీవు, విజయునకు= అర్జునునకు, జయమును= విజయము, ఇయ్యవె= ఇచ్చితివిగదా, (అదెట్లు) హయములన్= గుఱ్ఱములను, ములుకోల మోపి= మునికోలను మోపి, అదలించి, రిపుసేన = శత్రువుగు కౌరవసేన, భయమున = భీతితో విఱిగి పాఱగ= చెల్లాచెదరగునట్లుగా, తేరును= రథమును; రయమున= వేగముగా; రొప్పవె= తరిమితివి గదా!

కృష్ణా! అర్జునునికి రథసారథివై గుఱ్ఱాలను ములుకోలతో అదలించి, మహావేగంగా రథాన్ని నడిపించి కౌరవసేన భయపడి చెల్లాచెదరగునట్లుగా చేసి విజయమును అర్జునుని కిచ్చితివిగదా!

అర్జునుడు నరుడు. శ్రీకృష్ణుడు నారాయణుడు. అనేక జన్మలనుండి అర్జునుడు భగవన్నారాయణునకు ఇష్టుడు. అంతేకాదు నిత్యపార్షదులలో ఒకడు. శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించినపుడు నరుడు కుంతీగర్భాన అర్జునుడుగా జన్మించాడు. అందుకు కారణం భగవంతుని సంకల్పమే. సత్యవతీ గర్భమున వేదవ్యాసుడు జన్మించడానికి కూడా భగవత్సంకల్పమే కారణము.

సమస్తాన్ని ఉద్ధరించే ప్రయత్నంతో శ్రీకృష్ణుడు వేదవ్యాసుణ్ణి, అర్జునుణ్ణి

అవతరింపజేశాడు. వేదవ్యాసుణ్ని కృష్ణుడంటారు. అర్జునుణ్ని కూడా కృష్ణుడంటారు. తాను శ్రీకృష్ణుడు.

కృష్ణం నారాయణం వందే కృష్ణం వందే వ్రజప్రియమ్
కృష్ణం ద్వైపాయనం వందే కృష్ణం వందే పృథాసుతమ్

నారాయణుడైన కృష్ణునికి నమస్కారము. గోపికా వల్లభుడైన కృష్ణునికి నమస్కారము. ద్వైపాయనుడైన కృష్ణునికి నమస్కారము. పృథా(కుంతీ)పుత్రుడైన కృష్ణునికి నమస్కారము.

దైపాయనుడైన కృష్ణునిచేత అష్టాదశపురాణాలను, బ్రహ్మసూత్రములను, వేదవిభాగమును చేయించి లోకాన్ని ఉద్ధరింపజేశాడు. తన రహస్యములను అర్జునునకు గీతగా బోధించి, దుష్టసంహార మతనిచే జరిపించి లోకాన్ని ఉద్ధరింప జేశాడు శ్రీకృష్ణుడు. మహాభారతము ఆదిమధ్యాంతము శ్రీకృష్ణగుణమాహాత్మ్యంతో పరిపూర్ణమయింది.

"సకలోద్ధార ప్రయత్నాత్మా కృష్ణః ప్రాదుర్బభూవ హ"

ఈవిధంగా ద్వాపరాంతంలో సమస్తాన్ని ఉద్ధరించే పూనికతో సర్వేశ్వరుడు శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించాడు.

ఆశ్రిత వాత్సల్య వివశుడగుటచే శ్రీకృష్ణుడు అర్జునునిచేత దుష్టసంహారాన్ని జరిపింప దలచి అతని రథానికి సారథ్యం చేయడానికి నిశ్చయించుకొన్నాడు. అదేకాక, యుద్ధంలో మరణించేవారికి తన దర్శనమిచ్చి వారికి సద్గతి కలగజేయాలన్న కారుణ్యంతో శ్రీకృష్ణుడు పార్థసారథి అయినాడు.

**దుర్జనులగు నృపసంఘము**
**నిర్జింపగఁదలచి నీవు నిఖిలాధారా!**
**దుర్జనులను వధియింపను**
**అర్జునునకు నీవు సాదివైతివి కృష్ణా! 28**

కృష్ణా! నిఖిల+ఆధారా!=సమస్తమునకు ఆధారభూతుడవైన ఓదేవాదిదేవా! దుర్జనులగు = దుష్టులతో కూడినదగు, నృపసంఘమున్= రాజసమూహమును,

నిర్జింపగన్+తలచి= జయింపనెంచియు; దుర్జనులను=దుర్మార్గులను, వధియింపను= చంపుటకుగాను నీవు అర్జునునకు, సాదివి= సారథివి ఐతివి.

సమస్త బ్రహ్మాండమునకు ఆధారమైన ఓకృష్ణా! నీవు దుష్టులైన ప్రభువులను జయించుట కొరకు, దుర్మార్గులను సంహరించుటకొరకు అర్జునునకు సారథివైనాడవు.

శ్రీకృష్ణభగవానుడు దుష్టసంహారకాండను అర్జునునిచే జరిపింపదలచాడు. అందుకై తాను సారథ్యము వహించాడు. శ్రీకృష్ణుడు అర్జునునకు సారథ్యం వహించడం లోని రహస్యం ఆశ్రితవాత్సల్యమే కాదు, అతనికి విజయుడను ప్రఖ్యాతిని కలిగించుటకే కాదు, యుద్ధరంగాన చనిపోయేవారికి తన దర్శనమిచ్చి వారికి సద్గతి కలిగింపవలెనన్నది ఆ కరుణాసముద్రుని, సర్వభూతసముని పరమాశయము.

ద్వాపరయుగంలో రాక్షసులు కొందరు మానవజాతికి ప్రభువులయ్యారు. గంధర్వకిన్నర నాగజాతులవారుకూడా తమ ప్రత్యేకమహిమలను కోల్పోయి మానవజాతిలో కలిసిపోయారు. భగవంతుని ఆదేశంతో కొందరు దేవతలు మానవులుగా పుట్టారు. విప్రచిత్తి అనే ఘోరరాక్షసుడు జరాసంధుడను పేరుతో విఖ్యాతినొందిన ప్రభువయ్యాడు. హిరణ్యకశిపుడు శిశుపాలుడయ్యాడు. కాలనేమి అనే దానవుడు ఉగ్రసేన మహారాజునకు కంసుడుగా జన్మించాడు. కౌరవ వంశానికి కళంకం తెచ్చిన దుర్యోధనుడు కలి అంశతో ధృతరాష్ట్రునికి జన్మించాడు. ధృతరాష్ట్రుడు పూర్వజన్మలో అరిష్టుడను గంధర్వరాజు. అట్టి వారిని తమతమ స్థానాలకు పంపి ఉద్ధరించు నవసరము ద్వాపరయుగాంతంలో కలిగింది. అందుకై శ్రీకృష్ణుడు అర్జునుడికి సారథియై కురుక్షేత్రసంహారలీల జరిపించి భూభారాన్ని తగ్గించాడు.

(ఈపద్యమునందు నాల్గవ పాదమున అచ్చుప్రతుల కొన్నిటిలో "అర్జునునకు సారథైతివికృష్ణా! అని ముద్రింపబడినది. సారథి+ ఐతివి= సారథి యైతివి" అని ఉండదగును. అట్లుండినచో గణభంగమగును. సారథి సంస్కృతపదము. అచ్చట ఇత్వసంధి జరుగదు. ప్రాచీన ప్రతులలో 'సాదివైతివి' అని యున్నది.

సాదిఅనగా సారథి అనిఅర్థము. కాగా ఈకాలమున "సాది" యను పదము మరుగున పడి'సారథి' అను పదమే మిగుల వ్యాప్తి నొందుటచే అనోట నానోటను పడి అదియు అచ్చుప్రతుల కెక్కినదనుకొందును.)

శక్రసుతు గాచు కొఱకై
చక్రము చేపట్టి భీష్ముఁ జంపగ జను నీ
విక్రమ మేమని పొగడుదు?
నక్రాగ్రహ! సర్వలోకనాయక! కృష్ణా! 29

కృష్ణా! గజేంద్రుని పట్టిన, నక్ర+అగ్రహ = మొసలిని ఆగ్రహించిన ఓ మహావిష్ణూ! సర్వలోకనాయక= అఖిల లోకములకు అధిపతివైన ఓకృష్ణా! శక్రసుతున్= (దేవేంద్రుని అంశతో పుట్టిన) అర్జునుని, కాచుకొఱకై= సంరక్షించుటకై, చక్రమున్= సుదర్శన చక్రమును, చేపట్టి= చేతపట్టుకొని; భీష్మున్= కురుపితామహుడైన భీష్ముని, చంపుటకు, చను = వెళ్లునట్టి, నీయొక్క విక్రమమును= శౌర్యమును, ఏమని పొగడుదును!

భారతయుద్ధ సందర్భంలో శ్రీకృష్ణుడు తాను ఆయుధం పట్టనని కేవలం అర్జునుడికి సారథిగా ఉంటానని ప్రతిజ్ఞ చేశాడు. భగవంతుడగు శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ విని శ్రీకృష్ణభక్తుడగు భీష్ముడు పాండవసేనలను కల్లోలపరిచి శ్రీకృష్ణునిచేత ఆయుధము పట్టిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

కౌరవుల పక్షాన భీష్ముడు ప్రప్రథమ సేనాపతియై పాండవసేనలతో పదిదినాలు హోరాహోరిగా పోరాడాడు. పాండవపక్షవీరులను ఎందరినో వధించాడు. పదవరోజున శ్రీకృష్ణుని ప్రోత్సాహంతో అర్జునుడు భీష్ముణ్ని ఎదుర్కొన్నాడు. భీష్ముని ప్రతాపాగ్నికి పాండవ పక్షంవారు సమిధల వలె దగ్ధులై పోతున్నారు. అర్జునుడు కురుపితామహుని వధించేందుకు వెనుకాడుతున్నాడు. తనను భుజాల కెక్కించుకొని పెంచినవాడాయన. విద్యాబుద్ధులు చెప్పించినవాడాయన. భీష్మునితోను, గురువైన ద్రోణునితోను పోరాడేటప్పుడు అర్జునుడు అజేయుడై నప్పటికి కొంత మెతకతనం వహిస్తుండేవాడు. భీష్ముడు తన పరాక్రమమంతా చూపుతూ అర్జునునిపై శరపరంపరలు గురిపిస్తున్నాడు. భీష్ముని బాణాలు

రెండు శ్రీకృష్ణునికి కూడా తగిలాయి. అర్జునుని మెతకతనానికి, భీష్ముని విజృంభణకు రోషించి శ్రీకృష్ణుడు తానై భీష్ముణ్ని వధించడానికి ఉద్యమించి చక్రాన్ని చేతబట్టాడు. అప్పుడు శ్రీకృష్ణుడెట్లున్నాడో భీష్ముడే వర్ణించిన పోతనగారి భాగవతంలోని హృద్యమైన పద్యమిది.

కుప్పించి యెగసిన గుండలంబుల కాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి గదల
జక్రంబుఁజేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మఱలఁదిగువఁ
గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి, నేఁడు భీష్మునిఁజంపుదు నిన్నుగాతు
విడువుమర్జున! యనుచు మద్విశిఖవృష్టి దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

శ్రీకృష్ణుడు ఆయుధం ధరింపనన్న తన ప్రతిజ్ఞను వదలుకొని భక్తుడైన భీష్ముని ప్రతిజ్ఞను నిలిపినవాడయ్యాడు. "కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి". గీత-9-31

"అర్జునా! నాభక్తునికి క్షతి లేదని నీవు ప్రతిజ్ఞాపూర్వకముగా చెప్పుము" అను గీతలో తాను చేసిన వాగ్దానము శ్రీకృష్ణుడీ సందర్భమున స్థిర పరచిన వాడయినాడు.

శ్రీకృష్ణుడు తన ప్రతిజ్ఞను వదలుకొనికూడా భక్తుడు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చునట్టి భక్తవత్సలుడు. తన ప్రతిజ్ఞాభంగానికి వెరవక భీష్ముని ప్రతిజ్ఞ నెరవేర్చడం చూచి భూదేవి కంపించింది. భూభారాన్ని తగ్గిస్తానని తాజేసిన ప్రతిజ్ఞను కూడా భగవానుడిలాగే భంగించుకొంటాడేమో అని ఆమె భయము. శ్రీకృష్ణుడు భీష్మునిపై కురుకునప్పు డాయన భుజం నుండి జారి భూమిపై పడిన

ఉత్తరీయం భయకంపితయైన భూదేవిని ఓదారుస్తున్నట్లున్నదని శ్రీశుకదేవుడు ఉత్ప్రేక్షించిన శ్రీమద్భాగవతంలోని శ్లోకాన్ని చూడండి.

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞా
మృత మధికర్తు మవప్లుతో రథస్థః
ధృతరథచరణో ఽభ్యయాచ్చల ద్గు
ర్హరి రివ హంతు మిభం గతోత్తరీయః"

"నేను శ్రీకృష్ణుని చేత ఆయుధం ధరింపజేస్తానని ప్రతిజ్ఞచేసిఉన్నాను. నాప్రతిజ్ఞను సత్యమొనరించి నాకు ప్రఖ్యాతి కలిగింపదలచి, శ్రీకృష్ణుడు ఆయుధం ధరింపనని తాజేసిన ప్రతిజ్ఞ వదలుకొన్నాడు. అట్టి సమయంలో శ్రీకృష్ణుడు రథంనుండి క్రిందికి ఏనుగును చూచిన కొదమసింహంలాగా దూకి చక్రాన్నిచేత బట్టి నాపైకి వచ్చాడు. ఆ ఆవేగంలో అతని మెడపై నున్న ఉత్తరీయం జారి కంపిస్తున్న భూమిమీద పడ్డది"అని ఆ శ్లోకానికి తాత్పర్యం.

చక్రధారియై తనపైకి దూకు శ్రీకృష్ణుని రోషభీషణ సౌందర్య మాధుర్యం భీష్ముని హృదయానికి హత్తుకొన్నది. విజయ సఖా! అని ప్రేమభక్తియుక్తుడై భీష్ముడు చేతులు మోడ్చినాడు. హేకృష్ణా! నీవు భగవానుడవై ఉండియు అర్జునుని ప్రేమకు వశమైనావు. అర్జునుని వంటి ఐకాంతిక భక్తులతో నాకు దేహసంబంధం ఉండటం వల్ల నేను కృతార్థుడనయ్యానని భీష్ముడు భావిస్తూ శ్రీకృష్ణుణ్ని ప్రస్తుతించాడు. భీష్మస్తుతి పద్యాలను పోతనగారి భాగవతంలో చదువుకొని ఆనందిచండి. తరించండి.

**దివిజేంద్ర సుతుని జంపియు**
**రవిసుతు రక్షించినావు రఘురాముడవై**
**దివిజేంద్ర సుతుని గాచియు**
**రవిసుతుఁ బరిమార్చితౌర రణమున కృష్ణా! 30**

కృష్ణా!(త్రేతాయుగమున నీవు) రఘురాముడవై= రఘువంశమున అవతరించిన శ్రీరాముడవై, దివిజ+ఇంద్రసుతున్= దేవేంద్రుని వరమున

జన్మించిన వాలిని, చంపియు, రవిసుతున్= సూర్యుని కుమారుడైన సుగ్రీవుని, రక్షించినావు= కాపాడినావు. ఇది త్రేతాయుగమున భగవానుడు శ్రీరాముడుగా అవతరించి చేసిన ఉద్ధారము.

(ఇక ద్వాపరయుగమున) దివిజ+ఇంద్రసుతుని= దేవేంద్రుని వరముతో అవతరించిన అర్జునుని, కాచియు = సంరక్షించియు, రవి సుతున్= సూర్యుని వరమున పుట్టిన కర్ణుని, రణమున=యుద్ధమున, పరిమార్చితి+ఔర = వధించితివి. ఔర = ఇది ఆశ్చర్యము కదా!

కృష్ణా! నీవు శ్రీరామావతారంలో ఇంద్రసుతుని (వాలిని) చంపి, సూర్యసుతుని (సుగ్రీవుని) కాపాడినావు. శ్రీకృష్ణావతారంలో పూర్వం చేసినపనికి విరుద్ధంగా ఇంద్రసుతుని (అర్జునుని) కాపాడి, సూర్యసుతుని (కర్ణుని) వధింపజేసినావు.

శ్రీకృష్ణుడు యుగపద్విరోధిగుణాశ్రయుడు, (= ఒక దానికొకటి వ్యతిరేకమైన గుణాలు ఏక కాలములో కలిగి ఉండేవాడు) జ్ఞానమూర్తి, అఖిల రసామృత సింధువు, భక్తానుగ్రహకాతరుడు, (= భక్తుల మీద అనుగ్రహంతో బాధ పడేవాడు) హానోపాదాన రహిత నిత్యసత్య సచ్చిన్మయ పురుషోత్తముడు, (= వదువదగినది స్వీకరింపదగినది అని తేడా లేని సత్యము నిత్యము అయిన సత్యస్వరూపమైన, జ్ఞాన స్వరూపమైన, క్షరుడు అక్షరుడు అని పురుషులకు వేరైన ఉత్తమ పురుషుడు) స్వయం భగవానుడు. ఆయన జన్మకర్మలు దివ్యములు. అవి మానవమాత్రులకు ఎరుకపడునవి కావు. అప్రాకృతుడైన శ్రీకృష్ణుని లీలా రహస్యాలు అప్రాకృతస్థితికి చేరినవారికే తెలుస్తాయి. "బ్రహ్మభూతు"లైన ప్రసన్నాత్ములకు పరాభక్తి జనిస్తుంది. అట్టివారికే శ్రీకృష్ణుని జన్మకర్మల రహస్యాలు తెలుస్తాయి.

**దుర్భరబాణము రాగా**
**గర్భములోనుండి అభయ కావుమటన్నన్**
**నిర్భరకృప రక్షించితి**
**వర్భకు నభిమన్యుసుతుని నచ్యుత కృష్ణా!** **31**

కృష్ణా! అచ్యుత=శాశ్వతమైనవాడా! దుర్భరబాణము= భరింపశక్యముకాని బాణము, రాగా= అశ్వత్థామచేత ప్రయోగింపబడగా, గర్భములోనుండి= కడుపులోననే యుండి; అభయ=భయమును పోగొట్టువాడా! అభయదానము చేయువాడా! కావుము+అటన్నన్= రక్షింపుమనగా, అర్భకున్= శిశువగు అభిమన్యుసుతున్= అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తును, నిర్భరకృపన్= నిండారు దయతో, రక్షించితివి= కాపాడితివి.

భారతయుద్ధానంతరం భీముని గదా ఘాతాలకు నేలగూలిన దుర్యోధనునికి ప్రీతి కలిగింపదలచి అశ్వత్థామ, పాండవశిబిరాలలో అర్ధరాత్రి గాఢనిద్రలోనున్న పాండవులను హత్య చేసేందుకు బయలుదేరాడు. కాని అతనికి ఎక్కడా పాండవులు కనిపించలేదు. పాండవుల శిశువులయిదుగురు ఒక్కచోట నిద్ర పోతున్నారు. అశ్వత్థామ కసితో నిద్రితులను ఆ బాలురను ఘోరంగా చంపాడు. అంతటితో తన క్రోధం తీరక అక్కడున్న గుఱ్ఱాల కాళ్ళను కూడా తెగనరికి పారిపోయాడు.

రణరంగంలో తొడలు విరిగి ప్రాణావశిష్టుడై పడియున్న దుర్యోధనునికి తాను చేసిన హత్యోదంతాన్ని ఎరుకపరచి తన ప్రభువును సంతోషపరచదలచాడు. కాని, అశ్వత్థామ చేసినపాపకృత్యాన్ని, ఆతతాయితనాన్ని విని దుర్యోధనుడు సంతోషించడానికి బదులుగా నీవు అత్యంత నీచకృత్యము చేశావని గర్హించాడు. ఆతతాయి అనగా చంప సిద్ధపడివాడు. ఈ సిద్ధ పడటమే కాదు బాలురను కూడా చంపినాడు.

తెల్లవారే సరికి పాండవ శిబిరాలలో ఏడ్పులు, పెడబొబ్బలు. ఇది ఆతతాయియగు అశ్వత్థామ చేష్టయని వెంటనే తెలుసుకొన్నారు. ద్రౌపది దుఃఖానికి అంతులేదు. భీముడామెను ఓదారుస్తూ అశ్వత్థామను ప్రాణాలతో పట్టి తెచ్చి, నీ సమక్షంలోనే ఆతణ్ని చిత్రవధ చేస్తానని చెప్పి, కృష్ణార్జునులతోపాటు అశ్వత్థామను వెదకడానికి బయలుదేరాడు. అల్లంతదూరాన అశ్వత్థామ తనపై దండెత్తువారిని చూచి భయపడి ఐషీకనామకమగు మహాస్త్రమును ప్రయోగించాడు. పాండవవంశ

క్షయమగుటకు బ్రహ్మశిరోనామకమనే భయంకరాస్త్రాన్ని ప్రయోగించాడు. పాండవులు శ్రీకృష్ణుని తోడ్పాటుతో ఆ అస్త్రం బారి నుండి తప్పుకొని అశ్వత్థామను పట్టుకొని కొట్టి ద్రౌపది వద్దకు తోడ్కొని వచ్చారు. గురు పుత్రుడైన అశ్వత్థామను చంపుతారేమో అని భయపడి ద్రౌపది, తన వలె గురుపత్ని కూడా పుత్రశోకం అనుభవింపకూడదని తలచి అశ్వత్థామను వదలి పెట్టండని చెప్పింది. అర్జునుడు కత్తి తీసికొని అశ్వత్థామ శిరముపై ఉన్న మహామహిమోపేతమైన రత్నాన్ని ఖండించి అతనిని నిర్వీర్యుని చేసి అటనుండి తరిమి వేశాడు.

అశ్వత్థామ ప్రయోగించిన ఆ అస్త్రం ఆ సమయంలో గర్భవతిగా ఉన్న ఉత్తరకు తగిలి ఆమె మృతశిశువును ప్రసవించింది.

శ్రీకృష్ణుడు హస్తినాపురం నుంచి ద్వారకకు వెళ్లే సమయంలో కుంతిని చూడటానికిరాగా రాజభవనంలో దుఃఖాలాపాలు వినిపించాయి. కుంతి కృష్ణుని రాక చూచి దుఃఖిస్తూ వచ్చి, కృష్ణుని చేతులు పట్టుకొని ఉత్తరకన్న శిశువును రక్షింపుమని ప్రార్థించింది. కృష్ణుడు లోనికి రాగానే ఉత్తర శ్రీకృష్ణుని పాదాలపై పడి నేల మీద దొర్లుతూ కడుపుచుమ్మలు చుట్టగా ఏడ్వసాగింది. పాండవుల వంశాంకురం లేకుండా పోయిందని అందరు దుఃఖంలో మునిగిపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు తన పాదాన్ని మృత శిశువునకు తాకించాడు. తోడనే ఆ బాలుడు సజీవుడయ్యాడు. శ్రీకృష్ణుని పాద స్పర్శ చేత అశ్వత్థామ ప్రయోగించిన దారుణాస్త్రం నిష్ఫలమయింది. చచ్చిబ్రతికిన ఆబిడ్డడికి పరీక్షిత్తు అనియు, కృష్ణ రూపములో ఉన్న విష్ణువు చేత కాపాడబడినాడు కనుక విష్ణురాతుడనియు నామకరణం చేశారు.

ఆ ఐషీకాస్త్రమే దుర్భరమైన బాణము. అప్పటికి పాండవేయుల వంశంలో గర్భవతిగా ఉన్నది అభిమన్యుని భార్యయగు ఉత్తర ఒక్కతెయే. ఆ అస్త్రం ఆమె గర్భమునకు తగిలింది. ఆమెకు కలిగినది మృతశిశువు. అతడే విష్ణురాతుడను పేరుగల శ్రీమద్భాగవతశ్రోత పరీక్షిన్మహారాజు.

గిరులందు మేరువౌదువు
సురలందున నింద్రుడౌదు చుక్కలలోనన్
బరమాత్మ! చంద్రు డౌదువు
నరులందున నృపతి వౌదు నయముగ కృష్ణా! 32

కృష్ణా! పరమాత్మ=శ్రీకృష్ణా! గిరులందున్= పర్వతములందు, మేరువౌదువు= మేరు పర్వతమైనవాడవు; సురలందునన్= దేవతలలో, ఇంద్రుడౌదువు= దేవేంద్రుడవు అవుదువు. చుక్కలలోన్= నక్షత్రములలో, చంద్రుడు+ఔదువు= చంద్రుడవు అవుదువు. నరులందు= మనుష్యులయందు; నయముగన్= నీతిగా పాలించు, నృపతివి= ప్రభుడవు, ఔదువు= అవుదువు.

మేరువు పురాణాలలో పేర్కొనబడిన ప్రసిద్ధ పర్వతము. దీనిని బంగారు కొండ అంటారు. ఇది ఇలా వృతమధ్యమంలో మందరము, మేరుమందరము, సుపార్శ్వము, కుముదము అను నాల్గుపర్వతాల మధ్య ఉన్నది. మేరుపర్వతానికి తూర్పున దేవకూటమున్నది. పశ్చిమాన పారియాత్రమున్నది. దక్షిణాన కైలాసమున్నది. ఉత్తరాన త్రిశృంగము లేదా మకరమున్నది. వీటి మధ్యమందు బ్రహ్మదేవుని సువర్ణ నిర్మిత నగరం, దానికి నాలుగు వైపుల దిక్పాలకుల ఎనిమిది నగరాలు ఉన్నవని భాగవతాది పురాణాలు తెలుపుతున్నాయి.

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు తన ఐశ్వర్యమయ రూపాలను పేర్కొంటూ "మేరుః శిఖరిణా మహమ్" (-గీత 10-23) పర్వతాలలో నేను సుమేరు పర్వతమును అని పేర్కొన్నాడు.

"దేవానా మపి వాసవః" (గీత10-22)

ఆదిత్యాది దేవతలలో నేను దేవేంద్రుడనని తన ఐశ్వర్యరూపాన్ని పేర్కొన్నాడు.

"నక్షత్రాణా మహం శశీ" (గీత10-21)

నక్షత్రాలలో నేను చంద్రుడనని తన ఐశ్వర్యరూపాన్ని తెలిపినాడు.

"నరాణాం చ నరాధిపమ్" (గీత10-21)

నరులలో నేను ప్రభువును అని తన ఐశ్వర్యరూపాన్ని పేర్కొన్నాడు.

"నావిష్ణుః పృథివీపతిః" విష్ణ్వంశలేనివాడు ప్రభువుకాలేడని ఆభాణకమున్నది.

సర్వేశ్వరుడగు శ్రీకృష్ణభగవానుని ఐశ్వర్యరూపాలెన్నో ఉన్నవి. శతవర్షాల పాటు ఏకరువు పెట్టినను తరగనివి అవి. ప్రధానంగా కొన్నిటినే గీతలో స్వయంగా ఎరుక పరిచాడు భగవానుడు.

**చుక్కల నెన్నగ వచ్చును**
**గ్రక్కున భూరేణువులను గణుతింపనగున్**
**జొక్కపు నీ గుణజాలము**
**నక్కజమగు లెక్కపెట్ట నజునకు కృష్ణా! 33**

కృష్ణా! చుక్కలను= నక్షత్రాలను, ఎన్నగవచ్చును= లెక్కింపవచ్చును. గ్రక్కునన్= వెంటనే, భూరేణువులను= భూమియందలి ఇసుకలోని పరమాణువులను, గణుతింపనగున్= = లెక్కించుటకు సాధ్యమగును, కాని, చొక్కపు= అందమగు, నీ గుణజాలమున్= నీ గుణసమూహమును, లెక్కపెట్టన్= లెక్కపెట్టుటకు, అజునకున్= బ్రహ్మదేవునికైనను, అక్కజమగు= అశక్యమగును, శక్తికి మీరిన దగును.

కృష్ణా! ఆకాశంలోని నక్షత్రములను లెక్కించవచ్చు. భూరేణువులనైనను లెక్కపెట్టవచ్చుసు. కాని, ఆశ్చర్యకరమగు నీకళ్యాణ గుణగణాలను లెక్కపెట్టడానికి బ్రహ్మదేవునికైనను శక్యంకాదు.

శ్రీవిష్ణుదివ్యసహస్రనామాలు మహామహిమోపేతమైనవి. అవి భగవంతుని కళ్యాణ గుణాలను, లీలలను తెలుపుతాయి. ఆ గుణాలుగాని, లీలలుగాని, సహస్ర సంఖ్యాకములు మాత్రమే కావు. సహస్రమంటే ఇక్కడ అనంతమని అర్థము.

భగవద్రామానుజులు తమ శరణాగతి గద్యలో సర్వేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుణ్ని "స్వాభావిక కళ్యాణగుణగణౌఘ మహార్ణవు"డని వర్ణించారు.

'గుణ గణౌఘ మహార్ణవ" అనడంలో ఒక్కొక్క గుణానికి అవాంతర గుణాలెన్నో ఉండటం వల్ల గుణగణమన వలసి వచ్చింది. సమస్త కళ్యాణ

గుణాలకు ఏకాశ్రయమైన వాడగుటచే గుణగణౌఘములకు అర్ణవ(సముద్ర)మైన వాడని భావించాలి.

యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక

తథా గుణాశ్చ దేవస్య త్వసంఖ్యేయా హి చక్రిణః

నాయనా, సముద్రంలోని రత్నాలెలా లెక్కకు మిక్కిలిగా ఉన్నాయో, అలాగే శ్రీవిష్ణుదేవుని కళ్యాణగుణాలు కూడా లెక్కను మించినది అని దీని భావం.

**కుక్షిని సకల జగంబుల**
**నిక్షేపము జేసి ప్రళయనీరధి నడుమన్**
**రక్షక! వటపత్రముపై**
**దక్షతఁ బవళించునట్టి ధన్యుఁడ కృష్ణా! 34**

కృష్ణా! రక్షక= జగద్రక్షకా! కుక్షిని= పొట్టయందు; నిఖిల జగంబులన్= సమస్త లోకములను, నిక్షేపముజేసి= భద్రపరచి, ప్రళయ నీరధి= ప్రళయకాల సముద్రము యొక్క, నడుమన్= మధ్యభాగమునందు; వట పత్రముపై= మఱ్ఱియాకు మీద; దక్షతన్= సామర్థ్యముతో, పవళించునట్టి= పరుండునట్టి, ధన్యుడ= శ్రీమంతుడా!

శ్రీకృష్ణా! జగద్రక్షకా! నీ ఉదరమునందు సమస్తలోకములను భద్రపరచుకొని ప్రళయ సముద్రమున వెలసిన మఱ్ఱిచెట్టు నందలి ఆకుపై శక్తియుక్తుడవై పరుండియుండెడి శ్రీమంతుడవు నీవు.

మార్కండేయుడు అనేక కల్పాలు జీవించిన సిద్ధపురుషుడు. ఆజన్మ బ్రహ్మచారి. ఒకానొక కల్పావసానంలో భూగోళమంతా జల ప్రళయంలో మునిగిపోగా మార్కండేయుడొక్కడు మిగిలి ఆ జలాలపై తేలుతూ ఒకచోట అక్షయ వటవృక్షాన్ని చూచాడు. ఆ చెట్టు ఆకుపై, లోకాలను ఉదరంలో నిక్షేపించుకొని పరుండిన బాలముకుందుణ్ని సందర్శించాడు. ద్వాపరం పూర్తికాకముందే మహాభక్తుడైన మార్కండేయ మహామునికి సర్వేశ్వరుడు తన శ్రీకృష్ణ రూపాన్ని దర్శింపజేసి, అతని చిరకాల జీవితానికి సాఫల్యం చేకూర్చాడు.

"గోవిందం సుఖసింధుం చైతన్యఘనం హృది ధ్యాయన్
అంభోధిరివాక్షుభితో మార్కండేయో ముని ర్జయతి"

- శ్రీ బలదేవవిద్యాభూషణుడు

చైతన్య ఘన సింధువైన గోవిందుని తన హృదయంలో ధ్యానించి మార్కండేయ మహాముని నిస్తరంగ సముద్రం వలె విరాజిల్లుతున్నాడు.

శ్రీకృష్ణకర్ణామృత కావ్యంలో లీలాశుక బిరుదాంచితుడైన బిల్వమంగళుడు బాలముకుందుని రూపాన్ని ఎంత సుందరంగా వర్ణించెనో చూడండి.

కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్య పత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి

తన పద్మం వంటి చేతితో చరణపద్మాన్ని పట్టుకొని, దాన్ని ముఖపద్మంలో ఉంచుకొని వటపత్రం మీద యోగనిద్రతో శయనించిన బాలగోవిందుని, బాలముకుందుని, అనగా బాల రూపములో ఉన్న ముక్తిదాయకుని మనసులో స్మరిస్తున్నాను.

**విశ్వోత్పత్తికి బ్రహ్మవు**
**విశ్వము రక్షింపఁ దలచి విష్ణుడవనఁగా**
**విశ్వముఁ జెఱుపను హరుడవు**
**విశ్వాత్మక! నీవెయగుచు వెలయుదు కృష్ణా! 35**

కృష్ణా! విశ్వ+ఉత్పత్తికి = సకలలోకముల, ఉత్పత్తికి = పుట్టుకకు, బ్రహ్మవైతివి, విశ్వమున్ = సమస్త జగత్తును, రక్షింపదలచి=కాపాడనెంచిన, విష్ణుడవైతివి, విశ్వమున్= సమస్త జగత్తును, చెఱుపను=నశింపజేయుటకైన, హరుడవు=మహేశ్వరుడవు నీవె, అగుచు, వెలయుదు=ప్రకాశింతువు, విశ్వాత్మక=సమస్తమునకు ఆత్మగా నున్న శ్రీ కృష్ణా!

విశ్వాత్ముడు అనగా తన జ్ఞాన శక్తులతో సమస్తమును వ్యాపించి సమస్తము

నకును అంతరాత్మ అయిన వాడు శ్రీకృష్ణభగవానుడు. భగవంతుని కార్యము విశ్వము. కారణమైనవాడు భగవంతుడు. అనగా విశ్వంలోని ప్రతిఅంశలోను భగవద్రూపమున్నది. సర్వేశ్వరుడు ఈ విధంగా సమస్త ప్రాణులలోను ప్రవేశించడంచేత ఆయనను విశ్వమంటారు.

శ్రీ కృష్ణుడు త్రిమూర్తి స్వరూపుడు. భీష్మపర్వంలో ''ఈ సమస్త జగత్తునకు ప్రభువైనవానికి నేను కుమారుడను'' అని బ్రహ్మదేవుడు దేవతలకు తెలుపుతూ

వాసుదేవో ఒర్చనీయో వః సర్వలోక మహేశ్వరః
తథా మనుష్యోఒయ మితి కదాచిత్ సుర సత్తమాః
నా వజ్ఞేయో మహావీర్యః శంఖ చక్ర గదాధరః

మహా. భీష్మ. 66-13-14

''సమస్త లోకాలకు మహేశ్వరుడైన వాసుదేవుడు పూజార్హుడు. శ్రేష్ఠులైన ఓ దేవతలారా! శ్రీకృష్ణుని సాధారణ మనుష్యునిగా భావించి ఎన్నడును అవజ్ఞ చేయకండి. ఎందుకంటే ఈశ్రీకృష్ణుడు ప్రభావ సామర్థ్యాలు గల మహావీర్యుడు శంఖ చక్రగదాధరుడైన శ్రీవిష్ణుభగవానుడు'' అని తెలిపినాడు. శ్రీకృష్ణభగవానుడు తాను సాక్షాత్తు పరబ్రహ్మమనీ, పురుషోత్తముడననీ, సచ్చిదానందమయుడననీ, భగవద్గీతలోను, అనుగీతలోను పెక్కుసార్లు స్పష్టంగా తనను గూర్చి చెప్పుకొన్నాడు.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే'' గీత 10-8.

నేనీ సమస్త ప్రపంచానికి, దాని ఉత్పత్తికి కారణమైనవాడను. నావల్లనే ఈ ప్రపంచం వర్తిల్లుతున్నది.

'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ' గీత 7-7.

అర్జునా! నాకంటె శ్రేష్ఠమైనది మరియొకటి ఏదీ ఈ ప్రపంచంలో లేదు. ఈ చేతన, అచేతనాలన్నీ దారంలోని మణులవలె నాయందు గుదిగ్రుచ్చబడి ఉన్నాయి.

''సర్వలోక మహేశ్వరమ్'' - గీత 5-29

"సర్వేషాం లోకానాం మహాంత మీశ్వరం సర్వేషాం లోకేశ్వరాణామపి ఈశ్వరమ్" సమస్త, లోకాలకు సమస్త లోకేశ్వరులకు ఈశ్వరుడను నేను. "గూఢం పరంబ్రహ్మ మనుష్య లింగం" మనుష్యరూపుడైన సాక్షాత్ పరబ్రహ్మము నీ యింటిలో నివసిస్తున్నాడని చెప్పాడు నారదుడు ధర్మరాజుతో.

అథవా బహునైతేన కిం జ్ఞానేన తవాఽర్జున
విష్టభ్యాఽహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ గీత.10-42

అర్జునా! ఈ విధంగా చెప్పించుకొన్నట్టి విస్తృత మైన ఈ జ్ఞానంతో నీకు ఏమి ప్రయోజనము? ఈ సమగ్రమైన విశ్వాన్ని నా సామర్థ్యంలోని ఒకానొక స్వల్ప భాగంతో ధరించి ఉన్నాను. అది నా సంకల్పాన్ని అతిక్రమించదు.

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత! గీత 15-19

అర్జునా! పురుషోత్తముడనైన నన్ను అనగా క్షర-అక్షర పురుషుల కంటె విలక్షణుడనగు నన్ను పురుషోత్తముడని క్షుణంగా తెలిసికొన్నవాడు సమస్తమూ తెలిసికొన్నవాడవుతాడు. అట్టి వాడు సర్వభావాలతో నన్ను సేవిస్తాడు.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ గీత 14-27

అవినాశి, నిర్వికారుడునగు బ్రహ్మను ప్రతిష్ఠించినవాడను, నిత్యమైన, నిరతిశయైశ్వర్యానికి, మోక్షసుఖానికి మూలాధారమైనవాడను నేను. "ప్రతిష్ఠ" అంటే శాశ్వతంగా నిలపడమని అర్థం.

శ్రీకృష్ణుడు త్రిమూర్తి స్వరూపుడని తెలపడానికి గీతలో ఇంకా అనేకో దాహరణాలున్నాయి. మహాభారతంలో భీష్ముడు, సంజయుడు, వ్యాసదేవుడు, నారదుడు పలికిన పలుకుల వల్లను, శ్రీమద్భాగవతంలో నారదుడు, బ్రహ్మ, ఇంద్రుడు, శ్రీగోపీజనులు, ఋషిగణాలు మున్నగువారి వాక్యాల వల్లనూ శ్రీకృష్ణుడు పూర్ణపరాత్పర సనాతన పరబ్రహ్మమని సుస్పష్టమవుతున్నది. యుధిష్ఠిరుడు తలపెట్టిన అగ్రపూజా సందర్భంలో భీష్మపితామహుడు:

కృష్ణ ఏవ హి లోకానా ముత్పత్తిరపి చావ్యయః
కృష్ణస్య హి కృతే విశ్వమిదం భూతం చరాచరమ్
ఏష ప్రకృతి రవ్యక్తా కర్తా చైప సనాతనః
పరశ్చ సర్వభూతేభ్య స్తస్మాత్ పూజ్యతమోఽచ్యుతః

మహా. సభా. 38-23-24

"శ్రీకృష్ణుడే సర్వలోకాలకు అవ్యయమైన ఉత్పత్తి స్థానము. ఈ చరాచర ప్రపంచం ఈయనవల్లనే ఉత్పన్నమైనది. ఈయనయే అవ్యక్త ప్రకృతి-సనాతన కర్తయు. ఈ అచ్యుతుడు సర్వ జీవులలో శ్రేష్ఠతముడు, పూజ్యతముడు" ఈశ్వరులకు ఈశ్వరుడైనందుననే ఆయన మహేశ్వరుడని, పరబ్రహ్మమని శ్వేతాశ్వతరోపనిషత్ చెబుతున్నది. 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' అని.

శ్రీకృష్ణుడు స్వయం భగవానుడు. "కృష్ణస్తు భగవాన్ స్వయమ్"అనుచోట "స్వయం" శబ్దం అన్యనిరపేక్షతను తెలుపుతున్నది. (శ్రీమద్భా. 1-3-27).

సమస్తభూత, భవిష్య, వర్తమానావతారాలు సమావేశమొందిన సర్వేశ్వరుడు శ్రీకృష్ణుడు విష్ణురూపుడై, నర నారాయణ రూపుడై, సనాతన పరబ్రహ్మరూపుడై ఉంటాడు. మరొకప్పుడు గోలోకవిహారియైన మహేశ్వరుడై ఒప్పుతుంటాడు. ఇంకొకప్పుడు క్షీరసాగర శయనుడైన విశ్వాత్ముడై విరాజిల్లుతుంటాడు. వైకుంఠంలో శ్రీవిష్ణువై విలసిల్లుతుంటాడు. సర్వవ్యాపియయిన పరమాత్మగా భాసిల్లు తుంటాడు. ప్రకృతి గర్భస్థాపనుడు విశ్వాత్ముడు, విశ్వాతీతుడైనవాడు శ్రీకృష్ణభగవానుడు.

**అగణిత వైభవ! కేశవ!**
**నగధర! వనమాలి! యాదినారాయణ! యో**
**భగవంతుడ శ్రీమంతుడ!**
**జగదీశ్వర! శరణు శరణు శరణము కృష్ణా! 36**

కృష్ణా! అగణిత= లెక్కింప శక్యముకాని, వైభవ=ఐశ్వర్యము గలవాడా! కేశవ= బ్రహ్మ మహేశ్వరులను ఇముడ్చుకొన్నవాడా! నగధర=కొండను

ధరించినవాడా! వనమాలి= వైజయంతియను వనమాలను ధరించినవాడా! ఆదినారాయణ = ఆది పురుష, భగవంతుడ = కళ్యాణగుణ స్వరూపుడా! లక్ష్మీనాథా! జగత్+ఈశ్వర = జగదీశ్వర, శరణు, శరణు, శరణము = రక్ష రక్ష రక్ష, ముమ్మాటికీ నీవే రక్షకుడవు.

శ్రీకృష్ణభగవానుని వైభవం వర్ణింపనలవి కానిది. ఆయన త్రిమూర్తి స్వరూపుడు. బృందావనంలో గోవర్ధన గిరిధారియై, వనమాలియై భువన మోహనంగా వేణుగీతి నాలపించినవా డాయన.

'నర' మనగా ఆత్మ. ఆ ఆత్మయందు ఉత్పన్నమైన ఆకాశాదులను నారములంటారు. నారములు అయనముగా అనగా నివాసముగా గలవాడు నారాయణుడు. శ్రుతివాక్యం ఇలా ఉంది.

యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః

ఈ కనిపిస్తున్న, వినిపిస్తున్న సమస్త జగత్తు నారాయణ స్వరూపమే. శ్రీనారాయణుడు బయటను, లోపలను సర్వవ్యాపియై నిలిచియున్నాడు.

యజుర్వేదము ఈవిధంగా చెబుతున్నది. భగవంతుడైన నారాయణుడు నిత్యుడు. బ్రహ్మము నారాయణుడు. శివుడును నారాయణుడే. ఇంద్రుడును నారాయణుడే. కాలము నారాయణుడు. దిశలు విదిశలును నారాయణుడే. పైనున్నవాడు, క్రిందనున్నవాడును నారాయణుడే, బయటను లోపలను ఉన్నవాడు నారాయణుడే. ఈజగత్తునందున్న సర్వమూ నారాయణుడే. ఒక్కడే నారాయణుడు. అతడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు అనిర్వచనీయుడు, విశుద్ధుడగు దేవాదిదేవుడు. అతడు తప్ప మరేదియూ ఈ విశ్వంలో లేదు. ఆ నారాయణుని తెలిసికొన్నవాడు విశ్వవేత్తవుతాడు.

సామవేదంలో "ఓం నమో నారాయణాయ" అను అష్టాక్షరమంత్రాన్ని గూర్చి దాని మహిమ గూర్చి వర్ణింపబడింది.

అథర్వవేదంలో అష్టాక్షరమంత్రం జపించిన వారికి వైకుంఠావాసం

లభిస్తుందని చెప్పబడింది. వైకుంఠమొక తెల్లతామర పువ్వనీ, దాని స్వరూపం విద్యుత్తుతో సమానమైన పరమ ప్రకాశమనీ, దేవకీనందనుడైన శ్రీకృష్ణ భగవానుడు బ్రహ్మణ్యుడై, పుండరీకనయనుడైన విష్ణువై, అచ్యుతుడై, సమస్త భూతములందును స్థితుడైన నారాయణుడై, కారణపురుషుడై, కారణ రహిత పరబ్రహ్మమునై ఉంటాడనీ అథర్వవేదం చెబుతున్నది.

'భగవంతుడు' అనగా ఎవరు?

జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజాంస్యశేషతః

భగవచ్ఛబ్ద వాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః

జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజము వీటిని 'భగ'మంటారు. అవి అనంతరూపాలతో ఎవనియందుండునో అతడు భగవంతుడు.

'ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః

వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీరణా' ॥

సమగ్రమైన ఐశ్వర్యము, సమగ్రమైన ధర్మము, సమగ్రమైన యశస్సు, సమగ్రమైన సంపత్తి, సమగ్రమైన వైరాగ్యము, సమగ్రమైన మోక్షము ఈ ఆరును కలవానిని భగవంతుడంటారు. శ్రీకృష్ణుని యందు ఈ ఆరును సమగ్రంగా సమన్వయం పొందాయి. కాబట్టి "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" అనే వాక్యం అక్షరశః సమర్థనీయము. యశోదాదేవి అనుభవంలో, ద్రౌపదీవస్త్రాపహరణ ప్రసంగంలో, పదహారువేల భార్యలతో కాపురమున్న ఘటనలో, అది చూచిన నారదుని ప్రసంగంలో, పూతనాది రాక్షసుల సంహారంలో, గోపీజన వల్లభత్వంలో శ్రీకృష్ణుని సర్వేశ్వరత్వము అనగా సమగ్రైశ్వర్యము నిరూపిత మయింది.

"కృష్ణో ధర్మః సనాతనః" అన్న మాటకు నిదర్శనమైనది శ్రీమద్భగవద్గీత. పరమార్థంతోపాటు వ్యావహారిక ధర్మాలను కూడా నిరూపణ చేయునట్టిది భగవద్గీత. తల్లిదండ్రులపట్ల శ్రీకృష్ణుడు చూపిన నమ్రత, విధేయతలు, జ్యేష్ఠభ్రాత పట్ల చూపిన అనునయం, గురువుపట్ల చూపిన సేవాభావం, బ్రాహ్మణులయెడ చూపిన భక్తి, గోసేవ, పత్నుల పట్ల ప్రేమమయ వ్యవహారం, రాజనీతి, శరణాగత

రక్షణ, 'యోగక్షేమం వహామ్యహమ్' భక్తులపట్ల వాత్సల్యం, "స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం ఋుతమధికర్తు మవప్లుతో రథస్థః" భక్తుడైన భీష్ముని పట్ల చూపిన భక్తపరాధీనత మున్నగునవి శ్రీకృష్ణుని సమగ్రైశ్వర్యానికి చిహ్నాలు.

శ్రీకృష్ణుని యశస్సు "యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి", "యే ఽ ప్యన్యదేవతా భక్తా ------" గీత 7-21, గీత 9-23. ఎవరు ఏ దేవుని ఉపాసించినప్పటికి ఆ ఉపాసన తనకే ప్రాప్తిస్తుందన్నాడు గీతలో శ్రీకృష్ణభగవానుడు, కనుక ఆయన కీర్తి సర్వజగద్వ్యాపిని. తత్త్వజిజ్ఞాసువులు, తత్త్వవేత్తలు తమ గ్రంథసముదాయాలలో శ్రీకృష్ణభగవానుని చరిత్రను, ఆయన చేసిన ఉపదేశాలను ఎన్నిటిని ఉల్లేఖించారో చెప్పడానికి అలవికాదు. భారతదేశంలో అన్ని రాష్ట్రాలలోను, అన్ని భాషలలోను శ్రీకృష్ణచరితను వర్ణించిన మహాపురుషులు, భక్తులు, కవులు అనేకులున్నారు. సంస్కృత సాహిత్యంలో శిశుపాలవధ మున్నగు కావ్యాలేకాక, శ్రీకృష్ణలీలలను వర్ణించిన గీతగోవిందాది కీర్తన గ్రంథాలనేకం కలవు. అవేకాక, మహాపురుషులైన మతాచార్యులందరు శ్రీకృష్ణభక్తులైనవారలే. శ్రీరామానుజాచార్య, శ్రీనింబార్క, శ్రీమధ్వాచార్య, శ్రీవల్లభాచార్య, శ్రీచైతన్య, నర్సిమెహతా, రూప-జీవగోస్వాములు శ్రీకృష్ణభక్తులగుటలో విశేషమేమియు లేదు. కాని, శ్రీశంకర భగవత్పాదులవారికి అపరశంకరులని ప్రసిద్ధి. ఆయన కూడ శ్రీకృష్ణభక్తుడే. శ్రీశంకర భగవత్పాదుల కులదైవము శ్రీకృష్ణుడు. ఆయన శ్రీకృష్ణుని గూర్చి, రాధాదేవిని గూర్చి, యమునా నదిని గూర్చి బృందావనమును గూర్చి చేసినన్ని మృదు మధురమైన స్తోత్రాలు వైష్ణవులనబడు వారెవ్వరును చేసియుండలేదు. "దామోదర గుణమందిర సుందర వదనారవింద గోవింద, భవజలధి మథనమందర, పరమం దర మపనయ త్వం మే" అని స్తుతించిన శ్రీ శంకరాచార్యులవారు శ్రీకృష్ణుని గూర్చి "దినే దినే నవం నవం నమామి నంద సంభవం". "రోజురోజుకు క్రొత్తగా కనిపించే నందనందనునికి నమస్కరుస్తున్నాను' 'అన్నారు కనుక ఆయన నేత్రములకు శ్రీకృష్ణుడు నిత్యనూతనుడుగా తోచెడివాడట. శ్రీశంకరులు నిత్యమానసిక పూజలు పరిగ్రహించే దైవం గురవాయూరప్ప

శ్రీకృష్ణభగవానుడే. 'యదుపతి కథా వియోగే వ్యర్థం గతం ఆయురితి చింతా' ఒక్క క్షణము శ్రీకృష్ణచరితను విడిచినచో ఆయువు వ్యర్థంగా గడచిపోయిందే అను చింతగల శ్రీకృష్ణభక్తుడు శ్రీశంకర భగవత్పాదులవారు. శ్రీకృష్ణుని రూపమాధుర్యము, లీలామాధుర్యము, వేణు మాధుర్యము, ప్రియా మాధుర్యము మున్నగునవి రాధాదేవ్యాది గోపికలకు మనోమోహకమైనవేకాక, యథార్థానికి సర్వజగన్మనోమోహకమైనవై కీర్తింపబడుతున్నవి. ఆరాధింప బడుతున్నవి. 'అద్వైతసిద్ధి' అను ఉద్గ్రంథమును రచించిన శ్రీమధుసూదన సరస్వతీ స్వామి కూడా "భక్తిరసాయనము" అను శ్రీకృష్ణభక్తి ప్రతిపాదకమైన గ్రంథం రచించారు. అంతమాత్రమే కాక నిర్గుణ, నిరాకార తత్త్వాన్ని ప్రతిపాదించే ఆయన అద్వైతస్వామియైనను పూర్ణావతారుడగు శ్రీకృష్ణచంద్రుని రూపము ఆయన హృదయమున నెట్లు హత్తుకొనెనో చూడుడు.

ధ్యానాభ్యాస వశీకృతేన మనసా యన్నిష్కలం నిష్క్రియం
జ్యోతిశ్చేతసి యోగినో యదిపరం పశ్యంతి పశ్యంతు తే
అస్మాకం తు తదేవ లోచన చమత్కారాయ భూయాచ్చిరం
కాలిందీ పులినోదరే కిమపి యన్నీలం మహో ధావతి

వంశీవిభూషితకరా న్నవనీరదాభాత్
పీతాంబరా దరుణబింబఫలాధరోష్ఠాత్
పూర్ణేందుసుందరముఖా దరవిందనేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వ మహం న జానే

"ధ్యానాభ్యాసంతో మనస్సును స్వవశమొనర్చుకొనే యోగులు నిర్గుణ నిష్క్రియ పరమజ్యోతిని దర్శింపగలిగినచో బాగుగా దర్శింపనిండు. కాని, మాకై యమునానదీ పులినములందు (కృష్ణనామావళి) అలౌకికమైన ఒక నీల జ్యోతి పరుగిడుచున్నది. ఆజ్యోతి చిరకాలము మా కన్నులకు ఆనందము కలిగించునట్టిది."

"ఎవని కరకమలము వేణువుచే అలంకరింపబడినదో, ఎవని శరీరము

నీల మేఘచ్ఛాయగలదో, ఎవనిది పీతాంబరమో, ఎవనిది ఎఱ్ఱని దొండపండువంటి అధరమో, ఎవనిది పూర్ణచంద్రునివంటి సుందరమైన ముఖమో, ఎవనివి కమలముల వంటి నేత్రములో అట్టి శ్రీకృష్ణభగవానుడు తప్ప మరియొక పరతత్వము ఏమున్నదో నేనెఱుగను.''

అద్వైతాన్ని గూర్చి అనేక గ్రంథాలను రచించి ఉత్తరదేశపు శంకరభగవత్పాదు లని ప్రఖ్యాతిగాంచిన శ్రీమధుసూదనసరస్వతీస్వామి వారి హృదయంలో విరాజిల్లిన వాడు సగుణ సాకారుడు, అఖిలరసామృతమూర్తియైన శ్రీ కృష్ణ భగవానుడు.

శ్రీకృష్ణుని యశస్సు, ఆయన ఉపదేశాలు ఖండాంతరకీర్తి పొందినవి. పాశ్చాత్య వేదాంతులు ఆధ్యాత్మిక విశేషములను ప్రవచించడానికి భగవద్గీతను ఆధారంగా చేసుకొన్నారన్న విషయాన్ని పాశ్చాత్య విమర్శకులే చెబుతున్నారు. భగవద్గీతకు ఆంగ్లానువాదాలెన్నో వెలసినవి. ఫ్రాన్సుకు చెందిన సుప్రసిద్ధ గ్రంథకర్త జకోలియట్ (M. LOUIS JACOLLIOT) The Bible in India Hindoo origin of Hebrew and Christion Revelation) ఇత్యాది గ్రంథాలలో ఎన్నో ప్రమాణాలు లభిస్తున్నాయి.

శ్రీచైతన్య మహాప్రభువు ధ్యానమగ్నుడై ''ఈ ప్రపంచమంతయు కొంత కాలమునకు శ్రీకృష్ణభక్తి భరితమవుతుంది. ప్రపంచ ప్రజలందరు రాధాగోవిందు లను ఆరాధిస్తారు'' అని పలికారు. ఆ మహాత్ముడు పలికిన పలుకులు పరమ సత్యాలు. శ్రీ ప్రభుపాద స్వామివారు పాశ్చాత్య ప్రపంచానికి కనువిప్పు కావించి ఆ ప్రజలను శ్రీకృష్ణ భక్తిభావనులుగా చేసి శ్రీకృష్ణభక్తిని విశ్వవ్యాప్తం చేశారు.

''యశసః సమగ్రస్య'' అనుటకు లక్ష్యంగా ఇంత చెప్పవలసివచ్చినది. గ్రంథ విస్తర భీతిచే మరికొంత వ్రాయలేక పోతున్నాను.

శ్రియః (సమగ్రాయాః) శ్రీకృష్ణుడు సుదాముని ఉత్తరీయపు మూటను విప్పుకొని తనకు కానుకగా తెచ్చిన పిడికెడు అటుకులను భక్షించి, అతని దారిద్ర్యాన్ని క్షణంలో పోగొట్టి కుబేరునంతటి ధనవంతుణ్ని కావించినాడు. మహాలక్ష్మి అవతార రూపిణియైన రుక్మిణ్యాదులచే ఆ బ్రాహ్మణునికి పరిచర్యలు

చేయించినాడు. శ్రీ కృష్ణుని సమగ్రమైన సంపత్తిని నిరూపించడానికి ఇంత కంటె వేరే ప్రయత్నమెందులకు? శ్రీకృష్ణుడు శ్రియఃపతి. ఆయన కోరిక మేరకు శ్రీ మహాలక్ష్మి సుదామునికి ఆకాశంనుండి సిరిసంపదలు, వైభవం లభింపజేసెనని శ్రీ వేదాంత దేశికులవారు తమ శ్రీస్తుతిలో అన్నారు.

"తేషాం భూమౌ ధనపతిగృహాత్ అంబరా దంబుధేర్వా

ధారా నిర్యాం త్యధికమధికం వాంఛితానాం వసూనామ్." (శ్రీస్తుతి)

ఆకాశమునుండి సంపదలు పొందుటను గూర్చి "ఉత్పతన్నపి చాకాశం" అని శ్రీమద్రామాయణంలో శ్రీరాముని వచనము ప్రమాణము.

భూమియందు సీతామహాలక్ష్మి ఉద్భవించినది. కుబేరుని యింట ధనలక్ష్మి యున్నది. అంబరం నుండి ఆదిలక్ష్మి సుదామునకు విభవమిచ్చినది. సముద్రం నుండి శ్రీ మహాలక్ష్మి అవతరించినది.

వైరాగ్యస్య (సమగ్రస్య) సామ్రాజ్యము, ధర్మసంపత్తి, కీర్తి సంపత్తి, ధనసంపత్తి మున్నగు సంపదలు కలిగినప్పటికి శ్రీకృష్ణుడు మహా వైరాగ్య సంపన్నుడు. శ్రీ కృష్ణ భగవానుని అనాసక్తిని గూర్చి, వైరాగ్యసంపత్తిని గూర్చి ఎంతని వ్రాయగలము? శ్రీకృష్ణోపదిష్టమైన గీతనే కొందరు సంపూర్ణంగా అది అనాసక్తి యోగమని పేర్కొన్నారు.

శ్రీభగవానుడు గీతలో అర్జునునికి చేసిన బోధలో

"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః

స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః" (గీత 6-1)

కర్మఫలాన్ని కోరకుండా కర్తవ్యతాబుద్ధితో భగవదారాధనరూపంగా యజ్ఞాది కర్మలను ఆచరించేవాడు కర్మయోగ నిష్ఠుడు, జ్ఞాన నిష్ఠుడు అవుతున్నాడు. అగ్నిహోత్రాన్ని, ఇష్టాపూర్తాలను త్యజించినంత మాత్రాన అతడు సన్న్యాసికాజాలడు.

"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన" నీకు కర్మచేయడానికే అధికారమున్నది కాని, కర్మఫలములందు అధికారమెన్నటికిని లేకుండుగాక.

"సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః" (గీత 18-2)

"సకల కర్మల ఫలాన్ని విడిచిపెట్టడమే త్యాగమని పండితులు చెప్పినారు.' 'శ్రీకృష్ణుడిట్టి ఉపదేశాలను చేయడమే కాకుండా తాను ఆచరించి అద్వితీయమైన ఆదర్శమూర్తియై నిలిచినాడు.

కర్మను ఆచరించకుండానే ఫలాన్ని కోరేవా రనేకులుంటారు. కాని, రాత్రింబగళ్లు అపారంగా పరిశ్రమించి ఫలాన్ని కోరని వాడు శ్రీకృష్ణభగవానుడొక్కడే. కంసుని వధించి అతని సింహాసనాన్ని శ్రీకృష్ణుడు ఆశింపలేదు. కంసుని తండ్రియగు ఉగ్రసేనుణ్ని ఆ గద్దె నధిష్ఠింపజేశాడు. జరాసంధ, నరకాసురులను వధించి, వారి కుమారులకే పట్టాభిషేకాలను జరిపించాడు. శ్రీకృష్ణుడు తన జీవితంలో ఎవరి రాజ్యాన్ని స్వాధీనం చేసుకొన్నవాడు కాదు. కావున ఆయనకు విత్తైషణ లేదు.

శ్రీకృష్ణుడు స్వప్రతిష్ఠకై పాటుపడినవాడు కాడు. ఆయనకు లోకైషణ లేదు. తన ప్రతిజ్ఞను వదలుకొని భీష్ముని ప్రతిజ్ఞ నెరవేరేటట్లు చేశాడు. ద్రౌపది శరీరంమీది చీర అయినాడు. అమానియు, మానదుడు, మాన్యుడు అని స్తుతింపబడినాడు. రాజసూయ యాగానికి విచ్చేసిన అభ్యాగతుల చరణాలను కడిగినాడు.

ఇక స్త్రీ సాంగత్యం గూర్చి చెప్పికొందమన్న, లోకంలో పురుషుడు స్త్రీకి దూరమై విషయవాంఛలేనివాడై ఉండటంలో విశేషంలేదు. వేలకొలది స్త్రీల మధ్యనుండి కూడా విషయ వాసనా రహితుడైనవాడు శ్రీకృష్ణుడు. అప్రాకృత దివ్యరూపుడు. అనాదిబ్రహ్మచారి.

సిషేవ ఆత్మన్యవరుద్ధ సౌరతః

సర్వాః శరత్కావ్యకథారసాశ్రయాః శ్రీమద్భా. 10-33-26

శ్రీకృష్ణుడు సత్యసంకల్పుడు, గోపికలతో జరిపిన మహారాసము ఆయన చిన్మయలీల, అది అప్రకటిత లీల. సర్వము తన అధీనమొనర్చుకొన్న, తనకు తాను బద్ధుడైనవాడై గోపికలతో క్రీడించాడు, పదహారువేల భార్యలున్నప్పటికి ఆయన అనాది బ్రహ్మచారియే. జితేంద్రియుడు, పరమోత్కృష్ట యోగిరాజు. సకల యోగాలకు ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడగు శ్రీకృష్ణ భగవానునికి

ప్రాకృతమైన తుచ్ఛ కామ వాసనలుండవని గ్రహింపవలయును. ఆయన నవనీత చౌర్యము "భక్త పూజాగ్రహణలీల", ఆయన చేసిన వస్త్ర చౌర్యము "ఆవరణ హరణ లీల", బ్రహ్మ మోహమును పోగొట్టుటకు ఆయన చేసినది "సర్వోదయ లీల" రసస్వరూపుడు, రసపరబ్రహ్మమునైన శ్రీకృష్ణభగవానుడు తన ప్రతిబింబరూపిణులు, పరమస్వీయలు అయిన గోపికలతో స్వభక్తచిత్త రంజనంగా జరిపిన ఆత్మ క్రీడయే "రాసలీల".

మోక్షస్య (సమగ్రస్య) శ్రీకృష్ణభగవానుని చరణ కమలాలే మోక్షానికి మూల స్థానము. అట్టి వానికి ప్రాకృతబంధాలుంటాయా ఏమిటి? తనను ఆశ్రయించిన వారిని ముక్తులను చేసే ముక్త పురుషుడాయన. కావున "మోక్షస్య సమగ్రస్య" అనే లక్షణం శ్రీకృష్ణ భగవానుని యందు సమన్వయమవుతున్నది. ఇట్టి షడ్గుణాలతో శోభిల్లువాడు కావున శ్రీకృష్ణుడు స్వయం భగవానుడు-పరిపూర్ణుడు. పూర్ణపురుషోత్తముడు.

అద్వయ తత్త్వము.

అష్టాంగయోగులు సర్వేశ్వరుణ్ని పరమాత్మ అనీ, ఉపనిషన్నిష్ఠులైన వేదాంతులు బ్రహ్మమనీ, జ్ఞానులు జ్ఞానమనీ, భక్తులు భగవానుడనీ వ్యవహరిస్తారు.

వదంతి తత్ తత్త్వవిదస్తత్త్వం యద్ జ్ఞాన మద్వయం
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే. శ్రీమద్భా. 1-2-11.

శ్రీకృష్ణుడే స్వయం భగవానుడు. శ్రీకృష్ణుడే పరమాత్మ, శ్రీకృష్ణుడే పరబ్రహ్మము. శ్రీకృష్ణుని ఆత్మ, అతని శరీరము వేరు వేరు కాదు. ఆయన సచ్చిదానంద రసమయుడు. ఆయనది పాంచభౌతికమైన దేహము కాదు. 'న తస్య ప్రాకృతామూర్తి ర్మేదో మజ్జాస్థిసంభవా" అనియు, 'యో వేత్తి భౌతికం దేహం కృష్ణస్య పరమాత్మనః, ముఖం తస్యావలో క్యాపి సచైలం స్నాన మాచరేత్' అనియు వరాహ పురాణం తెలుపుతున్నది.

శ్రీకృష్ణునిది అప్రాకృత మనుష్యత్వము. నరాకృతి స్వీకరించినవాడే కాని, నిజానికి ఆయన నరుడు కాడు. ప్రకృతికి సంబంధించిన గుణాలు కానీ,

తత్కార్యాలు కాని లేని వాడాయన. ప్రకృతికి సంబంధించిన కర్మలు, వాటి ఫలితాలు లేనివాడాయన. అవ్యక్తశక్తిగల బ్రహ్మమును నిర్గుణమంటారు. వ్యక్తశక్తిగల బ్రహ్మమును సగుణమంటారు. సగుణ బ్రహ్మములో ప్రాకృతికగుణం ఎంతమాత్రమూ ఉండదు. ఆయనిది "అనిర్దేశ్యవపువు", భూతమయమైనదికాదు. "అస్యాపి దేవవపుషే మదనుగ్రహస్య, స్వేచ్ఛామయస్య న తు భూతమయస్య కోఽపి" "స్వామీ! నీ శరీరము పాంచభౌతికమైనదని ఎవరనగలరు? నీ శరీరము అప్రాకృతశుద్ధచిన్మయము. భక్తుల లాలసాభిలాషలను తీర్చేటటువంటిది" అని బ్రహ్మ స్తుతించాడు. శ్రీకృష్ణునిది పాంచభౌతికమైన శరీరమని పలికే వానిని చూస్తేనే చాలు కలిగిన పాపాన్ని పోగొట్టుకోడానికి సచేల స్నానం చేసి పరిశుద్ధం కావాలనీ, శ్రీకృష్ణుని శరీరం భౌతికమైనదని పలికే వానిచేత శ్రౌతస్మార్త కర్మలు జరిపించుకోరాదని పురాణ శాస్త్రాలు చెబుతున్నాయి. "యో వేత్తి భౌతికం దేహం కృష్ణస్య పరమాత్మనః, స సర్వస్మాద్ బహిష్కార్యః శ్రౌతస్మార్త విధానతః" శ్రీకృష్ణునిది భౌతిక దేహం కాదని గీతావ్యాఖ్యాతలందరు కంఠోక్తిగా చెప్పినవారే.

పూర్ణానందః పూర్ణభుక్, పూర్ణకర్తా, పూర్ణజ్ఞానః, పూర్ణాభం
పూర్ణైశ్వర్యాద్ భగవాన్ వాసుదేవో విరుద్ధ శక్తిర్న చ దోషస్పర్శగీశః ॥

షడైశ్వర్యపూర్ణుడు వాసుదేవుడు అగు శ్రీకృష్ణభగవానుని యందు సంపూర్ణానందము, పూర్ణ భోక్తృత్వము, పూర్ణ కర్తృత్వము, పూర్ణ జ్ఞానము, పూర్ణ జ్యోతి, పూర్ణ శక్తి, పూర్ణైశ్వర్యము, విరుద్ధ శక్తిత్వము అదోషస్పర్శిత్వము కనిపిస్తాయి. 'బ్రహ్మ' శబ్దంలో 'భగవత్' శబ్దంలో ఉన్నట్లుగా వికాసం లేదు. భగవత్స్వరూపంలో అఖిలైశ్వర్యం ఉంది. పరబ్రహ్మము భగవంతుని అంగకాంతి మాత్రమే.

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే"

ఈ ప్రకారంగా పూర్ణపరమాత్ముడు, పూర్ణావతారుడు. శ్రీకృష్ణుడు జగద్గురువు. గు=అజ్ఞానాన్ని, రు=నాశనం చేసేవాడు గురువవుతాడు. శాస్త్రజ్ఞుడు, యోగేశ్వరుడు, సర్వజ్ఞుడు గురువై ఉండవలయును. ఇన్ని లక్షణాలు గల జగద్గురువు శ్రీకృష్ణుడు.

'కృష్ణం వందే జగద్గురుమ్'. ఆయన ఉపదేశాలు ధర్మాలు విశ్వజనీనమైనవి.

శ్రీకృష్ణ తత్త్వ వేత్త అయిన వాడే గురువు కాగలడని శ్రీ చైతన్య మహాప్రభువు చెప్పారు. ఈ పద్యంలో భక్తుడైన కవి ముమ్మారులు భగవంతుణ్ని శరణు వేడుకొన్నాడు. భగవంతుడు శరణాగత రక్షకుడు.

శ్రీమద్రామాయణ మొక దీర్ఘ శరణాగతి. శ్రీరాముడు శరణాగతులను రక్షిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. భగవద్గీతలోను శ్రీకృష్ణుడు తనను శరణు చొచ్చిన వారల సమస్త పాపాలను తుడిచి పెట్టి రక్షిస్తాను, శోకించవలదని అభయమిచ్చి శపథం చేశాడు.

"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"

నా ప్రాప్తికి అటంకాలై అనాదికాలంనుండి సంక్రమించిన పాపాలను, చేయగూడని కార్యాలను చేసినందువల్ల కలిగిన పాపాలను, చేయదగినవి చేయనందువల్ల కలిగిన పాపాలనన్నిటిని నేను పోగొడతాను. ఆ పాపాలను నీవై పోగొట్టుకోడానికి ఎన్నో జన్మలు ఎత్తవలసి ఉంటుంది. నన్ను శరణు చొచ్చినవాడవైతే ఒక్క క్షణంలో నీ పాపాలన్నీ తొలగుతాయి, ఉద్ధరింపబడతావు. ఇతర కర్మోపాయాలను పరిత్యజించి శరణాగతి అనే ఉపాయంతో నీ భారాన్ని నాయందే ఉంచి నిర్భయుడవై ఉండుము. నీ భారమంతయు నేను గ్రహింతును. విచారపడవలదు' అని శ్రీకృష్ణుని ఉపదేశము. ఇదియే గీతాసారము. చరమ శ్లోకము - పరమ మంత్రము.

**మగ మీనమవై జలనిధి**
**బగతుని సోమకుని జంపి పద్మభవునకున్**
**నిగమముల దెచ్చి యిచ్చితి**
**సుగుణాకర! మేలు దివ్యసుందర కృష్ణా! 37**

కృష్ణా! సుగుణ+ఆకర=సద్గుణములకు స్థానమైనవాడా! దివ్యసుందర= దివ్యమైన సౌందర్యముగలవాడా! నీవు, జలధిన్=సముద్రము నందు, మగ మీనమవై= మగచేపవై, పగతునిన్=వేదములను దొంగిలించిన శత్రువగు

సోమకాసురుని, చంపి, పద్మభవునకున్=బ్రహ్మదేవునకు, నిగమములన్=వేదములను తెచ్చియిచ్చితివి. మేలు=మంచి పని చేసితివని ప్రశంస.

తా॥ కృష్ణా! వేదములను అపహరించి సముద్రములో దాగిన సోమకాసురుని నీవు మత్స్యావతారుడవై చంపి, ఆ వేదములను తెచ్చి బ్రహ్మదేవునికి ఇచ్చితివి.

ఈ శతక కర్త ఇటనుండి దశావతారాలను వర్ణిస్తున్నాడు. జగదుత్పత్తి, స్థితి, ప్రళయాలకు తాను అహేతువు, హేతువునై దయామయుడైన భగవంతుడు సచ్చిదానందుడై అనేక లీలలను జరుపుతుంటాడు. ఆ భగవంతుని సగుణ, సాకార చిన్మయ రూపాన్ని ధ్యాన, ధారణ, స్మరణ, నామజప, లీలాచింతనలతో మానవహృదయం పరిశుద్ధమవుతుంది. జగత్తునందు ధర్మసంస్థాపనకు, జ్ఞానసంరక్షణకు, భక్తపరిత్రాణానికి, ఆతతాయులైనవారిని శిక్షించడానికి, ప్రేమభక్తుల ఉత్కంఠను తీర్చడానికి భగవానుడు పదే పదే అవతరిస్తుంటాడు. భగవానుని అవతార రూపాలు దివ్యములు, సచ్చిదానందమయములు, పరమ మంగళమయములు. సత్వమూర్తియగు భగవంతుని అవతారాలు అసంఖ్యేయాలు. "అవతారా హ్యసంఖ్యేయా హరేః సత్వనిధే ర్ద్విజాః". 1. మత్స్యావతారము, 2. కూర్మావతారము, 3. వరాహావతారము 4. శ్రీనృసింహావతారము 5. వామనావతారము. 6. పరశురామావతారము, 7. శ్రీరామావతారము. 8. బలరామావతారము. 9. బుద్ధావతారము. 10. కల్కి అవతారము. ఈ అవతారాలను అవతరింపజేసినవాడు శ్రీకృష్ణుడు. అతడే శ్రీమన్నారాయణుడు. ఆయన అవతారి అవుతాడు కాని, అవతారుడు కాదు. ద్వాపరాంతాన సంపూర్ణ రూపంతో స్వయంగా భగవానుడు శ్రీ కృష్ణుడై భూతలాన అవతరించాడు. శ్రీ శంకరాచార్యులవారు తమ "ప్రబోధసుధాకరం"లో ఇలా అన్నారు. "యద్యపి సాకారోయం తథైకదేశీ విభాతి యదునాథః సర్వగతః సర్వాత్మా తథాప్యయం సచ్చిదానందః" "శ్రీకృష్ణుడు ఒక ప్రాంతానికి చెందినవాడు కాదు, ఆయన సర్వగతుడు, సర్వాత్ముడు, సమస్త అవతారాలను ప్రవర్తింపజేసిన

సాక్షాత్పరబ్రహ్మము" అని.

వేదా నుద్ధరతే జగన్తి వహతే భూగోళ ముద్బిభ్రతే
దైత్యం దారయతే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తుభ్యం నమః

" మత్స్యావతారమెత్తి వేదాలను ఉద్ధరిస్తాడు. కూర్మావతారమెత్తి మందరం మొసి అమృతోత్పత్తి కారణం కావటం ద్వారా లోకాలను మొస్తాడు. వరాహవతారమెత్తి భూగోళాన్ని రసాతలంనుంచి నీటిపైకి తెచ్చి మొస్తాడు. హిరణ్యకశిపుని చీలుస్తాడు నరసింహావతారమెత్తి. వామనావతారమెత్తి బలిని మోసగిస్తాడు. పరుశురామావతార మెత్తి క్షత్రియులను నశింపజేస్తాడు. శ్రీరామావతారమెత్తి రావణుని జయిస్తాడు. బలరామావతారమెత్తి హాలాయుధాన్ని వినియోగిస్తాడు. బౌద్ధావతారమెత్తి దయను విస్తరింపజేస్తాడు. కల్కి అవతారమెత్తి మ్లేచ్ఛులను మూర్ఛిల్లజేస్తాడు. ఇలా దశావతాలను ఎత్తే శ్రీకృష్ణునికి నీకు నమస్కారం" అని, దశావతారాలకు కారణమైన భగవానుడు శ్రీకృష్ణుడని జయదేవకవి గీతగోవిందంలో స్తుతించాడు. శ్రీకృష్ణదేవరాయలు, తెనాలిరామకృష్ణకవి తాము రచించిన ఆముక్త మాల్యద లోను, పాండురంగ మాహాత్మ్యంలోను దశావతార స్తోత్రం రచిస్తూ, శ్రీకృష్ణుని అవతారిగా చూపినారే కాని మత్స్యాది అవతారాలలో చేర్చలేదు. ఆ కవులు భగవత్తత్వం క్షుణ్ణంగా ఎరిగిన వారవడంచేత 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అని, శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడే అని గ్రహించారు. మహాభారతం శాంతిపర్వంలో దశావతారాలు ఇట్లు పేర్కొనబడ్డాయి.

"మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కీతి తే దశ"

ఈ పదింటిలో శ్రీకృష్ణుని చేర్చకపోవడం గమనించదగిన విషయం.

**అందరు సురలును దనుజులు**
**పొందుగ క్షీరాబ్ధిఁదరవ పొలుపున నీ వా**
**నందముగ కూర్మరూపున**
**మందరగిరి యెత్తితౌర మాధవ! కృష్ణా! 38**

కృష్ణా! మాధవ = లక్ష్మీనాథా! సురలును=దేవతలును, దనుజులు= రాక్షసులు, అందరు, పొందుగ=చక్కగా, క్షీరాబ్ధిన్=పాలసముద్రమును, తరవన్=కవ్వముతో చిలుకగా, పొలుపునన్=సుందరముగా, నీవు, ఆనందముగా, కూర్మరూపున= తాబేలు రూపమున, మందరగిరిన్= కవ్వముగా, ఏర్పడిన మందరమను పర్వతమును, ఎత్తితివి=ఎత్తినాడవు, ఔర=ఆశ్చర్యము.

దేవ దానవులు కలిసి క్షీరసముద్రమును చిలుకునపుడు నీవు మహా కూర్మరూపముతో వెలసి కవ్వముగా నున్న మందర పర్వతమును పైకెత్తినవాడవు, అది మహాశ్చర్యము.

అహంకారంతో, సాధుసత్పురుషులను అవమానించడం సర్వానర్థాలకు మూలము. ఐరావత గజమెక్కి వస్తున్న దేవేంద్రుణ్ని చూచి మహర్షి దుర్వాసుడు ప్రసన్నుడై తన కంఠ మందలి పుష్పమాలను తీసి అతని కిచ్చాడు. ఇంద్రుడా మాలను ఐరావతగజం మీద పడవేశాడు. దాన్ని ఐరావతం తొండంతో తీసి క్రింద పడవేసి త్రొక్కుకొంటూ పోయింది. అది చూచి తన ప్రసాదానికి అవమానం కలిగించినందుకు దుర్వాసుడు కోపించి "నీ సంపద నష్టమగుగాక" అని శపించాడు. ఇంద్రుడు శ్రీ హీనుడయ్యాడు. రాక్షసరాజు బలి శుక్రాచార్యులవారికి శిష్యుడు, సేవకుడు. దేవదానవులకు యుద్ధం జరిగింది. దేవతలు ఓడిపోయారు. స్వర్గం అసురులకు క్రీడోద్యానమయింది. బలిచక్రవర్తి ముల్లోకాలను పాలించాడు. దేవతలు బ్రహ్మదేవుని శరణుచొచ్చారు. వారందరూ శేషశాయియైన శ్రీమన్నారాయణుణ్ని ప్రార్థించారు.

"మీరు రాక్షసులతో సంధి చేసుకొనండి. సమస్త ఓషధులను క్షీరసాగరంలో వేసి దాన్ని మథించండి. అందుకు మందరాచలాన్ని కవ్వంగా చేసుకొనండి.

వాసుకిని కవ్వపు త్రాడుగా చేసుకోండి. మొదట సముద్రంలో మహా విషం ఉద్భవిస్తుంది. భయపడవద్దు. సముద్రమథనంలో పుట్టిన వస్తువులకై లోభంతో కలహించకండి. ఆ సముద్రంలో చివరకు జరామృత్యుహరమైన అమృతం ఉద్భవిస్తుంది. అప్పుడు నేనక్కడికి వస్తాను. మీకు ఉపకారం చేస్తా''నని శ్రీనారాయణుడు చెప్పాడు.

ఇంద్రుడు దైత్యరాజు దగ్గరికి వెళ్లాడు. ఇద్దరు బంధువాత్సల్యాన్ని స్మరించారు. అమృత లోభం వల్ల ఇరువురికి సంధి జరిగింది. దేవదానవులు కలిసి మందరాచలాన్ని పెల్లగించారు. కాని సముద్రం దగ్గరికి దానిని తేజాలక పోయారు. దేవతలు విష్ణువును స్మరించారు. ఆది శేషుడు వచ్చి ఆ పర్వతాన్ని గరుత్మంతుని పై పెట్టాడు. దానిని గరుడుడు సముద్రంలో జారవిడిచాడు. దాని క్రిందుగా కూర్మరూపంతో శ్రీమన్నారాయణుడు చేరి మందర పర్వతాన్ని పైకెత్తాడు. దేవదానవులు వాసుకిని కవ్వపు త్రాడుగా చేసుకొని సముద్రాన్ని మథించారు.

**ఆది వరాహుడవయి నీ**
**వా దనుజు హిరణ్యనేత్రు హతుజేసి తగన్**
**మోదమున సురలు వొగడగ**
**మేదిని వడిగొడుగునెత్తి మెఱసితి కృష్ణా! 39**

కృష్ణా! నీవు, ఆది వరాహుడవయి=మొదటి వరాహమూర్తివై, ఆ దనుజున్= ఆ రాక్షసుడగు, హిరణ్యనేత్రున్=హిరణ్యాక్షుడను వానిని, హతున్=చచ్చినవానినిగా .జేసి, అనగా వధించి, తగన్= తగునట్లు, మేదినిన్=భూమిని, వడిన్= వేగముగా, గొడుగు నెత్తి=గొడుగు వలె పైకెత్తి, మెఱసితివి=ప్రకాశించితివి.

సృష్టిలో ఒక కాలం వరాహకల్పము. అప్పటి వృత్తాంతమిది. ఆ కల్పంలో భూమి రసాతలానికి, క్రుంగి పోయింది. భూమండలానికి ప్రభువైన శ్రీవిష్ణువు వరాహరూపంతో అవతరించి దానిని ఉద్ధరించాడు.

హిరణ్యాక్షుడను రాక్షసుడు లోకోపద్రవకరంగా భూమినిచుట్టగా చుట్టి సముద్రంలో పడవేశాడనీ, శ్రీ విష్ణువు వరాహ రూపంతో అవతరించి ఆ రాక్షసుని

సంహరించి భూమిని పైకెత్తినాడనీ పురాణకథ.

హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు పూర్వజన్మలో వైకుంఠమందిర ద్వార పాలకులైన జయ విజయులు. సనక సనందనాదులు వీరి అహంకారాన్ని సహింపక రాక్షసులై జన్మింపుడని శపించారు. ఆ జయ విజయులే హిరణ్యాక్ష హిరణ్య కశిపులుగా ఒక కల్పంలో, రావణ కుంభకర్ణులుగా త్రేతాయుగంలోను, శిశుపాల దంతవక్త్రులుగా ద్వాపరంలోను జన్మించారు. వీరిని ఉద్ధరించడానికి భగవానుడు ఆదివరాహంగాను, శ్రీనృసింహుడుగాను, శ్రీరాముడు గాను, శ్రీ కృష్ణుడుగాను అవతరించాడు.

వరాహావతార ప్రసంగం, తైత్తిరీయ సంహితలోను, తైత్తిరీయ బ్రాహ్మణం లోను, శతపథ బ్రాహ్మణంలోను వేరు వేరుగా ఉన్నది. వైదిక గ్రంథాలలో ఉన్న విషయమే పురాణాలలో చిత్రితమైనది. శ్రీమద్భాగవతంలో ఆదివరాహానికి బదులుగా యజ్ఞ వరాహమని పేర్కొనబడింది. వరాహావతారమే మొదటి అవతారమని భాగవత-ద్వితీయ స్కంధ సప్తమాధ్యాయంలో ఉన్నది. "ఉద్ధృ తాసి వరాహేణ కృష్ణేన శతబాహునా" (తైత్తిరీయ ఆరణ్యకము) వరాహేణ పృథివీసంవాదినా (అథర్వవేదము).

**కెరలి యఱచేత కంబము**
**నరుదుగ వేయుటను వెడలి యసురేశ్వరునిన్**
**ఉదరము జీరి వధించితి**
**నరహరి రూపావతార! నగధర! కృష్ణా! 40**

కృష్ణా! గిరిధరా! నరహరి రూపావతార= మనుష్యుడు సింహమును అయిన ఆకారముతో అవతరించిన ఓ కృష్ణా! కెరలి=కోపించి, అఱచేతను, కంబమున్= స్తంభమును అరుదుగ, వేయుటను=కొట్టుట చేతను, వెడలి= అవతరించి (ఆస్తంభమునుండి బయలువెడలి) అసుర+ఈశ్వరున్=రాక్షస ప్రభువగు హిరణ్యకశిపుని, ఉదరమున్=పొట్టను, చీరి=చీల్చి, వధించితివి= చంపితివి.

కృష్ణా ! విష్ణుభక్తుడు, ప్రప్రథమభాగవతుడు తనకుమారుడు అయిన ప్రహ్లాదుణ్ని "హిరణ్యకశిపుడు కోపించి, విష్ణువు సర్వాంతర్యామి అన్నావు, ఈ రాతి కంబంలో ఆతడున్నాడా?" అని ఆస్తంభాన్ని ఒక్క చరపు చరిచాడు. సర్వాంతర్యామియైన శ్రీకృష్ణుడు నరసింహాకారాన్ని ధరించి, ఆ స్తంభంనుండి వెడలి హిరణ్యకశిపుని వక్షాన్ని చీల్చి చంపాడు. తన భక్తుని మాటను నిలబెట్టాడు.

సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః శ్రీమద్భా. 7-8-18

తన భృత్యులైన ప్రహ్లాదుని మాటను, బ్రహ్మవరాలిచ్చిన వైనాన్ని, సత్యం చేయడానికే భగవానుడు శ్రీనృసింహస్వామిగా సర్వాంతర్యామిగా ఆవిర్భవించాడు. భగవంతుని క్రియా శక్తి ఈ అవతారములో ప్రకటితమయింది.

శ్రీనృసింహావతార ప్రసంగం తైత్తిరీయ ఆరణ్యంలో నృసింహ గాయత్రీ రూపంగా చెప్పబడింది.

వజ్రనఖాయ విద్మహే తీక్ష్ణదంష్ట్రాయ ధీమహి తన్నో నారసింహః ప్రచోదయాత్.

ఈ గాయత్రీ మంత్రంలో శ్రీనారసింహావతారానికి చెందిన "వజ్రనఖ" "తీక్ష్ణదంష్ట్ర" పదాలు ప్రయోగింపబడి శ్రీనారసింహుని భయంకరాకృతిని స్పష్టం చేస్తున్నాయి. హిరణ్యకశిపుని చీల్చి చంపి, ప్రహ్లాదుని ఆశీర్వదించే శ్రీనృసింహ భగవానుని చరిత్ర చిత్రణము పెక్కు పురాణాలలో ఉన్నప్పటికి శ్రీమద్భాగవతంలో విశేషంగా ఉన్నది. శ్రీమదాంధ్ర భాగవతమునందు పోతనగారు ఈ ఘట్టాన్ని అత్యంత మనోజ్ఞంగా రచించి తెలుగుసాహిత్యానికి పవిత్రతను చేకూర్చారు.

**వడుగడవై మూడడుగుల**
**నడిగితివౌ భళిర భళిర! అఖిలజగంబుల్**
**తొడిగితివి నీదు మేనున**
**కడు చిత్రము నీ చరిత్ర ఘనమవు కృష్ణా! 40**

కృష్ణా! వడుగడవై=బ్రహ్మచారివై, మూడు+అడుగుల=మూడుపాదములను

మోపునంత స్థలమును, అడిగితివి, నీదు మేనునన్=నీ శరీరమునందు, అఖిల జగంబుల్ = సకల జగములు, తొడిగితివి=ఆక్రమించితివి, ఔను!, భళిర భళిర=ఆశ్చర్యపడి మెచ్చుకోదగినది, నీ చరిత్ర=నీ నడవడిన్, కడు చిత్రము=చాల ఆశ్చర్యము, ఘనము+అవున్= గొప్పదియు అగును.

కృష్ణా! నీవు వామన బ్రహ్మచారివై బలిచక్రవర్తిని మూడడుగుల నేల ఇమ్మని యాచించితివి. ఆ రాజు ఇచ్చినంతనే రెండడుగులతోనే లోకము లన్నిటిని ఆక్రమించితివి. నీ చరిత్ర కడు చిత్రము, అత్యద్భుతము.

శ్రీవిష్ణువు వామనావతారుడైన వృత్తాంతం ఋగ్వేదమందలి విష్ణుసూక్తాలలోని అనేక మంత్రాలలో అధికంగా వర్ణింపబడినది. వామనునికి ఉరుగాయుడు, ఉరుక్రముడు అనే విశేషణాలు వేదాలలోప్రయోగింప బడనవి.

"ఇదం విష్ణుర్విచక్రమే త్రేథా నిదధే పదమ్ సమూఢమస్య పాంసురే'
-ఋగ్వేదము

ఈ మంత్ర తాత్పర్యమేమనగా, "విష్ణువు ఈ జగత్తును మూడడుగులతో ఆక్రమించుకొన్నప్పుడు, ధూళి ధూసరమైన ఆయన పాదమందు భూమ్యాది సమస్తలోకాలు అంతర్హితాలైనవి" అని. విష్ణువును వామనునిగా పేర్కొనడం శతపథ బ్రాహ్మణంలో కనిపిస్తుంది. "వామనో హి విష్ణురాస". ఆ విష్ణువే ఆ ఉరుక్రముడే, ఉరుగాయుడే, గోపాలకృష్ణుడని ఋగ్వేదం చెబుతున్నది.

"త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపా
అదాభ్యః అతో ధర్మాణి ధారయన్ " -ఋగ్వేదము

ఈ విష్ణువు "గోపాః" అనే విశేషణంతో సంబోధింపబడినాడు. దీనిని బట్టి ఉరుక్రముడు, వామనుడు గోపవేషధారి అయిన విష్ణువు ఒక్కరే అని ప్రతిపాదించే ఈ మంత్రాన్ని ఆధ్యాత్మిక దృష్టితో చూచేవారికి శ్రీకృష్ణ భగవత్తత్వము బోధపడగలదు. మహాకవి కాళిదాసు మేఘదూతలో "గోపవేషస్య విష్ణోః" అని ప్రయోగించడం గమనింపదగిన విషయము. ఋగ్వేద మంత్రాలలోనే మరొకటి విష్ణుదేవుని సర్వోన్నత పదమగు గోలోకాన్ని వర్ణిస్తున్నది.

తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై
యత్ర గావో భూరిశృంగా అయాసః
అత్రాహ తదురుగాయస్య వృష్ణః
పరమంపద మవభాతి భూరి -ఋుగ్వేదము

మానవులు ఇంద్రలోకానికి, విష్ణులోకానికి చేరగోరతారు. అక్కడ పెక్కు కొమ్ములున్న చంచలాలైన గోవులు నివసిస్తుంటాయి. గోవులు సంచరించడం చేత అది గోలోకమయింది.

సూర్యదేవతా స్వరూపుడు శ్రీ విష్ణువు. సంధ్యావందన మంత్రము "సవితృమండల మధ్యవర్తీ" అని విష్ణువును ఉద్దేశించిందే. "గోః" అనగా సూర్యకిరణాలని అర్థము. సూర్యునికి సూర్యకిరణాలకును అభేద్యమైన సంబంధమున్నది. "గోకంఠ బంధన విమోచన మాదిదేవం" గోవుల కంఠబంధాలను విడిపించేవాడు సూర్యుడని అర్థం చెబుతారు కొందరు.

శ్రీమద్భాగవత అష్టమస్కంధంలో వామనావతార ప్రసంగమున్నది. బలిచక్రవర్తి స్వర్గము నాక్రమించుకొని దేవతలను పరాజితులను చేశాడు. దేవతలు విష్ణుదేవుని ప్రార్థించారు. దేవమాతయగు అదితి "కేశవతోషణ" మనే వ్రతం చేసింది. తత్ఫలితంగా విష్ణువు (ఉపేంద్రుడై) వామనుడై ఆమె గర్భాన అవతరించాడు. వామనుడు బలిచక్రవర్తి యజ్ఞశాలకు వెళ్లి మూడడుగుల నేల నిమ్మని చెయ్యిచాపి యాచించాడు.

శుక్రాచార్యుడు కనిపెట్టి ఈ బ్రహ్మచారి అడిగిన మూడడుగుల నేల ఇయ్యవద్దని బలికి చెప్పాడు. మహాదాత యగు బలిచక్రవర్తి గుర్వాజ్ఞను తిరస్కరించి వామను డడిగిన మూడడుగుల భూమిని సమంత్రకంగా దానమిచ్చాడు. వెంటనే వామనుడు త్రివిక్రముడై రెండడుగులతో భూలోక, స్వర్గ లోకాలను ఆక్రమించాడు. మూడవ అడుగు పెట్టడానికి చోటు లేదయ్యెను. అప్పుడు బలిచక్రవర్తి తన శిరస్సు వంచి దానిపై మూడవ అడుగు పెట్టుమని కోరాడు. త్రివిక్రముడైన వామనుడు తన మూడవ అడుగు నిమిత్తం బలి

శిరసుపై పాదముంచి అతనిని పాతాళానికి త్రొక్కాడు.

**ఇరువదొకమారు నృపతుల**
**శిరములు ఖండించితౌర! చేగొడ్డంటన్**
**ధర కశ్యపునకు నిచ్చియు**
**బరగవె జమదగ్నిరామభద్రుడ కృష్ణా! 42**

కృష్ణా! జమదగ్ని రామ భద్రుడ =జమదగ్ని కుమారుడవగురామభద్రా, పరశురామా! ఇరువది యొకమారు, నృపతుల = రాజుల యొక్క, శిరములు=తలలను, చేగొడ్డంటన్=చేతనున్న గండ్రగొడ్డలిచే, ఖండించితి=తెగ నరకితివి, ధరన్= భూమిని, కశ్యపునకున్=కశ్యపుడను ప్రజాపతికి, ఇచ్చి=దానమిచ్చి, పరగవె=ప్రసిద్ధి చెందితివి కదా!

కృష్ణా! నీవు పరశురాముడై అవతరించి, ఇరువదియొకమారు రాజుల నందరిని హతమార్చితివి. ఆ భూమి నంతటిని కశ్యపునకు దానమిచ్చి ప్రసిద్ధుడవైతివి.

భూమికి 'కాశ్యపి' అనునది పర్యాయ పదము. పరశురాముడు భూమినంతటిని కశ్యపమునికి దానమిచ్చుటచే భూమికి 'కాశ్యపి' అను నామమేర్పడింది.

పరశురాముని చరితలో కార్తవీర్యుని వధ, ఇరువది యొకమారులు ఉద్ధతులైన రాజుల సంహారము మహత్తరమైన ఘటనలు. మహాభారతం లోను, పురాణాలలోను పరశురాముని చరిత్ర మిక్కుటంగా వర్ణితమై ఉన్నది. దుర్దాంతులు, దురభిమానులు అయిన శాసకులను అణచి వేసి సాధువులను, బ్రాహ్మణులను సంరక్షణ చేయడానికి భగవానుడు పరశురాముడుగా అవతరించెననుట స్పష్టము.

పరశురామావతారము త్రేతాయుగము నందే జరిగినది. శ్రీ రామావతారకాలము కూడా త్రేతాయుగమే. దుష్టులైన శాసకులను వధించి శిష్టుడు, పరమ ధార్మికుడు నైన శాసకునిగా శ్రీరామచంద్రుని లోకానికి

చూపింపవలయునన్నదే భగవంతుని సంకల్పమై ఉంటుంది. పరశురామునిది ఆవేశావతారము.

**దశకంఠుని బరిమార్చియు**
**కుశలముతో సీత దెచ్చికొనియు నయోధ్యన్**
**విశదముగ కీర్తి నేలితి**
**దశరథరామావతార ధన్యుడ! కృష్ణా! 43**

కృష్ణా! దశరథ రామావతార= దశరథునకు జన్మించి శ్రీరాముడని ప్రఖ్యాతి నొందినవాడా! ధన్యుడ = చరితార్థత నొందిన వాడా! దశకంఠుని = పదితలలు గల రావణాసురుని, పరిమార్చియు = వధించియు, కుశలముతో= క్షేమముగా; సీతన్= సీతాదేవిని, తెచ్చికొనియు, అయోధ్యన్= అయోధ్యా పట్టణమును, విశదముగ= లోకములకన్నిటికి తెలియునట్లుగా, కీర్తిన్= కీర్తితో, ఏలితివి= పరిపాలించితివి. నీ పాలన ముల్లోకములందు రామరాజ్యముగా ప్రఖ్యాతమైనది.

ఋగ్వేదంలోను, తైత్తిరీయ బ్రాహ్మణంలోను, దశరథ, విదేహరాజగు జనక, సీతాదేవి, శ్రీరాముల ప్రసక్తి యున్నది. శ్రీరామ కృష్ణాద్యవతారాలను గూర్చి వైదిక వాఙ్మయం చెప్పక పోయినచో దానికి విలువేమున్నది? వేదవాఙ్మయంలో పలుచోట్ల ప్రస్తావించబడిన శ్రీరామ కథ ఆదికవి యగు వాల్మీకిమహర్షి కృతమైన శ్రీమద్రామాయణమై లోక కళ్యాణమొనరిస్తున్నది. వ్యాసభగవానుడే కాక, ఎందరో సంస్కృత కవులు శ్రీరాముని గుణగానము చేసి ధన్యులయ్యారు. రామచరిత శతకోటి ప్రవిస్తరమై సకల భాషలలోను వెలసింది.

శ్రీరాముడు మర్యాదా పురుషోత్తముడు, మూర్తిమంతమైన ధర్మస్వరూపుడు. భారతీయ సంస్కృతి సంపూర్ణంగా శ్రీరాముని చరితయందు సుప్రతిష్ఠితమై ఉన్నది. భారత దేశంలో ఆదర్శ మూర్తి అయిన శ్రీరాముడు నేడు విశ్వమానవులకు కీర్తనీయుడై ఉపాసనీయుడై సమస్త మానవ సంస్కృతికి ఆదర్శమూర్తి అయినాడు.

శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్ముడు. స్వయం భగవానుడు. "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" (శ్రీమద్భాగవతము). శ్రీకృష్ణుడు అవతారాలను అవతరింప

జేసినవాడే కాని, అవతారుడు కాదు. అనగా గోలోకమందు తానెట్లుండెనో, ఎన్ని శక్తులతో నుండెనో, ఎందరితో నుండెనో అట్లే గోకులంలోనికి చేరిన పరబ్రహ్మము, పరమాత్ముడు, భగవానుడు శ్రీకృష్ణుడు. కావున దశావతారాలలో ఈకవి శ్రీకృష్ణుని చేర్చియుండలేదు. పెక్కు పురాణములు బలరాముని అవతార పురుషునిగా పేర్కొన్నవే కాని, శ్రీకృష్ణుని అవతారపురుషునిగా చెప్పలేదు. ఈ సత్యాన్ని గుర్తించియే ఈ శతకకర్త దశావతారస్తుతిలో శ్రీకృష్ణుని చేర్చలేదని గ్రహింపవలయును.

సాక్షాత్ పరబ్రహ్మము శ్రీకృష్ణభగవానుడుగా ఆవిర్భవించడానికి ముందే ఆ పరబ్రహ్మము యొక్క జ్ఞానధర్మముగా వేదవ్యాసు డవతరించెను. వేదవ్యాసుని యందు భగవద్ జ్ఞాన మవతరించినది. కావున ఆయనయు అవతార పురుషుడే. వేదవిభాగము, మహాభారత నిర్మాణము, పురాణ రచన ఈఅవతారం యొక్క జ్ఞానకార్యానికి సంబంధించినవి. నందుని యింట శ్రీకృష్ణ భగవానుడు ఆవిర్భవించినది మొదలు, కృష్ణ చరిత్రము, లీలలు, స్వరూప వర్ణనం చేసి, ఆ భగవానుడు తిరోధానం చెందినను, ఆయన నామావళి ద్వారా జీవులను ఉద్ధరింపజేయడానికి భగవానుడు వ్యాసునిలో విశేషంగా ఆవేశించినాడు. కనుక వ్యాసునిది ఆవేశావతారమవుతుంది.

వరాహ, శ్రీనృసింహ, దత్త, పృథుప్రభృతి అవతారాలు కొన్ని స్వరూపావతారాలు, మరికొన్ని ధర్మావతారాలు, ఇంకకొన్ని ఆవేశావతారాలు మొత్తం అవతారములు ఇరువది నాలుగుగా ప్రఖ్యాతమైనవి. ఈ అవతారాలలో పురుషోత్తముడు అంతర్యామిగా ఉన్నాడు. చక్రవర్తియగు మహాప్రభువు తన దేశంలో పర్యటించడానికి బయలుదేరినప్పుడు ఆయాచోట్లలో నెలకొల్పిన తన విడిది గృహాలలో నివసిస్తాడు. ఆత్మీయులగువారి భవనాలలోను విడిది దిగుతాడు. ప్రజలు ఆ గృహాలను రాజగృహాలంటారు. ఆ ప్రభువు ఆ గృహాలనుండి వెడలి పోయినప్పటికి వాటికి రాజగృహాలను పేరే స్థిరపడుతుంది. అట్లే తక్కిన అవతారాలన్నియు.

స్వయంవ్యాపకుడైన పురుషోత్తముడు సర్వోద్ధారార్థము, విశేష లీలాకరణార్థము, సత్వాది పదార్థాల మీద ఆధారపడకుండగా, సమస్త కల్పానుసారంగా స్వరూప రూపగుణవైభవాలతో సర్వలోక సంరక్షణార్థం ఆవిర్భవ మొందినవాడు శ్రీకృష్ణభగవానుడు. సర్వశక్తి సహితుడైన పురుషోత్తముని ఆవిర్భావమే శ్రీకృష్ణావతారము. ఆవిర్భావమనగా పుట్టుక కాదు; అంతర్ధానమనగా మరణంకాదు. అవి రెండును పురుషోత్తముని లీలలో ఒక భాగమే.

శ్రీ కృష్ణుడు సాక్షాత్ పరబ్రహ్మమని చెప్పుటకు కారణాలివి. ఆ కృష్ణుని వ్యాపకత్వము, పురుషోత్తమత్వము, సర్వకర్తృత్వము, అప్రమేయానంద రూపత్వము, అప్రాకృతత్వము, సర్వశక్తి విశిష్టత్వము, సర్వోద్ధార ప్రయత్నత్వము, పరిపూర్ణ కళ్యాణ గుణనిత్యత్వము, మాయాసహిత ప్రాకట్యాదులు ముఖ్యములు.

ప్రత్యక్ష, అనుమాన, శబ్దములని ప్రమాణాలు మూడున్నవి. బ్రహ్మవివేచనకు లేదా శ్రీకృష్ణతత్వాన్ని నిర్వచించడానికి సర్వోత్తమమైనది శబ్ద ప్రమాణము. ప్రత్యక్ష అనుమానాలను ఉపజీవింపజేసేది శబ్ద ప్రమాణమే. వేదాలు శబ్ద ప్రమాణాలే. "స ఏవాధస్తాత్, స ఉపరిష్టాత్, సపశ్చాత్, స పురస్తాత్, స దక్షిణతః, స ఉత్తరతః, స ఏవేదం సర్వం" "అతడే క్రింద ఉన్నాడు, అతడే పైన ఉన్నాడు, అతడే వెనుక ఉన్నాడు, అతడే ముందున్నాడు, అతడే కుడివైపున ఉన్నాడు, అతడే ఎడమవైపున ఉన్నాడు, అతడే సర్వమూ" అను శ్రుతులు పరబ్రహ్మము యొక్క సర్వవ్యాపకత్వాన్ని చెబుతున్నవి. శ్రీకృష్ణుడు సర్వవ్యాపకుడు కావున ఆయనయే పరబ్రహ్మమని సిద్ధమవుతున్నది. ఆయన వ్యాప్తి మానవబుద్ధికి అతీతమైనది. వాసుదేవుడు, విష్ణువనగా అదే అర్థము. శ్రీగీతా భాగవతాలు శ్రీకృష్ణస్వరూపాన్ని నిరూపణ చేసే గ్రంథాలు. ఆస్తిక లోకానికి పరమమాననీయాలు. ఈ రెండు గ్రంథాలు శ్రీకృష్ణుని సర్వవ్యాపకత్వాన్ని విశదీకరిస్తున్నవి.

"మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"

"మయా తతమిదం సర్వం "

"సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ, "

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః;
"విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్; "
"తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవస్తదా",
"ద్యావా పృథివ్యోరిదమంతరం హి"
"వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః"
"సర్వం సమాప్నోషి తతో ఽసి సర్వః" (గీత)

ఇత్యాదులు చాలును. సర్వోపనిషత్తుల సారం భగవద్గీత. కావున కొన్ని దృష్టాంతాలను చూపాను. నిగమకల్పతరుగళిత పరిపక్వఫలమని ప్రసిద్ధిగాంచిన శ్రీమద్భాగవతంలో ఎక్కడ చూచినప్పటికి శ్రీకృష్ణుడు పరబ్రహ్మమని స్పష్టమవుతుంది. గ్రంథవిస్తర భీతిచే ఎన్నో ఉదాహరణాలను విడువలసి వచ్చింది.

య ద్విశ్రుతిః శ్రుతినుతేదమలం పునాతి
పాదావనేజనపయశ్చ వచశ్చ శాస్త్రం
భూః కాలభర్జిత భగాపి యదంఘ్రిపద్మ
స్పర్శోత్థశక్తి రభివర్షతి నో ఽఖిలార్థాన్ శ్రీమద్భా. 10-82-30

వేదాలు మహాదరంతో శ్రీకృష్ణుని కీర్తిని గానమొనర్చినవి. శ్రీకృష్ణుని చరణ సేచన జలము గంగాజలమైనది. ఆయన వాక్కు శాస్త్రమైనది. ఆయన కీర్తి జగత్తును పవిత్రమొనర్చినది. ఒక సమయంలో పృథ్వి తన సౌభాగ్యమంతటిని కోల్పోయి ఆ శ్రీకృష్ణుని చరణ కమల స్పర్శచే మరల సకల శక్తులు ఆ భూమియందు సంచారం చేయసాగినవి. మన సమస్త కాంక్షలను, మనోరథాలను పండిస్తున్నది.

వైష్ణవులు శ్రీకృష్ణుణ్ని సర్వావతారాలకు మూలమైన సర్వేశ్వరునిగా భావిస్తారు. అందుచేతనే శ్రీకృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదలోను, జయదేవుడు గీతగోవిందంలోను దశావతార వర్ణనలో శ్రీకృష్ణుని చేర్చలేదు.

సంస్కృతంలో మహాప్రసిద్ధి చెందిన నిఘంటువు అమరకోశము. అమరుడను బౌద్ధ పండితునిచే గ్రథితమైనందున దానికి అమరకోశమని నామ.

మేర్పడింది. అతడు విష్ణునామాలను చెబుతూ అందు శ్రీకృష్ణ నామాన్ని చేర్చియున్నాడు. "విష్ణు ర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్ఠరశ్రవాః" అని. విష్ణువే గోపవేషమున గోకులములో ప్రవేశించెనన్నది సర్వవిదితము. "గోపవేషస్య విష్ణోః" అని కాళిదాసు తన మేఘదూతలో పేర్కొన్నాడు.

**ఘనులగు ధేనుక ముష్టిక**
**దనుజుల చెండాడి తౌర! తగ భుజ శక్తిన్**
**అనఘాత్మ! రేవతీపతి**
**యనఁగన్ బలరామమూర్తి వైతివి కృష్ణా! 44**

కృష్ణా! భుజశక్తిన్=భుజపరాక్రమముతో, ఘనులగు=గొప్పవారగు, ధేనుక-ముష్టిక దనుజులన్= ధేనుకుడను, ముష్టికుడను రాక్షసులను, చెండాడితివి= సంహరించితివి; తగన్= తగునట్లుగా, రేవతీపతివి+ఐతివి= రేవతీదేవికి భర్తవైతివి.

శ్రీకృష్ణా! ధేనుక ముష్టికాసురులను వధించి నట్టియు, రేవతీదేవికి భర్తయైనట్టియు బలరామమూర్తివి నీవే.

శ్రీమద్భాగవతంలోని ప్రథమ సూచికలో (3-23) బలరామకృష్ణులను అవతార పురుషులని చెప్పబడింది. కాని, శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్ముడుగా పేర్కొనబడటంచేత బలరాముణ్ని నవమావతారంగా పరిగణించడం జరిగింది. సాక్షాత్తు శ్రీకృష్ణలీలా సహాయకుడు బలరాముడు. అగ్ని పురాణమున నవమావతారమైన బలరాముడు అనంతమూర్తిగా వర్ణింపబడ్డాడు. శ్రీకృష్ణలీలకు సాక్షాత్తు సాహాయకుడైన బలరాముడు శ్రీకృష్ణుని అంశతో అవతరించినవాడు. చతుర్భుజత్వము, లాంగల (హల) ధారిత్వము, మరొక చేత శంఖము, వేఱొకచేత ముసలము ధరించియున్నట్లు వర్ణితమైనది. అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవమను చతర్వ్యూహాలతో ఆవిర్భవించినవాడు పరబ్రహ్మము శ్రీకృష్ణుడు. ఆ వ్యూహంలోని సంకర్షణుడే బలరాముడు. కృష్ణ-వాసుదేవనామాల వలెనే సంకర్షణ నామం కూడా లోక విడంబనకు ఉద్దేశించినట్టిదే. దేవకి గర్భాన్ని ఆకర్షించి రోహిణి గర్భంలో నిక్షేపింపగా అవతరించిన వాడు కావున బలరామునికి

సంకర్షణుడను పేరేర్పడింది అని లోకులు సహేతుకంగా చెప్పుకోవడానికి సంకర్షణుడయ్యాడు.

వసుదేవుడు కశ్యపుని అవతారము. కశ్యపముని భార్య అదితిదేవియే దేవకిగా అవతరించినది. ఆ కశ్యపుని మరొకభార్య కద్రువ. ఆమె నాగమాత. ఆమె రోహిణియై అవతరించినది. దేవకీ గర్భాన్ని సంకర్షించి రోహిణి గర్భంలో నిక్షేపించడం వల్ల ఆమెకు ఉద్భవించినవాడు సంకర్షణుడయ్యాడు. అతడే బలరాముడు. కద్రువ అంశతో జన్మించిన రోహిణి యందే ఆదిశేషుడు పూర్వం వలెనే అనంతుడుగా, శేషుడుగా, బలరాముడుగా సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుని పరివారముగా అవతరించాడు.

శ్రీరామావతారమున శ్రీరాముడు అంశి కాగా లక్ష్మణుడు అంశయై అవతరించినాడు. శ్రీకృష్ణ బలరాములు పరస్పరము అభిన్నులు. బలరాముడు శ్రీకృష్ణునికి అగ్రజుడైనాడు. శ్రీమద్రామాయణంలో శ్రీరామునికి తమ్ముడై లక్ష్మణుడను పేరుగలవాడే ఈ శేషుడు.

శ్రీకృష్ణబలరాములు గోకులంలో క్రీడిస్తుండగా కంసప్రేరితుడై వచ్చిన ప్రలంబాసురుని బలరాముడు హతమార్చాడు. గర్దభాకారంతో ప్రవేశించిన రాక్షసుని వధించాడు.

కృష్ణబలరాములలో బలరాముడు పరమోదారుడు, శాంతుడు, గంభీరుడు. శ్రీకృష్ణుడు శంఖచూడుని శిక్షించి అతని శిరోరత్నాన్ని తెచ్చి, రత్నప్రియుడగు బలరామునికిచ్చి అతనిని సంతోష పరిచాడు. కంసుని ఆస్థానమల్లుడగు ముష్టికాసురుని మట్టుపెట్టినవాడు బలరాముడే. మథురపై పదిహేడు పర్యాయాలు దండెత్తి వచ్చిన జరాసంధుణ్ని శిక్షించినవాడు బలరాముడే. పదిహేడవసారి జరాసంధుణ్ని వధింప నుద్యుక్తుడు కాగా శ్రీకృష్ణుడు బలరాముణ్ని నివారించాడు. జరాసంధుణ్ని భీమునిచే చంపించవలయునని కౌరవులకు భయము కలిగించవలయునని శ్రీకృష్ణుని సంకల్పము.

దుర్యోధనుని పుత్రిక లక్ష్మణ. శ్రీకృష్ణుని పుత్రుడగు సాంబుడు లక్ష్మణను

వరించి, తీసికొని పోతుండగా దుర్యోధనుడు తనబలాలతో అడ్డుపడి అతణ్ని బంధించి చెరసాలలో ఉంచాడు. అది విని రోషించి బలరాముడొక్కడు హస్తినాపురిపై దండెత్తాడు. హస్తినాపురిని పెల్లగించి గంగలో కలుపుతానని పెద్దపెట్టున నాగలిని భూమిలోనికి దించాడు. హస్తినాపురం గ్రక్కదలి పోయింది. అప్పుడు దుర్యోధనాదులు వచ్చి క్షమింపుడని బలరాముని వేడుకొని, లక్ష్మణను సాంబుని కిచ్చి వారిని సగౌరవంగా ద్వారకకు పంపించారు.

బలరాముడు తన అవతారాన్ని చాలించేటపుడు సముద్రతటానికి చేరి సహస్రశీర్షాలుగల ఆదిశేషుని స్వరూపంతో మహాసముద్రంలో ప్రవేశించి, అటనుండి ఆకాశానికి ఎగసిపోయాడు.

అంశకళలను వ్యూహమని, పరివారమనియు పేర్కొంటారు. వ్యూహ పరివారాలకు ఒకే అర్థము. తంత్ర శాస్త్రంలో విశిష్టదేవతలకు పరివార దేవతలను చేర్చి చెప్పడం కద్దు. ప్రధానదేవుడు మధ్యనిలుస్తాడు. పరివారదేవతలు నలువైపుల ఉంటారు. "పరితో వారయంతి తే పరివారాః" "వ్యూహతే పరిత స్తిష్ఠత్యసౌ వ్యూహః" అని వ్యుత్పత్తి. జాజ్వల్యమానమైన అగ్నిగోళం యొక్క కిరణమండలం వంటిదే పరివారము. శ్రీకృష్ణభగవానుని అంతరంశలనే వ్యూహమంటారు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధములని నాలుగు-వ్యూహాలు.

చతుర్వ్యూహ గాయత్రి నిరూపణం శ్రీమద్భాగవతంలో ఉంది.

"నమో భగవతే తస్మై వాసుదేవాయ ధీమహి
ప్రద్యుమ్నా యానిరుద్ధాయ నమః సంకర్షణాయ చ"

ఈ నాలుగు వ్యూహాల యొక్క కార్యములు వేరువేరుగా ఉంటాయి. ముక్తిదాన కార్యము శ్రీవాసుదేవునిది. అసుర సంహార కార్యము సంకర్షణునిది. సంతానాభివృద్ధికార్యము ప్రద్యుమ్నునిది. ధర్మరక్షణ కార్యము అనిరుద్ధునిది. నిజానికి ఈనాలుగు కార్యాలు భగవంతునివే.

పూర్ణపురుషోత్తముడైన శ్రీకృష్ణుడు రెండుచోట్ల ఆవిర్భవించాడు. వసుదేవ దేవకీ దేవులకు, నంద యశోదలకు. రెండుచోట్లను భగవంతుడు

వ్యూహసహితుడుగనే అవతరించాడు.

దేవకీ వసుదేవులకు భగవానుడు చతుర్భుజుడై, నంద యశోదలకు ద్విభుజుడై దర్శనమిచ్చాడు.

గోకులంలో భగవానుడు పూర్ణపురుషోత్తముడై వ్యూహసహితుడై అవతరించాడు. అసురసంహారము, ముక్తిదానము మొదలగు కార్యాలను జరిపాడు. ఆ భగవానుడు మాయాసహితుడైన పురుషోత్తముడు. కనుకనే అతడు భగవంతుడన్న జ్ఞానము యశోదాదులకు లేక పోయింది. తమకు పుత్రుడు కలిగెనా? పుత్రిక కలిగెనా అను జ్ఞానం కూడా వారికి లేకుండా పోయింది.

నందయశోదలు పూర్వజన్మలో బ్రహ్మదేవునిచేత "జాతయోనౌ మహాదేవే భువి విశ్వేశ్వరే హరౌ, భక్తిః స్యాత్" భగవంతుణ్ని పుత్రబుద్ధితో బడయుదురని వరము పొందారు. "నంద స్త్వాత్మజ ఉత్పన్నే" నందునికి కుమారుడు కలిగెనని చెప్పినది శ్రీశుకదేవుడు. వాస్తవమునకు పురుషోత్తముడు ఎవరి గర్భాన ఉదయించలేదు. ఆయన అభవుడు, అజన్ముడు. కావుననే శ్రీశుకదేవుడు నందయశోదలకు పుత్రభావంతో భగవంతుడు అవతరించెననియు, దేవకీ వసుదేవులకు పుత్రరూపంతో అవతరించెననియును చెప్పాడు. పుత్రభావానికి, పుత్రరూపానికి వ్యత్యాసముంది. సారాంశమేమనగా నందునికి యోగమాయా సహితుడైన భగవానుడు గోకులంలో అవతరింపగా, వసుదేవునికి చతుర్వ్యూహ సహితుడైన భగవానుడు చెరసాలలో అవతరించాడని చెప్పదగును.

గోకులంలో భగవంతుని అప్రకటిత వ్యూహకార్యము జరిగింది.మధురలో వ్యూహము ప్రకటితమై తత్కార్యము జరిగింది. ఇది శ్రీకృష్ణావిర్భావానికి చెందిన సంక్షిప్త నిర్ణయము.

**త్రిపురాసుర భార్యల నతి**
**నిపుణతతో వ్రతముచేత నిలిపిన కీర్తుల్**
**కపటపు రాజవు బళిరే!**
**కృపగల బౌద్ధావతార! ఘనుడవు కృష్ణా! 45**

కృష్ణా! కృపగల= దయగలిగిన; బౌద్ధ+అవతార!= బుద్ధదేవుడవైనవాడా! త్రిపురాసుర= త్రిపుర రాక్షసుల యొక్క, భార్యలను, నిపుణతతో= నేర్పుతో, వ్రతముచేత= నియమముల, నోముల చేత, కీర్తుల్=యశములను, నిలిపిన= స్థిరపరచిన, కపటపు రాజవు= కపటమైన రాజువైతివి. బళిరే= ఆహా. (ప్రశంసార్థము)

బుద్ధావతారాన్ని గూర్చి పండితులలో అభిప్రాయభేదాలున్నవి. శుద్ధోదన మహారాజు కుమారుడు గౌతమబుద్ధుడు. గయా ప్రాంతాన ఉన్న కీకట దేశంలో బుద్ధుడవతరించాడంటారు. అది యథార్థం. కాని, అతని తండ్రిపేరు 'అజిను' డని తెలుస్తున్నది. ఎవరైననుగాని, పురాణాలలో బుద్ధుడు తొమ్మిదవ అవతారంగా పేర్కొనబడినాడు.

దైత్యులు ప్రబలులయ్యారు. స్వర్గంలో అధికారం సంపాదించారు. ఇంద్రుడెక్కడున్నాడో తెలుసుకొని మా రాజ్యం స్థిరపడటానికి ఉపాయం చెప్పండన్నారు. మీరు యజ్ఞపరాయణులైనచో మీ పరిపాలన సుస్థిరమవుతుందని దివ్యులు చెప్పాడు. దైత్యులు యజ్ఞ ప్రభావంతో అజేయులయ్యారు. మదమత్తులయ్యారు. దేశంలో ఉపద్రవాలను కలిగిస్తున్నారు. లోకంలో అసురభావం అధికమయింది.

అప్పుడు భగవానుడు బుద్ధుడుగా అవతరించి ఆ దైత్యుల యజ్ఞాను ష్ఠానాలను చూచి "అయ్యయ్యో! యజ్ఞాల పేరుతో మీరు జీవహింస చేస్తున్నారు. జంతుమాంసంతో అగ్నిని అపవిత్రం చేస్తున్నారు. అని చెప్పి తాను నెమలియీకల చీపురుతో నేల చిమ్ముకొంటూ జీవహింస జరుగకుండగా సంచరింపసాగాడు. ఆ బుద్ధుని బోధలు నమ్మి దైత్యులు యజ్ఞాచరణంలో శాస్త్రవిధానాన్ని విసర్జించారు. బుద్ధుని బోధలను నమ్మి వారి భార్యలు అస్తవ్యస్తంగా వ్రతాలు చేయసాగారు. ఈ కారణాల వల్ల దైత్యులు దైవబలాన్ని కోల్పోయి నిర్వీర్యులయ్యారు. మలిన వస్త్రాలను ధరింపసాగారు. దంతధావనం చేయకుండగనే అశుచులై దైవకార్యాలు చేసి స్వర్గభ్రష్టులయ్యారు.

విష్ణుదేవుడు దేవతలకు స్వర్గ మప్పగింపదలచి బుద్ధుడుగా జన్మించి

దైత్యులను, వారి భార్యలను మోసగించి, దుష్కార్యాచరణానికి పురికొల్పి, వారిని స్వర్గం నుండి తొలగించాడు.

అగ్నిపురాణంలో బుద్ధమూర్తి వర్ణనమిట్లున్నది.

"శాంతాత్మా లంబకర్ణశ్చ గౌరాంగ శ్చాంబరావృతః

ఊర్ధ్వ పద్మస్థితో బుద్ధో వరదాభయదాయకః"

ఈ శ్లోకంలో ధ్యానావస్థితుడైన బుద్ధుని అభయముద్ర వర్ణితమయింది. లంబకర్ణత్వము బుద్ధమూర్తి లోని విశేషము. ఈ బుద్ధమూర్తి గాంధార శిల్పమైనట్లు ఈశ్లోకాన్ని బట్టి తెలుస్తున్నది.

**వలపుల తేజీ నెక్కియు**
**నిలపై ధర్మంబు నిలుప హీనుల దునుమన్**
**కలియుగము తుదిని వేడుక**
**కలికివిగా నున్న లోకకర్తవు కృష్ణా! 46**

కృష్ణా! వలపుల తేజీని= వలపుగొలుపు గుఱ్ఱమును ఎక్కి, ఇలపై= భూమియందు, ధర్మము నిలుపన్= ధర్మమును నిలబెట్టుటకు, హీనులన్= (ధర్మ) ధర్మము లేనివారిని, తునుమన్= చంపుటకు, కలియుగము తుదిని= కలియుగము ముగియు కాలమున, వేడుకన్= వేడుకగా; కలికివిగా+ఉన్న= కలికిమూర్తివిగా అవతరింపనున్న, లోక కర్తవు= లోకములను సృజించువాడవు.

కృష్ణా! భూలోకమున అధర్మపరులను సంహరించి ధర్మమును ప్రతిష్ఠించుట కొరకు గుఱ్ఱమునెక్కి కలియుగావసానమున అవతరించెడి కలికి మూర్తివి నీవేగదా!

రాబోయే అవతారం కల్కి అవతారమని శాస్త్రకథనము. ఇది భవిష్యదవతారము. పరిపాలకుల దౌష్ట్యం అధికమై, ప్రజలు దుష్టజన పీడితులై అధర్మం మిక్కిలి ప్రబలమై, వేదధర్మాలు సంపూర్ణంగా నిందాపాత్రములై, హేళనభాజనములై పోయినప్పుడు భగవంతుడు కల్కిమూర్తియై అవతరించి దుష్టసంహారం జరిపి ధర్మసంస్థాపన చేస్తాడని పురాణాలు చెబుతున్నవి.

కలియుగాంతంలో సంబలగ్రామంలో విష్ణుయశుడనే బ్రాహ్మణునికి కల్కి భగవానుడు ప్రాదుర్భవిస్తాడని మహాభారతం, హరివంశం చెబుతున్నవి.

గంగా యమునా మధ్య ప్రదేశంలో (అంతర్వేది)అవతరిస్తాడని హరివంశంలో ఉంది. కల్కి హరిత పింగళ వర్ణము గలవాడై ఉంటాడనీ వివిధాయుధాలతో అధార్మికులను నిర్దయుడై సంహరిస్తాడనీ, అతడు బహువేగవంతమైన గుఱ్ఱమెక్కి వస్తాడనీ, అతని వెంట యాజ్ఞవల్క్య, పారాశర్యాది బ్రాహ్మణులుంటారనీ కూడా పురాణాలు అద్భుత విశేషాలతో వర్ణిస్తున్నాయి.

పాపులను, అధార్మికులను సంహరించి కల్కిపురుషుడు ధర్మ సంస్థాపనం చేసిన తర్వాత మరల కృతయుగం ప్రారంభమవుతుందని పురాణ కథనము.

వనజౌ వనజౌ ఖర్వః త్రిరామీ సకృపోఽకృపః
అవతారా దశైవైతే కృష్ణస్తు భగవాన్ స్వయమ్

వనజౌ= జలమందు ఉత్పన్నమైన అవతారములు రెండు; మత్స్యము-కూర్మము. వనజౌ= అడవియందుత్పన్నమైనవి రెండు; వరాహము-నృసింహము. ఖర్వః= వామనుడు; త్రిరామీ= ముగ్గురు రాములు; పరశురాముడు, రఘురాముడు, బలరాముడు; సకృపః= కృపాయుక్తమైన అవతారము బుద్ధుడు; అకృపః= కృప లేని అవతారము కల్కి; శ్రీకృష్ణుడు స్వయంభగవానుడు, ఆయనవలననే ఈ పది అవతారాలు కలిగినవి.

క్షేమేంద్రుని "దశావతార చరితం"లోను జయదేవుని "గీతగోవిందం" లోను భగవదవతారాల విస్తృత వర్ణన మున్నది.

**వనజాక్ష! భక్తవత్సల!**
**ఘనులగు త్రైమూర్తులందు కరుణానిధివై**
**మను నీ సద్గుణజాలము**
**సనకాది మునీంద్రు లెన్నజాలరు కృష్ణా! 47**

కృష్ణా! వనజ+అక్ష= పద్మములవంటి కన్నులు కలవాడా! భక్తవత్సల= భక్తులయందు వాత్సల్యము గలవాడా!, ఘనులగు= గొప్పవారలగు,

త్రైమూర్తులందు= బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులందు, కరుణానిధివై= దయకు గనివంటివాడవై, మను=ఒప్పునట్టి, నీ సద్గుణజాలమున్= నీమంచి గుణాల సమూహమును, సనక+ఆది మునీంద్రులు= సనకుడు ఆదియైన మహామునులు, ఎన్నజాలరు= లెక్కింపజాలరు.

ఓకృష్ణా! భక్తవత్సలా! త్రిమూర్తులయందు పరమదయామయుడవై నీ అసంఖ్యేయ గుణగణములను సనకాదిమహామునీంద్రులు కూడను ఎన్నజాలరు. ఇక నేనెంతటి వాడను?

వనజమనగా పద్మము. నిర్మలమైన పద్మాలవలె ఆశ్రితుల శ్రమను తొలగింపగల రమణీయములైన నేత్రాలు గలవాడు. (పర్యా) పద్మనిభేక్షణుడు, కమలాక్షుడు, అరవిందాక్షుడు మొ॥ "భక్తస్నేహవాన్" భక్తులపట్ల స్నేహయుక్తుడై ఉండటంచేత భక్తవత్సలుడని శ్రీశంకర భగవత్పాదులు, భక్తేషు వత్సలః = భక్తులు లభించినపుడు తనకు మరొకపని ఉన్నట్లు భావింపక సమస్తాన్ని మరచి వారితో కూడి ఉండేవాడని శ్రీపరాశరభట్టరు వ్యాఖ్యానించారు. స్నేహాన్ని కూడా వాత్సల్యమంటారు. తనయందు ప్రీతిగల చేతనులను ప్రేమించువాడు, "విదితస్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః" (సుందరకాండ 21-21) ఆవు తన దూడ పట్ల ఎంత వ్యగ్రత చూపుతుందో, భగవంతుడు శరణాగత రక్షణపట్ల అంతటి వ్యగ్రతను చూపుతాడు. 'వత్స' మనగా ఆవుదూడ.

సనక+ఆదులు= సనకుడు మొదలైనవారు. వీరు బ్రహ్మమానసపుత్రులు. సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనాతనుడు అను వీరలు నలుగురు. వీరు శంకరునితో సమానులు. వీరినోటి నుండి నిరంతరం 'శ్రీహరిఃశరణమ్' మంత్రం ఉచ్చారితమవుతుంటుంది. వీరు సర్వదా అయిదేండ్ల ప్రాయం కలవారై ఉంటారు. వీరు నారద మహర్షికి భగవత్తత్త్వోపదేశం చేసిన మహాత్ములు. నారద పురాణం పూర్వభాగమంతా నుడివినవారు వీరే.

**అపరాధ సహస్రంబుల**
**నపరిమితములైన యఘము లనిశము నేనున్**
**గపటాత్ముడనై చేసితి**
**జపలుని ననుగావు శేషశాయివి కృష్ణా! 48**

కృష్ణా! శేషశాయివి= ఆదిశేషునియందు పవళించిన ఓదేవా! కపటాత్ముడనై= కపటమైన మనస్సుగలవాడనై, అపరాధ సహస్రంబుల= వేలకొలది నేరములను, అపరిమితములైన, అఘములను= పాపములను, అనిశము= నిరంతరము, చేసితిని. చపలుని= చంచలమైన మనస్సుగల నన్ను, కావు= కాపాడుము.

కృష్ణా! శేషశాయివైన ఓ విష్ణూ! నేను కపటాత్ముడనై అనేక అపరాధములను చేసినవాడను. నిరంతరము పాపకార్యములు అనేకములు జరిపితిని, చపలుడను. నన్ను రక్షింపుము.

స్వామీ! కృపాసింధూ! నీవు క్షమాగుణైకభాజనుడవు. నీవు సకలాపరాధాలను క్షమింపగలవు. పాపాలను పోగొట్టగలవు. అని ఈ పద్యంలో భక్తుడు తన అత్యంత దయనీయ స్థితిని తెలుపుకొన్నాడు.

"అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్;
సాధురేవ స మంతవ్యః సమ్యక్ వ్యవసితో హి సః" (గీత 9-30)

"ఎంతటి దురాచారుడైనప్పటికిని అనన్య భక్తితో నన్ను సేవించినచో అతనిని సాధువుగా, వైష్ణవాగ్రేసరునిగా భావిస్తాను" అను గీతావాక్యాన్ని పురస్కరించుకొని ఈ భక్తుడిట్లు ప్రార్థించినాడని గ్రహింపవలయును. ఈ అపరాధాలు సహస్రాలు, పాపాలు అనేకమైనవి. ఇవన్నీ ఒక జన్మలో చేసినవి కాకపోవచ్చును.

"అహ మప్యపరాధ చక్రవర్తీ, కరుణే త్వం చ గుణేషు సార్వభౌమీ"
"దయామయీ! నేను అపరాధాలనేకమైన వాటికి చక్రవర్తిని, నీవో సుగుణాలకు సార్వభౌమురాలవు" అని శ్రీవేదాంత దేశికులు తమ దయాశతకమందు, తమ నైచ్యాన్ని, భగవంతుని దయౌన్నత్యాన్ని పేర్కొన్నారు.

జితంతా స్తోత్రంలో ---

"రక్ష మాం కృపయా కృష్ణ భవాబ్ధౌ పతితం సదా
అపరాధ శతంచైవ సహస్రమయుతం తథా
అర్బుదం చాప్యసంఖ్యేయం కరుణాబ్ధే క్షమస్వ మే
యం చాపరాధం కృతవా నజ్ఞానాత్ పురుషోత్తమ
మద్భక్త ఇతి దేవేశ తత్సర్వం క్షంతు మర్హసి
అజ్ఞత్వా దప్యశక్తత్వా దాలస్యా ద్దుష్టభావనాత్
కృతాపరాధం కృపణం క్షంతుమర్హసి మాం విభో
అపరాధ సహస్రాణి క్రియంతే ఽహర్నిశం మయా".

"కృష్ణా! నేను సంసార సముద్రములో పడిపోయాను. నన్ను రక్షించు. నేను అపరాధాలు వంద, వెయ్యి, పదివేలు, అర్బుదం, లెక్కింపరానివి చేశాను. కరుణాసాగరా! వీటిని క్షమించు: పురుషోత్తమా! నేనే అపరాధం చేసినా వీడు నా భక్తుడని దేవేశా! దానిని క్షమింపదగినవాడవు నీవు. విభూ! తెలియకనో, శక్తిలేకనో, బద్ధకం వల్లనో, దురాలోచన వల్లనో నేను అపరాధాలు చేసి ఉండవచ్చు. దీనుణ్ణి. నన్ను క్షమింపదగిన వాడవు నీవు; నేను ప్రతిరేయి పగలు అపరాధాలు చేస్తున్నాను" అని ప్రార్థించారు.

క్రిమికీటక పశుపక్ష్యాది జన్మలలో తానున్నప్పుడు భగవంతుని ఇట్లు ప్రార్థించే అవకాశం లభించలేదు. ఇప్పుడవకాశము లభించింది. కాబట్టి తన పూర్వపూర్వజన్మలను నెమరుకు తెచ్చుకొని భగవత్కారుణ్యాన్ని అర్థిస్తున్నాడు ఈ భక్తుడు. అనేక జన్మల సంచితమే కదా ఇప్ప డనుభవిస్తున్నట్టిది. ఈ కవి శ్రీయామునముని రచించిన స్తోత్రరత్నాన్ని పఠించి ఉంటాడు.

"అపరాధ సహస్రభాజనం పతితం భీమభవార్ణవోదరే
అగతిం శరణాగతం హరే కృపయా కేవల మాత్మసాత్కురు"

**ఆళువందారు స్తోత్రం - శ్లో ॥48॥**

"నేను వేలకొలదీ అపరాధాలు చేశాను. భయంకరమైన సంసారసాగరంలో

పడ్డాను. వేరే దిక్కు లేదు. నీ శరణుచొచ్చినవాణ్ణి. కనుక శ్రీహరీ! దయతో నన్ను నీ వాణ్ణి చేసుకో" అని ఇలా - తన దోషాలను, తాజేసిన అపరాధాలను ఎరుకపరచి తనను క్షమింపుమని భగవంతుణ్ని ప్రార్థించడాన్ని వైష్ణవులు నైచ్యానుసంధానమంటారు. ఇది వైష్ణవోచిత స్వభావసులభ వినయగుణ సంపన్నత్వముగా, స్వాహంకార పరిత్యాగముగా గ్రహింపవలెనేగానీ, వైష్ణవులు ఇట్టి తప్పులను చేసినవారని భావింపరాదు. ఎన్నో జన్మలలో ఎన్నెన్ని అపరాధాలు చేసి ఉన్నాయో మనకేమి ఎరుక? చేసియుంటిమనుట వాస్తవము. ఆ అపరాధాలు ఒక్కొక్క జన్మలో పరిహరింపబడటం వల్ల ఈ జన్మలో హరిభక్తి సంక్రమించినది. "నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" పాపాలు క్షీణదశకు వచ్చే సమయంలో జీవునికి శ్రీకృష్ణునిపై భక్తి కలుగుతుందని శాస్త్రం చెబుతున్నది.

చపలుడనగా చంచలస్వభావుడని అర్థము. శ్రుతులందును, శాస్త్రములందును స్థిరమైన బుద్ధిలేనివాడు అవ్యవస్థితచిత్తుడు. అట్టివాని అనుగ్రహం కూడా భయంకరమే అని నీతిశాస్త్రజ్ఞులంటారు.

**నరపశువు మూఢ చిత్తుడ**
**దురితారంభుడను మిగుల దోషగుడను నీ**
**గుఱుతెఱుగ నెంతవాడను?**
**హరి నీవే ప్రాపు దాపు నౌదువు కృష్ణా! 49**

కృష్ణా! హరి=పాపములను హరించువాడా! నేను, నరపశువున్= మనుష్యుడనైనను పశువు వంటివాడను, మూఢచిత్తుడను= మూఢమైన మనస్సు గలవాడను, దురిత+ఆరంభుడను= దుష్కార్యములను చేయువాడను; మిగుల దోషగుడను=పెక్కు పాపములను చేసినవాడను; నీ గుఱుతు=నీలక్షణమును, నీ మేరను, తెలుసుకొనుటకు నేనేపాటివాడను? నీవే నాకు, ప్రాపు= ఆశ్రయము; దాపు= సమీపమందున్న వాడవు అగుదువు.

కృష్ణా! నేనొక నరపశువును. మనుష్యుడనై జన్మించియు పశువువలె ప్రవర్తించేవాడను. మూర్ఖుడను. దుష్కార్యాలు చేసినవాడను. పెక్కు దోషాలు గలవాడను. ఓకృష్ణా! నీ లక్షణమును, నీమేరను ఎరుగుటకు నేనెంతటివాడను?

అల్పుడను. నీవే నాకు ఆశ్రయము, నీవే నాకు సన్నిహితుడవు కావలయును.

"ఆహార నిద్రా భయ మైథునం చ సామాన్యమేతత్ పశుభిర్నరాణాం" అని లోకోక్తి. నాలుగు విషయాలలో పశువు మనుష్యుడు ఒకే విధమైనవారు. వివేక మొక్కటి మనుష్యునికి మాత్రమే ఉండటంవల్ల పశువు నిందితమూ, అవమానితమూ అయింది. ఆ వివేకమే లేకుంటే మనుష్యునికి పశువుకు భేదమే లేదు.

**పరనారీ ముఖపద్మము**
**గుఱుతగు కుచకుంభములను కొప్పును నడుమున్**
**అరయంగనె మోహింతురు**
**నిరతము నిను భక్తిగొల్వ నేరరు కృష్ణా! 50**

కృష్ణా! పరనారీ= ఇతరుని భార్యయొక్క, ముఖపద్మము= పద్మమువంటి ముఖమును, గుఱుతగు= మేరలు గల, కుచకుంభములను= కలశముల వంటి పాలిండ్లను, కొప్పును, నడుమును, అరయంగనె= చూడగనే; మోహింతురు, నిరతము= ఎల్లవేళల, నిన్ను, భక్తిన్= భక్తితో, కొల్వనేరరు= సేవింప నిచ్చగింపరు.

కృష్ణా! జనులు పరస్త్రీల అందచందాలను వారి అవయవాలను చూచినంతనే మోహింతురుగాని, మన్మథమన్మథుడవగు నిన్ను భక్తితో కొలవ నిచ్చగింపరు.

పరస్త్రీవ్యామోహం కొందరికి పూర్వ జన్మ పాపం వల్ల అది యొక వ్యాధిగా ఏర్పడుతుంది. తనభార్య అందగత్తె, అనుకూలవతి, గుణవతి అయి ఉండగా, పరసతిని వ్యామోహించడం ఒక విధమైన వ్యాధి కాక మరేమిటి? అది పూర్వ జన్మకృత పాపఫలం. ఒకని భార్య పరపురుషునితో సంపర్కం పొందినదంటే ఆమె కులట కాక మరేమవుతుంది? ఆమె పెదవులెంత సుందరములైనను అది జారభటచోరచేటక విటనటులు ఉమ్మి వేసికొనుటకుంచిన శరావమే (ఉమ్మి పాత్ర) అవుతుందని భర్తృహరి గర్హించాడు. వ్యభిచరించే స్త్రీపురుషులలో ఉన్నది తుచ్ఛమైన కామమే కాని, పవిత్రమగు ప్రేమ కానేరదు. అట్టిదానిని కొందరు

ప్రేమ అనడం విశ్వజనీనమైన ప్రేమకు అపఖ్యాతిని, అపవిత్రతను కలిగించడమే అవుతుంది.

సంసారంలో ఉన్న స్త్రీ పురుషులిద్దరును స్వతంత్రులు కారు. వారిరువురు సాంఘికమైన కట్టుబాట్లకు, శాస్త్రానికి పరతంత్రులే. వారిద్దరిలో సహకారము, సహయోగము సౌహార్దము ఉండవలయును. పరపురుషుని కామించిన స్త్రీది ఎంత దోషమో, పరస్త్రీని కామించిన పురుషునిది కూడా అంతకంటె మహాదోషమవుతుంది.

స్త్రీ అలంకరించుకోవడం తన భర్త సంతోషించడం కొరకే కాని, లోకులు చూడటానికి కాకూడదు. అట్లే పురుషుడు ధనవంతుడు కావడం, అలంకరించుకోవడం స్వస్త్రీ సంతోషానికే కాని, పరస్త్రీలను వ్యామోహ పరచడానికి కాకూడదు.

**పంచేంద్రియ మార్గంబుల**
**కొంచెపు బుద్ధిని చరించి కొన్ని దినంబుల్**
**ఇంచుక సజ్జన సంగతి**
**నెంచగ మిమ్మెఱిగినాడ నిప్పుడె కృష్ణా! 51**

కృష్ణా! పంచ+ఇంద్రియమార్గంబులన్= చర్మము, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు అను అయిదు ఇంద్రియముల యొక్క త్రోవలలో, కొంచెపు బుద్ధిని= అల్పబుద్ధిచేత, కొన్నిదినంబులు, చరించి= తిరిగి, ఎంచగన్= ఆలోచించి చూడగా, సజ్జన సంగతి= మంచివారి మైత్రివలన, ఇప్పుడే, ఇంచుక= కొంచెము, మిమ్ము ఎఱిగినాడను= తెలిసికొనినాడను.

కృష్ణా! ఇప్పటికి పంచేంద్రియములకు వశపడినవాడనై, అవి త్రిప్పినట్లుగా తిరిగిన వాడను. ఇపుడు సజ్జనులతో స్నేహము చేయుటవలన నిన్ను గుఱించి కొంచెము తెలిసికొంటిని. "యదా కించిత్కించి ద్బుధజన సకాశాదవగతం" తెలివి లేనప్పుడు గర్వం, తెలిసినప్పుడు, వినయం కలుగుతుందన్నాడు భర్తృహరి.

ఇంద్రియాలతో భోగాలనుభవించే జ్ఞానం పశుపక్ష్యాది సమస్త జీవులకు ఉన్నది. కాని, మంచిచెడుల వివేకం మనుష్యులకు మాత్రమే ఉన్నది. పశువునకు

కఱ్ఱ చూపిస్తే అది భయపడి ఇంద్రియభోగం నుంచి మరలగలదు. అది అట్లు మరలుట విషయదోషాన్ని గ్రహించి కాదు. కేవలం కఱ్ఱ భయము. విషయ దోషాన్ని అది ఎరుగదు. మనుష్యునికి విషయభోగములందలి దోషము, భగవత్ప్రాప్తి యందలి మహత్త్వమును తెలిసి ఉంటుంది. భగవత్ప్రాప్తియే తన జీవిత పరమలక్ష్యమని కూడా తెలియును. భగవత్ప్రాప్తిని జీవిత లక్ష్యంగా చేసికొనని మనుష్యుడు పశువుకంటె నికృష్టుడవుతాడు. వివేకం లేనిదవడంవల్ల పశువు ఈవిషయాన్ని గ్రహింపజాలనిదై ఉండగా, మనుష్యుడు వివేకముండి కూడా దానిని దురుపయోగం చేసినవాడవుతున్నాడు.

సజ్జన సాంగత్యాన్ని అభిలషించినవాడు తన దుర్వర్తనాన్ని సరిదిద్దుకొని బాగుపడే అవకాశమున్నది. సజ్జన సాంగత్యము ముక్తి మండపానికి ద్వారమని పెద్దలంటారు.

మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః
శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధుసంగమః

మోక్షద్వారమునందు శాంతి, సద్విచారము, సంతోషము, సజ్జన సాంగత్యము అను నలుగురు ద్వారపాలకులు గలరని జ్ఞానవాసిష్ఠము. "మహత్సేవాం ద్వార మాహు ర్విముక్తే" అని శ్రీమద్భాగవతము. శ్రేయస్సు కోరేవానికి "వాంఛా సజ్జన సంగతౌ" సజ్జన సాంగత్యం పట్ల కోరిక ఉంటుందంటాడు భర్తృహరి.

భగవద్గోష్ఠి జరిగేచోటు స్వర్గము. విషయవాంఛా చర్చ జరిగే చోటు నరకము. మనస్సును పవిత్రము, సంయమితము చేసికోదలచినవాడు సజ్జన సాంగత్యాన్ని పొంది నిరంతరం భగవంతుని మహామహిమను, భగవంతుని దివ్యలీలాకథలను వింటూ, వాటిని మననం చేస్తూ ఉంటే దాని సత్ఫలమైన శ్రేయస్సును పొందగలుగుతాడు.

**దుష్టుండ ననాచారుడ**
**దుష్టచరిత్రుడను చాల దుర్బుద్ధిని నే**
**నిష్ఠ నిను గొల్వనేరని**
**కష్టుడ ననుగావు కావు కరుణను కృష్ణా! 52**

కృష్ణా! దుష్టుండ= దుర్మార్గుడను, అనాచారుడను= సదాచారము నెఱుంగనివాడను, దుష్టచరిత్రుడను=చెడునడవడి గలవాడను, దుర్బుద్ధిని=చెడు బుద్ధిగలవాడను, నిష్ఠన్= నియమముతో, నినున్, కొల్వనేరని= సేవింపజాలని, కష్టుడను= పాపాత్ముడను, కరుణను= దయతో, కావు= కాపాడుము.

కృష్ణా! నేను దుష్టుడను, అనాచారుడను, దుష్టచరిత్రుడను, దుర్బుద్ధిని. నిన్ను నిష్ఠతో పూజింపని పాపిని. నన్ను దయతో రక్షింపుము.

ఇదికూడా నైచ్యానుసంధానమే. ఈ భక్తుడు ఇంతటి దుర్మార్గుడని మనం భావింపగూడదు. అనేక జన్మలు గడచి, ఇప్పటికి ఈ మనుష్యజన్మమొంది శ్రీకృష్ణభక్తిభావనుడైనాడు. ఇతఃపూర్వపు జన్మలకు కారణమైనవి దుష్టత్వము, మొదలైన కారణాలు కావచ్చును. ఎవరికి తెలియును?

తాను పాపాత్ముడు అనుకొన్నవాడు దైవానికి దగ్గరవుతాడు. తాను పుణ్యాత్ముడు అనుకొన్నవాడు దైవానికి దూరమవుతాడు. స్మరింపదగినవి, పశ్చాత్తాపపడదగినవి తాను చేసుకొన్న పాపాలే. కాని, తాను చేసిన పుణ్యాలు స్మరింపదగినవి, ప్రశంసింపదగినవి అనుకోరాదు.

**కుంభీంద్ర వరద! కేశవ!**
**జంభాసురవైరి! దివిజ సన్నుత చరితా!**
**అంభోజనేత్ర జలనిధి**
**గంభీరా! నన్ను గావు కరుణను కృష్ణా!** 53

కృష్ణా! కుంభీంద్ర= గజేంద్రుని, వరద= కాపాడినవాడా! కేశవ; జంభాసుర= జంభుడను రాక్షసునికి, వైరి= శత్రువైనవాడా! దివిజ= దేవతలచేత; సన్నుత= నుతింపబడిన; చరిత= నడవడిగలవాడా! అంభోజనేత్ర= తామరపూలవంటి కన్నులు గలవాడా! జలనిధి గంభీరా!= సముద్రమువలె లోతయినవాడా! కరుణను= దయతో, నన్ను కావుము= రక్షింపుము.

కృష్ణా! గజేంద్రుడు మున్నగు ఆర్తులను రక్షించినవాడా! లోకకంటకుడగు జంభాసురుని వధించినవాడా! దేవతలచేత నుతింపదగిన చరిత్రముగలవాడా!

పద్మములవంటి నేత్రములు గలవాడా! గంభీరమైన హృదయముగలవాడా! నన్ను దయతో రక్షింపుము.

త్రికూట పర్వతారణ్యంలో ఒక గజరాజున్నాడు. ఆ ఏనుగునకు పెక్కండ్రు భార్యలు. ఆ ఏనుగు ఒకనాడు ఆడ ఏనుగులతో విహరిస్తూ జలక్రీడలాడటానికి ఒక ప్రాచీన సరస్సులోనికి దిగింది. దిగిన వెంటనే అందున్న పెద్దమొసలి ఆ ఏనుగు కాలిని పట్టుకొన్నది. ఏనుగు స్థలచరము, మొసలి జలచరము. జలచరమైన మొసలిపట్టును ఎంత ప్రయత్నించినప్పటికి స్థలచరమైన ఏనుగు విడిపించుకోలేనిదయింది.

నిజానికి సంసారమొక సరోవరమనీ, జీవుడు గజేంద్రుడనీ, కాలమొక మొసలి యనీ వేదాంతులు వర్ణిస్తారు.

ఒక్క వేయి సంవత్సరాలకాలం కరికిని మకరికిని స్థలజలాలనడుమ పోరు జరిగింది. ఈమధ్యకాలంలో ఏనుగు భార్యలు తమ భర్త మొసలివాతబడి మరణిస్తాడని నిశ్చయించి, అతనిని విడిచి తమదారిని తాము వెళ్లి పోయారు. భార్యలకుగాని, పిల్లలకుగాని తమ భర్తతోను తండ్రితోను, అతడు పుట్టినప్పుడు గాని, గిట్టినప్పుడుగాని సంబంధముండదు. జననమరణాల మధ్యకాలాన చేరేవారే భార్యలు, పిల్లలును. కాబట్టి గజేంద్రుణ్ని అతని దుర్గతికి వదలి అతనిభార్యలు, బిడ్డలు వెళ్లిపోయారు.

గజేంద్రుడు ఒంటరివాడయ్యాడు. ఒంటరి వాడైనప్పుడే బ్రహ్మజ్ఞానం జాగృతమవుతుంది. గజేంద్రుడు నిరాధారుడయ్యాడు. దీనుడయ్యాడు. జలచర మైన మొసలి తీవ్రంగా పీడిస్తున్నది. గజేంద్రుడు వ్యాకులుడు, దుఃఖితుడునై భగవంతుని కాపాడుమని ప్రార్థింపసాగాడు. దేహావసాన సమయమైనప్పుడు జీవుడు భయకాతరుడై భగవంతుణ్ని శరణువేడుకొంటాడు.

శ్రీమద్భాగవతంలో గజేంద్రుడు చేసిన శరణాగతి అతి మహిమోపేతమైన స్తోత్రము. వేరువేరు వేషాలను ధరించి నాటకమాడు నటుని నిజమైన రూపం ఎటువంటిదో ఎవరికిని తెలియదు. తుదకు ఆ నాటక మాడించే దర్శకునికి

కూడా ఎరుకపడదు. భగవంతుడట్టివాడు. ఓ దుర్గమ చరిత్రగల భగవాన్! నన్ను రక్షింపుము.

మాదృక్ ప్రపన్న పశుపాశ విమోక్షణాయ
ముక్తాయ భూరికరుణాయ నమోఽలయాయ
స్వాంశేన సర్వతనుభృన్మనసి ప్రతీత
ప్రత్యగ్దృశే భగవతే బృహతే నమస్తే　　శ్రీమద్భా 8-3-17

'దయాళువైన పురుషుడు ఉచ్చులో చిక్కుకొన్న నావంటి దీన పశువును విడిపించడానికి ప్రయత్నిస్తాడు. హేభగవాన్! నీవును అట్లే శరణాగతుడనైన నా బంధాలను త్రెంచి నన్ను విడిపించు. నీవు నిత్యముక్తుడవు. పరమ కరుణామయుడవు. భక్తకళ్యాణకరుడవు అయిన నీవు ఈవిషయంలో ఆలస్యం చేయవు. నీచరణకమలాలకు నమస్కారము. సకల ప్రాణుల హృదయాలలో అంతరాత్మవై నీవు వెలసియున్నావు. సర్వైశ్వర్యపూర్ణుడవు. నీవు అనంతుడవు. నీకు నమస్కారము' అని పలువిధాలుగా గజేంద్రుడు మొరపెట్టుకొన్నాడు.

లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె; తనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరంబెఱుగ, మన్నింపందగున్ దీనునిన్.
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

ఇట్లు అనన్యభక్తితో భగవంతుని శరణుచొచ్చాడు.

హేనాథా! గోవింద! నారాయణ! నేను దీనుణ్ని, కాలమకరి నుండి నన్ను ముక్తుని జేయుము అని గజేంద్రుడు ప్రార్థిస్తుండగా బ్రహ్మాది దేవతలు విని ఊరకున్నారు. అనాథనాథుడు, నిరాధారులకు ఆధారమైనవాడు నారాయణుడు. అతడు గజేంద్ర రక్షణార్థము పరుగున రావడం గమనించి తక్కిన దేవతలు మిన్నకున్నారు. శ్రీమన్నారాయణుని రాక చూచి గజేంద్రుడు ఆయనకు సమర్పించడానికి సరోవరమందలి ఒక పద్మాన్ని త్రుంచి తుండాగ్రమున పెట్టుకొని

వేచియున్నాడు. విష్ణుదేవుని సుదర్శన చక్రం మహావేగంగా వచ్చి మకరిని త్రుంచి గజేంద్రుణ్ని రక్షించింది.

ఈ కథ ఏ కల్పంలోనిదో కాని, భగవంతుడు సాకారుడని తెల్పడానికి సుదర్శనచక్రమే నిదర్శనంగా నిలిచింది. సుదర్శనచక్రం శ్రీకృష్ణదర్శనానికి చిహ్నము.

పూర్వజన్మలో గజేంద్రుడు హరిభక్తియుక్తుడగు ఇంద్రద్యుమ్నుడను ఒకమహారాజు. అతడొకనాడు ధ్యాననిష్ఠలోనుండగా అగస్త్యమహాముని వచ్చాడు. ఇంద్రద్యుమ్ను డాయనను గమనించలేదు. అగస్త్యుడు మండిపడి నీవు పశుయోనిలో జన్మించు మని శపించాడు. "వైష్ణవో వైష్ణవం దృష్ట్వా దండవత్ ప్రణమేత్ భువి, తతశ్చ వైష్ణవః ప్రాప్తః సంతర్ప్య వచనామృతైః, సద్బంధురివ సన్మాన్యోఽన్యథా దోషో మహాన్ స్మృతః".

వైష్ణవుడు మరొకవైష్ణవుని చూచినపుడు సాష్టాంగంగా నమస్కరించాలి. బంధువువలె వాగమృతంతో సంతృప్తిపరచాలి. లేదా మహాపచారమవుతుంది.

అగస్త్యుడు హరిభక్తుడే. భక్తుడు వచ్చినపుడు లేచి అతనిని గౌరవిస్తే భగవంతుని ఆరాధించినట్లువుతుంది. ఇంద్రద్యుమ్నుడట్లు చేయక భక్తాపరాధి అయ్యాడు. గజేంద్రుడుగా జన్మించాడు. పూర్వజన్మజ్ఞానంతో అతనికి భక్తి అలవడింది. భక్తి నశించేదికాదు. భక్తుడు ఏజన్మలో ఉన్నప్పటికి భక్తి అతణ్ని అనుసరించి వస్తుంది. "న మే భక్తః ప్రణశ్యతి" అని కదా శ్రీముఖోక్తి (గీత 9-31).

జంభుడు ఒకదానవుడు. ఇతడు యజ్ఞయాగాలను ధ్వంసం చేస్తుండేవాడు. శ్రీవిష్ణువు యజ్ఞపురుషుడుగా అవతరించి జంభాసురుని సంహరించాడని భారతకథ.

**దిక్కెవ్వరు ప్రహ్లాదుకు**
**దిక్కెవ్వరు పాండుసుతుల దీనుల కెపుడున్**
**దిక్కెవ్వర య్యహల్యకు**
**దిక్కెవ్వరు నీవె నాకు దిక్కువు కృష్ణా!** **54**

కృష్ణా! ప్రహ్లాదుకు=హిరణ్యకశిపుని కుమారుడగు ప్రహ్లాదునకు, దిక్కు+ ఎవరు= ఎవరు దిక్కయినవాడు; పాండుసుతుల= పాండురాజు కుమారులకు, అనగా పాండవులకు దిక్కెవరు, ఆఅహల్యకు=గౌతముని భార్యయగు అహల్యకు, దిక్కెవ్వరు, వారికి దిక్కయిన, నీవే నాకు దిక్కువు= దిక్కు అగుచున్నావు.

'దిక్కు' అనగా శరణమని, రక్షకము అని అర్థము.

హిరణ్యాక్షుడు హిరణ్యకశిపుడు అన్నదమ్ములు. పూర్వజన్మలో వైకుంఠ మందిర ద్వారాన్ని కావలికాసే జయవిజయులు. బ్రహ్మమానసపుత్రుల శాపంతో వారిరువురు మూడు జన్మలలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, రావణ కుంభకర్ణులుగా, శిశుపాల దంతవక్త్రులుగా జన్మించి విష్ణుద్వేషులై ఆ విష్ణువు చేతనే ఉద్ధరింపబడ్డారు.

హిరణ్యాక్షుని ఉద్ధరించడానికి విష్ణుదేవుడు వరాహావతారమెత్తాడు. హిరణ్యకశిపుణ్ని ఉద్ధరించడానికి శ్రీనరసింహావతారమెత్తాడు. పరమకరుణాళువైన భగవంతుడు చేసేది ఉద్ధారమే కాని, సంహారంకాదు. ఆయన తరింపజేయడానికే సంహరిస్తాడని గ్రహించాలి.

హిరణ్యకశిపుడు పూర్వజన్మలో జయనామకుడైన శ్రీహరి ద్వారపాలకుడు. సనకాది మునుల శాపం వల్ల దితిగర్భాన అసురుడై జన్మించాడు. శ్రీహరిచేత తన అన్న హిరణ్యాక్షుడు వధింపబడటం తెలుసుకొని అతడు శ్రీహరికి విరోధి అయ్యాడు. మహాతపస్సు చేసి ఎట్టి ఆయుధం చేతను, ఎట్టి ప్రాణులచేతను తనకు మరణం లేకుండగా బ్రహ్మచే వరాలను పొందాడు.

హిరణ్యకశిపునకు జన్మించిన కుమారుడు ప్రహ్లాదుడు, తండ్రికి విరోధియైన విష్ణువు పట్ల అనన్యభక్తి గలవాడు. విష్ణువే ప్రహ్లాదుడుగా జన్మించెననియు చెప్పవచ్చును. "ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం" (గీత 10-30) "దైత్యులనబడు రాక్షసులలో నేను భక్తుడయిన ప్రహ్లాదుడను" అని శ్రీకృష్ణభగవానుడు తన విభూతియోగంలో తెలిపాడు.

విష్ణుద్వేషియైన తండ్రిచే విష్ణుభక్తుడగు ప్రహ్లాదుడు ఘోరయాతనలను

అనుభవించాడు. తండ్రి తన కుమారుని వధించడానికి అనేక ఉపాయాలు చేసినప్పటికి అతడు మృతి నొందలేదు.

"విష్ణువు అన్నిచోట్ల ఉన్నాడన్నావు కదా! ఈ రాతిస్తంభంలో అతణ్ని నీవు చూపకుంటే ఇప్పుడు నా కత్తికి బలి అవుతా"వని హిరణ్యకశిపుడు ఆ స్తంభాన్ని కొట్టాడు. వెంటనే ఆ స్తంభాన్ని చీల్చుకొని శ్రీ హరి నరసింహరూపంతో అవతరించి, తన పెను గోళ్లతో హిరణ్యకశిపుని గుండె చీల్చి చంపాడు. హిరణ్యకశిపుడు మరుజన్మలో రావణుడై జన్మించాడు. ప్రహ్లాదుడు శ్రీహరి భక్త కోటిలో ప్రప్రథమ భాగవతుడైనాడు.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగ దార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి. -పాండవగీత.

శ్రీకృష్ణభగవానునికి పాండుసుతులకు గల సంబంధ బాంధవ్యాలను మహాభారతం తెలుపుతున్నది. నారదమహర్షి ధర్మరాజునకు శ్రీనరసింహావిర్భావాన్ని, తెలిపే సందర్భంలో శ్రీకృష్ణభగవానుని గూర్చి ఇలా ఎరుక పరిచాడు.

జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిన్
బలుకన్ లేని జనార్దనాహ్వయ పర బ్రహ్మంబు నీయింటిలో
చెలియై మేనమఱందియై సచివుడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుడై చరించుటది నీ భాగ్యంబు రాజోత్తమా!

-పోతనగారి భాగవతం 7-386

అహల్య బ్రహ్మదేవుని సృష్టి. ఆమె యౌవనవతి అయ్యే వరకు గౌతముని ఇంట్లో ఉంచాడు బ్రహ్మ. ఆమె యౌవనవంతురాలై అమితసౌందర్యంతో ప్రకాశిస్తుండగా ఇంద్రుడు, అగ్ని దేవుడు, వరుణుడు మున్నగు దేవతలు ఆమెను భార్యగా బడయగోరారు. సమస్త పృథ్విని చుట్టివచ్చినవారికి అహల్య నిస్తానని బ్రహ్మ ప్రకటించాడు. అది విని గౌతమమహర్షి కామధేనువునకు, శివునకు

ప్రదక్షిణించి బ్రహ్మ దగ్గరికి వచ్చాడు. బ్రహ్మ ప్రసన్నుడై అహల్య నాతని కిచ్చాడు.

ఇంద్రుడు కామపీడితుడై గౌతముడింట లేనప్పుడు గౌతముని వేషంతో వచ్చి అహల్యను రమించాడు. ఇంతలో గౌతమ మహర్షి వచ్చి ఇంద్రుణ్ని చూచి, విషయం తెలుసుకొని "నీవు సహస్రయోనివి అగుదువుగాక" యని, అహల్యను రాతివి కమ్మని శపించాడు.

శ్రీరామ లక్ష్మణులు విశ్వామిత్రుని వెంట వెళుతూ, ఆ రాతి దగ్గరకు వచ్చారు. శ్రీరామచంద్రుని కాలి ధూళి ఆరాతి పై పడి అహల్యకు పూర్వరూపం సిద్ధించింది. భగవానుడీ విధంగా అమాయికురాలగు అహల్యను ఉద్ధరించాడు.

**హరి ! నీవె దిక్కు నాకును**
**సిరితో నేతెంచి మకరి శిక్షించి దయన్**
**పరమేష్ఠి సురలు బొగడగ**
**కరి గాచిన రీతి నన్ను గావుము కృష్ణా! 55**

కృష్ణా ! హరి =పాపములను హరించువాడా! నాకును నీవే దిక్కువు. సిరితోన్= లక్ష్మీదేవితో, ఏతెంచి= వచ్చి, మకరిన్= మొసలిని, శిక్షించి, పరమేష్ఠి= బ్రహ్మదేవుడు, సురలు=దేవతలు, పొగడగ= స్తుతింపగా, దయన్=కరుణతో, కరిన్=గజేంద్రుని, కాచిన రీతి=రక్షించిన విధముగా, నన్నును కావుము= రక్షించుము.

కృష్ణా! నీవు లక్ష్మీ సహితుడవై వచ్చి మకరి వాతబడిన గజేంద్రుని రక్షించినట్లుగా నన్ను కూడా రక్షింపుము.

ఈ శతకకర్త పోతనగారి భాగవతాన్ని క్షుణ్ణంగా పఠించినవాడనడానికి ఈ పద్యమొక దృష్టాంతము. పోతనగారు పరమ భక్తుడై గజేంద్రమోక్షణ కథను రసవంతంగా రచించాడు. గజేంద్రుడు మొసలిచేత పీడితుడై శ్రీహరిని వేడుకొని శరణుచొచ్చాడు. గజేంద్రుని దీనాలాపాలు లక్ష్మీదేవితో వినోదిస్తున్న శ్రీమన్నారాయణునికి వినిపించాయి. తతణమే ఆయన లేచి గజేంద్రరక్షణకు ఉద్యుక్తుడయ్యాడు. అప్పుడాయన చేతిలో లక్ష్మీదేవి చేలాంచలమున్నది. భక్త

రక్షణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు తన చేతిలోనున్న లక్ష్మీ వసనాంచలాన్ని విడవడం మరచి పోయాడు. అట్లే ఆయన వెళుతుండగా లక్ష్మీదేవియు వెంట బడక తప్పలేదు

తన వెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్, దాని వె
న్కను పక్షీంద్రుడు, వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజనీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

శరణాపన్నుడైన గజేంద్రుని శ్రీహరి యెడ రక్షాపరత్వాన్ని పోతనగారు హృద్యంగా వర్ణించి ఆ ఘట్టాన్ని అమృత ప్రవాహం చేశారు. అది చదివియే ఈశతకకర్త ఈ పద్యం వ్రాశాడని రసజ్ఞులు గ్రహింపక పోరు. శ్రీహరి భక్త త్రాణ పరాయణత్వాన్ని చూచి బ్రహ్మాది దేవతలు ఆయనను స్తుతించారు.

మొరసెన్ నిర్జర దుందుభుల్, జలరుహా మోదంబులై వాయువుల్
దిరిగెన్, పువ్వుల వానజల్లు గురిసెన్, దేవాంగనా లాస్యముల్
పరగెన్, దిక్కులయందు జీవ జయ శబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగె దరంగచుంబితనభోగంగాముఖాంభోజమై.

సాకారుడైన శ్రీమన్నారాయణుడు శరణాగతుడైన ఒక జంతువును రక్షించడంలో చూపిన పరమకారణ్యాతిశయానికి బ్రహ్మాదిదేవతలు మహానంద భరితులయినా రనడానికి పై పద్యం ఉదాహరణము.

**పురుషోత్తమ! లక్ష్మీపతి!**
**సరసిజగర్భాది మౌని సన్నుత చరితా!**
**మురభంజన! సురరంజన!**
**వరదుడవగు నాకు భక్తవత్సల! కృష్ణా! 56**

కృష్ణా! పురుష+ఉత్తమ=పురుషుల కంటె శ్రేష్ఠుడా! భక్తవత్సల = భక్తులపట్ల ప్రేమగలవాడా! లక్ష్మీపతి = లక్ష్మీనాథా! సరసిజ గర్భ=బ్రహ్మ, ఆది=మొదలైన, మౌని=మునులచేత, సన్నుత=కొనియాడబడిన, చరితా= నడవడి గలవాడా! ముర=మురుడను పేరుగల రాక్షసుని, భంజన=సంహరించినవాడా ! సుర -

రంజన = దేవతలను సంతోషపరచువాడా! నాకు వరదుడవు +అగుము = పరమిచ్చెడివాడవు అగుము.

పురుషోత్తముడనగా పురుషులకంటె ఉత్తముడని అర్థము. శ్రీకృష్ణ భగవానుడు గీతలో తన పేరు పురుషోత్తముడని స్వయంగా చెప్పుకొన్నాడు. పురుషోత్తముడు అను పదబంధము షష్ఠీసమాసమైనప్పటికి, గీతలో శ్రీకృష్ణ వాక్యం వల్ల ఆది పంచమీ సమాసమైనదని శ్రీశంకరభగవత్పాదులు వివరించియున్నారు.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరః సర్వాణి భూతాని కూటస్థో உక్షర ఉచ్యతే గీత 15అ.-16శ్లో
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోక త్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః గీత 15అ.-17శ్లో
యస్మాత్ క్షర మతీతో உ హ మక్షరాదపి చోత్తమః,
అతో உస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః గీత 15అ.-18శ్లో

లోకంలో క్షరుడనీ అక్షరుడనీ ఇద్దరు పురుషులున్నారు. క్షరుడనగా బద్ధాత్మ. అక్షరుడనగా ముక్తాత్మ. క్షరుడు జ్ఞాన సంకోచాలు కలవాడు. అక్షరుడు సంకోచాలు లేకుండా సర్వదా జ్ఞానాకారుడై ప్రకాశించేవాడని అర్థము. అట్టి వానిని కూటస్థుడంటారు. కూటమువలె నిర్వికారంగా ఉండినవాడు. అత డక్షరుడు.

పరమాత్ముడు నిర్వికారుడు. సర్వనియంత, సర్వాంతర్యామి. లోకత్రయ సర్వాన్ని ఆక్రమించినవాడు. అతడే ఉత్తమపురుషుడు. అనగా క్షర-అక్షర ఆత్మలకంటె ఉత్కృష్టుడు అగుటచేత వేదములందు, లోకములందు, శ్రీకృష్ణభగవానుడు పురుషోత్తముడుగా కీర్తింపబడినాడు.

"పురుషం పూర్ణ నిరుపాధిం" పూర్ణ పురుషుడు భగవానుడు. ప్రకృతికే ముఖ్యమైన ఉపాధి అయినవాడు పురుషుడు అని అర్థము. "పురి శరీరే శేతే" శరీరమునందు శయనించువాడు అనియు, "పురా ఆసీత్" సృష్ట్యాదినుండి శాశ్వతంగా ఉండినవాడు అనీ పురుషశబ్దానికి రెండు వ్యుత్పత్తులున్నాయి.

"పురి శేతే" "పురా ఆసీత్ పురుషః" అను వ్యుత్పత్తులు రెండును శ్రీకృష్ణ భగవానునికే అన్వయమగుచున్నవి.

" త్వమాద్యః పురుషః సాక్షాదీశ్వరః ప్రకృతేః పరః" -శ్రీమద్భా. 1-7-23

నీవు ప్రకృతికంటె పరుడవైన ఆదిపురుషుడవు. సాక్షాత్తు పరమేశ్వరుడవు. నిరుపాధియనగా నిర్విశేషపరబ్రహ్మమని అర్థము. ఈ జగత్తునకు నిమిత్త-ఉపాదాన కారణభూతుడు పరమ పురుషుడు. "పురుష ఏ వేదం సర్వమ్" ఆ పురుషుడు సకలరూపాలతో విహరిస్తుంటాడని శ్రుతి.

గీతలో "మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ, మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ". "మామేభ్యః పరమవ్యయమ్" "ధనంజయా, నా కంటె గొప్పది లేదు; దారానికి మణులవలె, ఈ సర్వము నాయందు లగ్నమై ఉన్నది" అని నన్ను వీటికి అతీతునిగా, అవినాశిగా తెలుసుకో" అని చెప్పబడినది. అనగా ఎవ్వనిలోపల సర్వభూతములును అంతర్గతములై ఉన్నవో, పరుడైన ఏ పురుషుని చేత ఈ సమస్తజగత్తు వ్యాప్తమైయున్నదో ఆ పరమపురుషుడు - అనగా పురుషోత్తముడు నేనని శ్రీకృష్ణభగవానుడన్నాడు.

ఆ పురుషుడు అనన్య భక్తిచేతనే లభ్యుడని గీత చెబుతున్నది. బద్ధముక్త జీవులకంటె విలక్షణుడైన శ్రీకృష్ణభగవానుని దివ్యమైన జన్మ కర్మలీలాదులను చక్కగా తెలిసికొన్నవాడు "వాసుదేవుడే సర్వము" అని గ్రహించినవాడై జగత్తత్త్వమును, లేదా భగవత్తత్త్వమును, లేదా శ్రీకృష్ణతత్త్వమును లెస్సగా ఎరిగినవాడగును. గీతలో ఈ విషయము గుహ్యతమమైనదిగా చెప్పబడినది.

గీత 15వ అధ్యాయమందలి ఈ గుహ్యతమమైన విషయం వల్ల భగవంతుని గూర్చి ఇతరవాదాలన్నీ ఖండింపబడినవి అవుతాయి.

బ్రహ్మమే వికారం చెందుతున్నదనే వివర్తవాదము, బ్రహ్మమే జనన మరణాదులు పొందుతున్నదనే వాదము, అవ్యక్తవాదము, మాయావాదము, శూన్యవాదము అన్నీ ఈ పురుషోత్తమయోగం చేత వీగిపోయినవి. శ్రీకృష్ణుడే

పరబ్రహ్మము, పరమాత్ముడు, భగవానుడు అను నిశ్చయజ్ఞానము కలిగిస్తుంది పురుషోత్తమ యోగం.

శ్రీకృష్ణుడు పురుషోత్తముడు అతడే లక్ష్మీనాథుడు. అతడే చతుర్ముఖుడగు బ్రహ్మచే, వేదాలచే నుతింపబడినవాడు.

మురభంజనుడు:- మురాసురుడు పంచశిరస్కుడైన ఒక దైత్యుడు. నరకాసురునికి మిత్రుడు. శ్రీకృష్ణుడు నరకుని ప్రాగ్జ్యోతిషనగరం పైకి దండెత్తినపుడు మురాసురుడు శ్రీకృష్ణుణ్ని ఎదిరించాడు. శ్రీకృష్ణుడతనిని తన సుదర్శన చక్రంతో ఖండించాడు. అది చూచి మురాసురుని కుమారులు ఏడువేలమంది శ్రీకృష్ణునితో పోరాడటానికి రాగా, గరుత్మంతుడు విజృంభించి, వారిని తన ముక్కుతోను, కాళ్లతోను రక్కి, ఱెక్కలగాడ్పులతో వారిని చిందరవందర చేసి సంహరించాడు. మురుని చంపినవాడు కనుక శ్రీకృష్ణునికి 'మురారి' 'మురభంజనుడు' అను నామాలు ఏర్పడ్డాయి.

**క్రతువులు తీర్థాటనములు**
**వ్రతములు దానములు సేయవలెనా? లక్ష్మీ**
**పతి! మిము దలచినవారికి**
**అతులిత పుణ్యములు గలుగు టరుదా? కృష్ణా! 57**

కృష్ణా! లక్ష్మీపతి=లక్ష్మీనాథా! క్రతువులు=యజ్ఞములు, తీర్థ+అటనములు= పుణ్యతీర్థముల యందు తిరుగుటలు, వ్రతములు=భగవంతునికి సంబంధించిన నోములు, దానములు= ధనాది దానములు, మొదలైనవి చేయవలెనా? మిము, తలచినవారికి = స్మరించిన వారికి, అతులిత= సాటిలేని, పుణ్యములు, కలుగుట, అరుదా?= ఆశ్చర్యమా?

కృష్ణా! లక్ష్మీరమణా! నిన్ను స్మరించినచో చాలును. యజ్ఞములు, తీర్థయాత్రలు, వ్రతములు, దానములు చేయనవసరములేదు. వాటి వలన కలుగు పుణ్యములు నీ స్మరణ మాత్రమున కలుగును. ఇందు ఆశ్చర్యమేమున్నది?

"యజ్ఞయాగాదులు, కూపవాటికానిర్మాణాదులు (= నూతులు

త్రవ్వించటం, తోటలు వేయించటం మొదలయినవి) ఎన్ని చేసినప్పటికి ఏమి ప్రయోజనమున్నది? అవి భవబంధాలకు కారణాలే అవుతాయి. కాని, శ్రీకృష్ణుని స్మరిస్తే అవి ఏవియు చేయనక్కరలేదు. భవబంధాలు తొలగిపోతాయి" అని "బోధాయన సంహిత".

"ఇష్టాపూర్తాని కర్మాణి సుబహూని కృతాన్యపి
భవే హేతూని తాన్యేవ హరే ర్నామ తు ముక్తిదమ్"

**స్తంభమున వెడలి దానవ**
**డింభకు రక్షించునట్టి రీతిని వెలయన్**
**అంభోజనేత్ర జలనిధి**
**గంభీరుడ నన్ను గావు కరుణను కృష్ణా! 58**

కృష్ణా! జలనిధి గంభీరుడ=సముద్రమువలె గంభీరమైనవాడా! అంభోజనేత్ర= పద్మముల వంటి నేత్రములు గలవాడా! స్తంభమున= కంబములో నుండి వెడలి, దానవ డింభకున్=హిరణ్యకశిపుడనురాక్షసుని శిశువును, రక్షించు నట్టి, రీతిని= విధముగా, కరుణన్= దయతో, నన్ను కావుము= నన్ను రక్షింపుము.

ఓ కమలాక్షా! సముద్రగంభీరా! దనుజకుమారుని రక్షించుటకై నీ సర్వాంతర్యామిత్వమును లోకమునకు చాటితివి. ప్రహ్లాద బాలుని ప్రేమతో, దయతో కాపాడినట్లుగా నన్ను రక్షించుము.

"అంభోజనేత్ర" పద్మాలవంటి కన్నులు గలవాడు శ్రీకృష్ణుడు. ఆశ్రితుల శ్రమను తొలగించే రమణీయమైన నేత్రాలు గలవాడు. శ్రీహరిని పుండరీకాక్షుడని శ్రుతులు వర్ణించినవి. వైకుంఠవాసులకై తెల్లతామర పూలవంటి నేత్రాలు గలవాడు; విష్ణువు. "దివీవ చక్షురాతతమ్" అని పురుషసూక్తము.

**శతకోటి భాను తేజా!**
**యతులిత సద్గుణ గణాఢ్య! అంబుజనాభా!**
**రతినాథజనక! లక్ష్మీ**
**సతిహిత! నునుగావు భక్తసన్నుత! కృష్ణా! 59**

కృష్ణా! శతకోటి భానుతేజా! = నూరుకోట్లుసూర్యుల యొక్క తేజస్సువంటి తేజస్సు కలవాడా! అతులిత= సాటిలేని, సద్గుణ-గణ+అఢ్య= సద్గుణ సమూహముల చేత సంపన్నుడైనవాడా! అంబుజనాభా= తామరపూవు బొడ్డునందు గలవాడా! రతినాథ= మన్మథుని యొక్క, జనక = తండ్రీ! లక్ష్మీసతిహిత= లక్ష్మీదేవికి ఇష్టమైనవాడా! భక్తసన్నుత= భక్తులచేత స్తుతింపబడువాడా!, నను గావుము = నన్ను రక్షింపుము.

శతకోటి సూర్యుల తేజస్సు కలిగి, సకల సద్గుణాలతో శోభిల్లుతూ, మన్మథునికి తండ్రివై, లక్ష్మీదేవికి భర్తవై, భక్తులకు స్తవనీయుడవైన శ్రీకృష్ణా! నన్ను రక్షింపుము.

పద్మపురాణంలో కూడా శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమున్నది. అందు భగవంతుని దశావతార ప్రసక్తి విశేషంగా కనిపిస్తుంది.

అనంతకీర్తిర్ నిఃసీమ పౌరుషః సర్వమంగళః
సూర్యకోటిప్రతీకాశో యమకోటిదురాసదః
కందర్పకోటిలావణ్యో దుర్గాకోట్యరిమర్దనః
సముద్రకోటి గంభీరస్తీర్థకోటిసమాహ్వయః
బ్రహ్మకోటిజగత్స్రష్టా వాయుకోటిమహాబలః
కోటీందుజగదానందీ శంభుకోటిమహేశ్వరః
కుబేరకోటిలక్ష్మీవాన్ శక్రకోటివిలాసవాన్
హిమవత్కోటినిష్కంపః కోటిబ్రహ్మాండవిగ్రహః
కోట్యశ్వమేధపాపఘ్నో యజ్ఞకోటిసమార్చనః
సుధాకోటిస్వాస్థ్యహేతుః కామధుక్కోటికామదః

"శేషుడు, శారదయు వర్ణింపలేని కీర్తిగలవాడు. అసీమమైన పురుషార్థాలు గలవాడు. అమిత పరాక్రమశాలి, సర్వజీవులకు మంగళం కలిగించువాడు. మంగళ స్వరూపుడు, కోటిసూర్యులతో సమానమైన తేజస్సుగలవాడు. కోటి యములకును దుర్ధర్షుడైనవాడు.

కోటి మన్మథులతో సమానమైన మనోహర కాంతి గలవాడు. కోటి దుర్గాదేవులతో సమానంగా శత్రువులను మర్దించేవాడు, కోటి సముద్రాలతో సమానమైన గాంభీర్యం కలవాడు. కోటి తీర్థాలతో సమానమైన పవిత్రనామాలు కలవాడు.

కోటి బ్రహ్మలతో సమానంగా లోకాలను సృష్టించేవాడు, కోటి వాయువులతో తుల్యమైన మహాబలం కలవాడు, కోటి చంద్రులతో సమానంగా జగత్తునకు ఆనందం కలిగించేవాడు, కోటి శంభులతో సమానమైన మహైశ్వర్యశాలి.

కోటి కుబేరులతో సమానమైన సంపత్తి గలవాడు, కోటి ఇంద్రులతో సమానమైన విలాససాధనాలుగల పరిపూర్ణుడు. కోటి హిమాలయాలతో సమానంగా అచలుడు, తన మూర్తితో కోటి బ్రహ్మాండాలను ధరించిన మహావిరాడ్రూపుడు.

కోటి అశ్వమేధ యజ్ఞాలతో సమానమైన పాపనాశకుడు, ఆయనకు చేయు పూజ కోటి యజ్ఞాలతో సమానమవుతుంది. కోటి కోటి అమృతాలతో సమానంగా స్వాస్థ్య రక్షణ చేయగలవాడాయన. కోటి కామధేనువులతో సమానంగా భక్తుల కోర్కెలను తీర్చేవాడు'' అని పద్మపురాణాంతర్గత శ్రీవిష్ణు సహస్రనామాలలో శ్రీకృష్ణుడే వర్ణింపబడినాడు.

**మందుడ నేదురితాత్ముడ**
**నిందల కొడిగట్టినట్టి నీచుని నన్నున్**
**సందేహింపక కావుము**
**నందుని వరపుత్ర! నిన్ను నమ్మితి కృష్ణా! 60**

కృష్ణా! నందుని వరపుత్ర=నందరాయనికి వరప్రసాదమైన కుమారుడా! నిన్ను నమ్మితి; మందుడను= జడుడను, దురితాత్ముడను= పాపాత్ముడను, నిందలకు= దూషణములకు, ఒడిగట్టినట్టి= పూనుకొన్న, నీచుని= అధముని, నన్నును సందేహింపక= సంశయింపక కావుము.

కృష్ణా! నేను జడుడను, పాపాత్ముడను, నీచుడను. ఇతరులను నిందించువాడను, నిన్ను నమ్ముకొంటిని. సందేహింపక నన్ను రక్షింపుము.

ఈ పద్యం రచించడానికి ఈశతక కర్తకు స్ఫూర్తి నిచ్చిన సంస్కృత శ్లోకం ఆళువందారు స్తోత్రంలో ఉన్నది. ఈ కవి ఆ స్తోత్ర రత్నాన్ని నిత్యము పఠించిన వాడని ఈశతకంలో అనేక పద్యాలు సాక్ష్యమిస్తున్నవి. అందొకటి.

అమర్యాదః క్షుద్ర శ్చలమతి రసూయాప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః
నృశంసః పాపిష్ఠః కథమహమితో దుఃఖజలధేః
అపారా దుత్తీర్ణ స్తవపరిచరేయం చరణయోః

ఆళువందారు స్తోత్రం - 92

'అమర్యాదుడు' తన వేషమునకు, వాక్కునకు, వృత్తికి, వయస్సునకు విరుద్ధమైన ప్రవర్తన గలవాడు, శ్రుతికి స్మృతికి, అభిజనులకు విరుద్ధమైన నడవడి గలవాడు అమర్యాదుడు.

'క్షుద్రుడు' హేయకార్యాల పట్ల ఆసక్తి గలవాడు. 'చలమతి' శాస్త్రము నందు అప్రతిష్ఠితమైన మనస్సుగలవాడు. 'అసూయా ప్రసవభూ' సుగుణాలపట్ల దోషావిష్కరణ చేయువాడు. 'కృతఘ్నుడు' చేసిన మేలు మరచువాడు. 'దుర్మాని' తాను భోగిని, త్యాగిని, ప్రభువును అని గర్వించువాడు. 'స్మరపరవశుడు' ధర్మానికి విరుద్ధమైన కామభోగలోలుడై విహ్వాలించువాడు. 'వంచనపరుడు' పరధనాదులను అపహరించడానికి దంభవృత్తితో, స్వదోషాలను కప్పిపుచ్చుకొని "ధర్మధ్వజుడు"గా పైకి కన్పించేవాడు. "నృశంసుడు" వ్యాఘ్రాదుల వలె క్రూరుడు. **"పాపిష్ఠః" మహాపాపియైన నన్ను అంతులేని ఈ దుఃఖసముద్రం నుంచి** తరించడానికి ఓస్వామీ! నీచరణసేవ తప్ప మరొక ఉపాయం లేదు.

నిన్ను నమ్ముకొంటిని. నీవే ఈపాపిని రక్షింపవలయును అని భక్తుడు ప్రార్థించడానికి గీతలోని శ్రీముఖోక్తులే ఊతమిస్తున్నాయి.

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. (గీత. 4-36)

నీవు పాపాత్ములందరిలో మహాపాపాత్ముడవైనప్పటికి భగవద్జ్ఞానమనెడి

పడవచే దుఃఖసముద్రాన్ని దాటగలవు.

అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యక్ వ్యవసితో హి సః (గీత. 9-30)

ఎంతటి దురాచారుడైనప్పటికి అనన్యప్రయోజనంగా (మరొక విధానమేదీ లేదను నిశ్చయ జ్ఞానంతో) ఎవడు నన్ను సేవిస్తాడో అతడే సజ్జనుడవుతున్నాడు. అతని నిశ్చయమే సరియైనది.

అట్టివాడు వెంటనే ధర్మ నిష్ఠగలవాడై శాశ్వతమైన శాంతిని పొందుతాడు. నా భక్తుడు ఎన్నటికి క్షతినొందడని ఓ అర్జునా! నీవు ప్రతిజ్ఞాపూర్వకంగా చాటి చెప్పుము. "అపి పాపేష్వభిరతా మద్భక్తాః పాండు నందన, ముచ్యంతే పాతకైః సర్వైః పద్మ పత్ర మివాంభసా" నా భక్తుడైనవాడు సర్వపాపాల నుండి తామరాకు మీది నీటి బొట్టు వలె విముక్తుడవుతాడని శ్రీవైష్ణవధర్మశాస్త్రంలో ఉంది.

అశ్వమేధశతై రిష్ట్వా వాజపేయశతేన చ
న ప్రాప్నువంతి సుగతిం నారాయణపరాఙ్ముఖాః
యే నృశంసా దురాత్మానః పాపాచారరతా స్తథా
తేపి యాంతి పరంధామ నరా నారాయణాశ్రయాః
- శ్రీనృసింహ పురాణం

అశ్వమేధయాగాదులు ఎన్నిచేసినను నారాయణ పరాఙ్ముఖులు సుగతిని పొంచజాలరు. నృశంసులైనను, దురాత్ములైనను, పాపాచారరతులైనను నరులు శ్రీమన్నారాయణుని ఆశ్రయించినవారైతే పరంధామాన్ని పొందుతారు.

"నిర్దోషం విద్ధి తం జంతుం ప్రభావా త్పరమాత్మనః"
శ్రీకృష్ణభగవానుని ప్రభావంతో జీవుడు దోషరహితుడవుతాడు.

మేరుమందర మాత్రోపి రాశిః పాపస్య కర్మణః
కేశవం వైద్యమాసాద్య దుర్వ్యాధిరివ నశ్యతి.

పాపిష్ఠుని పాపకర్మలు మేరుమందర పర్వతాలంత పెద్దవైనను, శ్రీకృష్ణుడను వైద్యునివల్ల తొలగిన దుర్వ్యాధుల వలె నశించి పోతాయి.

సకృత్ స్మృతోపి గోవిందో నృణాం జన్మశతై శ్చితం
పాపరాశిం దహత్యాశు తూలరాశి మివానలః

గోవిందుని మనసార స్మరించినవారి పాపరాశి అది అనేక జన్మలనుండి సంక్రమించినదైనను దూదిరాశివలె వెంటనే దగ్ధమై పోతుంది. పాపకృత్యాలు చేసి భగవన్నామంతో ఆ పాపాన్ని పోగొట్టుకొనవచ్చు నని మాటిమాటికి పాపాలు చేసేవాడు మహాపరాధి అవుతాడు. అట్టివాడు పాపిష్ఠులలో మహాపాపిష్ఠి కాగలడు. భగవన్నామాపరాధాలలో ఇది ఒకటి. భవిష్యత్తులో ఎట్టి పాపం చేయనని దృఢప్రతిజ్ఞ చేసి, పాపాల పొంతపోనివానినే భావగ్రాహి అయిన శ్రీకృష్ణుడు (భావగ్రాహీ జనార్దనః) ఆదరిస్తాడని గ్రహింపవలయును.

**గజరాజ వరద! కేశవ!**
**త్రిజగత్కల్యాణమూర్తి! దేవ! మురారీ!**
**భుజగేంద్రశయన! మాధవ!**
**విజయాప్తుడ నన్ను గావు వేగమె కృష్ణా! 61**

కృష్ణా! గజరాజవరద= గజేంద్రునికి వరము నిచ్చినవాడా! కేశవ= త్రిమూర్తి స్వరూపుడా! త్రిజగత్= ముల్లోకములకు, కళ్యాణమూర్తి= మంగళములనొసగు రూపము గలవాడా! దేవ= క్రీడించువాడా! ముర+అరి= మురుడను దానవునికి శత్రువైనవాడా! భుజగ+ఇంద్ర శయన= శేషుని మీద పరున్నవాడా! మాధవ= లక్ష్మీనాథా, విజయ+అప్తుడ= అర్జునునికి ఆప్తుడవైనవాడా, వేగమె= సత్వరముగా, నన్ను కావుము.

గజేంద్రుని రక్షించినవాడా! ముల్లోకాలకు మంగళముల చేకూర్చు రూపలావణ్యాలు కలవాడా! రాక్షస సంహారీ! శేషశాయీ! అర్జునునకు ఆప్తుడైన శ్రీకృష్ణా! నన్ను వేగమే రక్షించుము.

భాగవత కథలలో గజేంద్రమోక్షానికి అత్యంతప్రాధాన్యమున్నది. ప్రాతఃకాలాన గజేంద్రస్తుతిని ముక్తికాంక్షులు పఠించడం సంప్రదాయము.

క్షీరసాగరమందు ఆదిశేషునిపై శయనించిన వాడు, గజేంద్రుని

రక్షించినవాడు, లక్ష్మీనాథుడైనవాడు అర్జునునికి ఆప్తుడైన శ్రీకృష్ణుడేయని చెప్పి, ఈకవి శ్రీవిష్ణుకృష్ణులకు అభేదాన్ని లోకానికి చాటిచెప్పిన వాడైనాడు.

**గోపాలకృష్ణ! మురహర!**
**పాపాలను పారద్రోలు ప్రభుడవు నీవే**
**గోపాలమూర్తి! దయతో**
**నా పాలిట గలిగి ప్రోవు నమ్మితి కృష్ణా! 62**

కృష్ణా! గోపాలకృష్ణ= గోలోకమును పాలించు శ్రీకృష్ణా! మురహర= మురాసురుని సంహరించినవాడా! గోపాలమూర్తి= గోపకుని ఆకారముగలవాడా! పాపాలను పారదోలు ప్రభుడవు, నీవు. నిశ్చయముగా నమ్మితిని. నాపాలిట గలిగి= నాయెడ దయ గలిగి, ప్రోవుము= కాపాడుము.

ఓ గోపాలకృష్ణా! గోపాలమూర్తీ! నాపాపములను నశింపజేయు ప్రభుడవు నీవేయని నిశ్చయముతో విశ్వసించితిని. నాయెడ దయకలిగి నన్ను రక్షింపుము.

భూతాత్ముడు గోపాలుడు. సకల జీవులలోను అంతర్యామి రూపంతో దాగి ఉండినవాడు గోపాలుడు. "ఓం యోఽసౌ భూతాత్మా గోపాలః" సర్వత్ర వ్యాపకుడు. సమస్త ప్రాణుల అంతరాత్మ, సర్వకర్మలకు అధ్యక్షుడు. ఫలప్రదాత, స్వామి గోపాలుడు. సమస్త భూతాలకు నివాస స్థానమతడు. సర్వసాక్షియు, చైతన్య స్వరూపుడును, కేవలము "నిర్గుణుడు" అనగా ప్రకృతికి అతీతుడని గోపాలోత్తరతాపనీయోపనిషత్తు చెబుతున్నది. గోపాల పూర్వతాపనీయోపనిషత్తు గోపాలుడు శ్రీకృష్ణుడని తెలుపుతున్నది.

కృష్ణ శబ్దానికి అర్థము ఈ ఉపనిషత్తునందు వివరింపబడినది.

"కృషిర్భూవాచకః శబ్దో ణశ్చ నిర్వృతివాచకః
తయోరైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే"

కృష్ శబ్దము సత్తావాచకము. 'ణ' ఆనందబోధకము. ఈరెండు శబ్దాలు ఐక్యమొంది, సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మము శ్రీకృష్ణనామంగా ప్రతిపాదింపబడింది.

సచ్చిదానంద రూపాయ కృష్ణాయాక్లిష్టకారిణే
నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే

అనాయాసంగా సమస్తకార్యాలను చేసే సచ్చిదానంద స్వరూపునికి, వేదాంతం ద్వారా ఎరుగదగినవానికి (వేదవేద్యునికి) సమస్తబుద్ధిమత్తకు సాక్షి అయినవానికి, సమస్త విశ్వానికి గురువైనవానికి సాదర నమస్కారము.

**దుర్మతిని మిగుల దుష్టపు**
**కర్మంబులు చేసినట్టి కష్టుడ నన్నున్**
**నిర్మలుని జేయవలె ని**
**ష్కర్ముడ నిను నమ్మినాడ కావుము కృష్ణా! 63**

కృష్ణా! దుర్మతిని=దుష్టమైన బుద్ధితో, మిగుల=అధికముగా, దుష్టపు కర్మంబులు చేసినట్టి=చెడుపనులు చేసినట్టి, కష్టుడన్=కఠినుడను, నన్ను, నిర్మలుని= పాపములు లేనివానినిగా, చేయవలె. నిష్కర్ముడను=సత్కార్యములు ఏవియు చేయనివాడను నిను, నమ్మినాడ=నమ్మినవాడను. కావుము=రక్షింపుము.

కృష్ణా! నేను దుర్బుద్ధితో ఎన్నియో చెడ్డ పనులు చేసినవాడను. కఠినుడను. ఎట్టి నూతన సత్కర్మలను చేసినవాడను కాను. నిన్ను నిక్కముగా నమ్మియుంటిని. నన్ను ఏ పాపము లేనివానినిగా, అనగా పవిత్రునిగా చేయుము.

మనుష్యుడు తాను చేసిన పాపాలను గుర్తు పెట్టుకోవాలి. అందుకు తాను పరితపించాలి. కాని, తాను చేసిన పుణ్యాలను ఏకరువు పెట్టుకోకూడదు. అది అహంకారాన్ని పెంచుతుంది. అహంకారి భగవంతునికి దూరమవుతాడు.

పాపాలు చేసినవాడు దీనుడవుతాడు. భగవంతుణ్ని దీనరక్షకుడు అనీ దర్పహారి అనీ అంటారు. దర్పరక్షకు డనరు. దర్పాభిమానాలు కలవారెందరో ఈజగత్తులో పతితులై భ్రష్టులైనారు.

"అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః" - గీత 9-30

ఎంతటి దురాచారి అయినా నన్ను అనన్యభక్తితో భజిస్తే నేనతణ్ని ఉద్ధరిస్తానన్నాడు శ్రీకృష్ణుడు. పూర్తిగా దురాచారి అయినవానికి లోకంలో ఎవ్వరు

సహాయపడరు. ఆసంగతి అతడు తెలుసుకొని తనకు దిక్కు భగవంతుడే అను నిశ్చయబుద్ధితో, సంపూర్ణవిశ్వాసంతో భగవంతునికి శరణాపన్నుడవుతాడు. అతని ఆచరణ పరిశుద్ధ మవుతుంది. అతడు సాధువవుతాడు. తాను కేవలం భగవంతునికి చెందినవాడనని విశ్వసిస్తాడు. భగవదనుగ్రహానికి శీఘ్రంగా పాత్రుడవుతాడు.

చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోడానికి మూడుమెట్లు ఎక్కవలసి ఉంటుంది. అందులో మొదటిది ఆత్మగ్లాని; రెండవది మరెప్పుడు పాపం చేయను అనే నిశ్చయబుద్ధి; మూడవది ఆత్మశుద్ధి.

**దుర్వార చక్రధర కర!**
**శర్వాణీ భర్తృ వినుత! జగదాధారా!**
**నిర్వాణనాథ! మాధవ!**
**సర్వాత్మక! నన్నుఁగావు సరగున కృష్ణా! 64**

కృష్ణా! దుర్వారచక్ర-ధర-కర= నివారింపశక్యముకాని, సుదర్శనచక్రము ధరించిన చేయిగలవాడగా! ఓ చక్రపాణీ! శర్వాణీ-భర్తృ వినుత= పార్వతీపతియైన శివునిచేత స్తుతింపబడినవాడా! జగత్+అధారా= విశ్వమునకు ఆధారమైనవాడా! నిర్వాణనాథ=మోక్షమునకు అధిపతివైనవాడా! మాధవ= లక్ష్మీనాథా! సర్వ+ఆత్మక= సర్వమునకు ఆత్మయయినవాడా! సరగునన్= వేగముగా, నన్ను కావుము.

మహాజ్వాలామయమైన సుదర్శన చక్రము చేతబట్టి, ఈశ్వర సన్నుతుడై విశ్వపతియై, మోక్షమొసంగువాడై, సర్వాంతర్యామియై శోభిల్లు ఓకృష్ణా! నన్ను వేగముగ కాపాడుము. (విష్ణువు కుడిచేత ప్రకాశించు ఈ ఆయుధము శత్రువులకు దుర్దర్శమైనదైనను ఆశ్రితులకు సుదర్శనము).

శ్రీమన్నారాయణుని అసాధారణమైన చిహ్నాలు శంఖచక్రాలు. శంఖాన్ని పాంచజన్యమంటారు. చక్రాన్ని సుదర్శనమంటారు. భగవంతుని నిత్యసాన్నిధ్యం అనుభవించే ఈ ఆయుధాలు, ఆభరణాలు పరమచైతన్యాలు, స్వయంప్రకాశాలు. ఇవి భగవంతుని కనుసన్నలలో మెలగుతూ భగవదాదేశాన్ని, సంకల్పాన్ని అనుసరించి ప్రవర్తిస్తుంటాయి.

**సుత్రామనుత! జనార్దన**
**సత్రాజిత్తనయనాథ! సౌందర్యకళా**
**చిత్రావతార! దేవకి**
**పుత్రా! ననుఁగావు నీకు పుణ్యము కృష్ణా! 65**

కృష్ణా! సుత్రామనుత=దేవేంద్రుని చేత స్తుతింప బడినవాడా! జనార్దన= భక్తులకు విరోధులైన వారిని నిరసించువాడా! సత్రాజిత్-తనయ-నాథ= సత్రాజిత్తు కుమార్తె అయిన సత్యభామకు భర్త అయినవాడా! సౌందర్య కళా= సౌందర్య కళలతో, చిత్ర= అద్భుతమగు, అవతార= అవతారము గలవాడా! నను కావుము, నీకు పుణ్యముండును.

గోవర్ధనోద్ధరణంలో ఇంద్రుని గర్వమణచి, అతనిచే స్తుతింపబడినవాడా! భక్తులకు విరోధులైనవారిని నశింపజేయువాడా! సత్యభామకు పతియైనవాడా! దేవకీదేవికుమారా! దీనుడనగు నన్ను రక్షింపుము. నీకు పుణ్యముండును.

దేవేంద్రుడు శ్రీకృష్ణభగవానుని స్తుతించిన సందర్భాలు పురాణాలలో పెక్కులున్నవి. సర్వపురాణశిరోమణియైన శ్రీమద్భాగవతంలో ఇంద్రుడు తొలిసారిగా బాలకృష్ణుని స్తుతించినది గోవర్ధనోద్ధరణ లీలలోనే.

వ్రజవాసులు ప్రతిసంవత్సరం ఇంద్రయాగం చేస్తుంటారు. ఇంద్రుడు వర్షాలను కురిపిస్తాడనీ, వర్షంతో పంటలు పండుతాయనీ, పశువులకు గ్రాసం లభిస్తుందనీ, పాడిపంటలకు తరగుండదనే విశ్వాసంతో వేడుకగా ఇంద్రయాగం చేయ తలపెట్టారు. వారి ప్రయత్నం శ్రీకృష్ణుడెరిగి ఇంద్రుణ్ని ఎందుకు పూజించాలి? అంతా కర్మాధీనమై ఉంది. ఇంద్రుడు కూడా తన కర్మకు లోబడినవాడే కనుక, ఇంద్రయాగాన్ని విరమించి, మన పశువులకు గ్రాసమిచ్చే ఈ గోవర్ధన గిరిని పూజిద్దామని నందాదులకు చెప్పాడు. అందుకు నందాదులు సమ్మతించి, తాము ఇంద్రయాగం కోసం చేసిన పిండివంటలను, పూలను, పండ్లను తెచ్చి గోవర్ధనగిరి ముందరపెట్టి పూజించారు. శ్రీకృష్ణుడు గిరిరాజావతారుడై గోపకులు నివేదించిన పదార్థాలను భుజించాడు. మరియు గోపకులతో తానును నిలిచి గోవర్ధన గిరికి నమస్కరించాడు.

ప్రతి సంవత్సరం తనకు జరిపే ఉత్సవం మానినందుకు ఇంద్రుడు వ్రజవాసులపై కోపించి ప్రళయకాల మేఘాలతో వచ్చి, వ్రజముపై కుంభవృష్టిని, రాళ్లవానను కురియించాడు. వ్రజవాసులు, గోవులు అల్లకల్లోలమయ్యాయి.

అప్పుడు శ్రీకృష్ణుడు ఆ గోవర్ధనగిరిని పెకలించి, తన చిటికెన వ్రేలిపై ధరించి, గోగోపాలకులనెల్ల ఆగిరి ఛత్రము క్రిందికి రప్పించి వారిని కాపాడాడు.

ఇంద్రు డప్రతిభుడయ్యాడు. అతని వజ్రాయుధం పనికిమాలినదయింది. ఇంద్రుని దుర్నయం తెలుసుకొని బ్రహ్మ అతణ్ని మందలించాడు. గోలోకమందలి కామధేనువు భూమిపైకి దిగివచ్చి దేవేంద్రునితో ఇట్లన్నది.

"గోపబాలకుని రూపంతో ఉన్న ఆస్వామి శ్రీమన్నారాయణుడు. శ్రీకృష్ణుడే శ్రీమన్నారాయణుడు. నేనా ప్రభువును క్షీరంతో అభిషేకింపబోతున్నాను. నీవు దురహంకారాన్ని విడిచి ఆయన పాదాలపై పడి క్షమాయాచన చేసుకో" అని ప్రబోధించింది. ఇంద్రుడు తన అజ్ఞానానికి, ఐశ్వర్య మదంతో తాజేసిన అపచారానికి ఖేదపడి వెంటనే వచ్చి శ్రీకృష్ణుని పాదాలపై పడ్డాడు.

"నిను బ్రహ్మాదు లెఱుంగ లేరు, జడతానిష్ఠుండ, లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుడన్, విపులదుర్వైదుష్యభూయిష్ఠుడన్
వినయత్యాగవరిష్ఠుడన్, కుజనగర్విశ్రేష్ఠుడన్ దేవ! నీ
ఘనలీలావిభవంబుపెంపు తెలియంగా నెవ్వడన్ సర్వగా!

అని పరిపరివిధాలుగా ప్రార్థించి, తనను క్షమింపుమని సాష్టాంగపడ్డాడు.

ఇంద్రా! నీవు ఐశ్వర్యమదంతో అంధుడవై ఉన్నావు. నీ దుర్మదాన్ని తొలగించడానికే నేను ఇంద్రయాగం మాన్పించాను. ఐశ్వర్యమదమత్తులు నన్ను మరచిపోతే వారి ఐశ్వర్యాన్ని తొలగించి వారిని సన్మార్గానికి తెచ్చి రక్షిస్తాను. కావున

"నా యాజ్ఞ సేయుచుండుము
నీ యధికారమ్మునందు నిలువు సురేంద్రా!
శ్రీయుతుడవై మదింపకు
శ్రేయంబులు గల్గు పొమ్ము సితకరి గమనా!"

అని ఆజ్ఞాపించి శ్రీకృష్ణుడు దేవేంద్రుణ్ని పంపించాడు. శ్రీకృష్ణుడు ఎవరైనదియు బ్రహ్మేంద్రాదులకు కూడా తెలియదు. బృందావనంలో గోకులంలో సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడు జరిపిన లీలలు కొన్ని ప్రకటితాలు, మరికొన్ని అప్రకటితాలు. బృందావనం భగవంతుని స్వసృష్టి. అది బ్రహ్మదేవునికి కూడా తెలియదనే విషయం బ్రహ్మచేసిన వత్సాపహరణ వృత్తాంతం తెలుపుతున్నది. గోగోపాలకులను మాయం చేసిన బ్రహ్మ, శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుడని తెలుసుకొని గతగర్వుడై తనను క్షమింపుమని వేడుకొన్నాడు. ఈ ఘట్టంలో శ్రీకృష్ణుడు ఇంద్రుని గర్వమణచాడు. రాసక్రీడలో మన్మథుని గర్వమణచాడు.

అనంతరం కామధేనువు, బ్రహ్మేంద్రమహేశ్వరాది దేవతలందరు కలిసి శ్రీకృష్ణునికి గోవింద పట్టాభిషేకం చేశారు. గోవింద పట్టాభిషేకలీల అప్రకటిత లీల. ఇంద్రుడు శ్రీకృష్ణునికి పట్టి, గోకులంలో వదలిపెట్టిన ఛత్రాన్నిచూచి గోపబాలకులు ఈఛత్రం ఎక్కడినుండి వచ్చినదని విస్మయపడ్డారు. శ్రీమద్భాగవతంలో శ్రీశుకదేవుడు శ్రీకృష్ణుని ప్రకటిత లీలలను, అప్రకటిత లీలలను చెప్పి, పరీక్షిన్మహారాజునకు సద్గతి కలిగించినవాడయ్యాడు.

'సత్రాజిత్తు' ఒక యాదవుడు. అతడు బహుకాలం నిష్ఠతో తపస్సుచేసి, సూర్యదేవుని అనుగ్రహంతో స్యమంతకమనే మణిని సంపాదించాడు. ఆ మణి మహామహిమగలది. దానిని ఉగ్రసేనుని కిచ్చినచో దేశానికి క్షేమమవుతుందని కృష్ణుడొక సందర్భంలో సత్రాజిత్తునకు చెప్పాడు. సత్రాజిత్తు అందుకు ఇష్టపడలేదు.

సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఆమణిని కంఠాన ధరించి గుఱ్ఱమెక్కి వేటకు వెళ్ళాడు. అతని కంఠంలో మెరుస్తున్న మణిని చూచి అది మాంసమనుకొని ఒక సింహం ప్రసేనుణ్ని అతని గుఱ్ఱాన్ని చంపి, ఆమణిని నోటగరచుకొని పరుగెత్తింది. ఒక గుహదగ్గర ఆ సింహం ఆమణిని నాకుతుండగా, ఋక్షరాజగు జాంబవంతుడు చూచి, ఆసింహాన్ని అవలీలగా సంహరించి, ఆమణిని తీసుకొనిపోయి తన గుహలో వ్రేలాడగట్టాడు.

ఎంతకాలానికి తన తమ్ముడు ప్రసేనుడు మణితో తిరిగి రానందువల్ల

కృష్ణుడాతనిని సంహరించి మణిని అపహరించాడని అపవాదుతో సత్రాజిత్తు శ్రీకృష్ణునికి కళంకం కలిగించాడు. ఆ దినము భాద్రపదమాస శుక్లచతుర్థి శ్రీకృష్ణచంద్రునికి ఆనాడు కళంకం కలిగింది కావున, నాటిరాత్రి చంద్రుణ్ణి ఎవ్వరు చూడకపోవడం సంప్రదాయమయింది.

శ్రీకృష్ణుడు తనకు కలిగిన కళంకాన్ని తొలగించుకోడానికి మరునాడే కొందరు యాదవులతో కలిసి ప్రసేనుణ్ణి వెదకడానికి వెళ్లాడు. ఆ అడవిలో ఒకచోట ప్రసేనుని శవం, గుఱ్ఱపు కళేబరం, మరికొంత దూరాన చచ్చిపడిన సింహాన్ని చూచి, ప్రసేనుని చంపి, మణినెవ్వరో అపహరించారని బోధపడింది. అంతటితో చాలింపక శ్రీకృష్ణుడు అక్కడున్న గుహలో ప్రవేశించాడు. అందు వ్రేలగట్టిన మణిని చూచాడు. కృష్ణుని రాక ఎఱిగి అక్కడున్న దాది కెవ్వున కేక వేసింది. అంతలో చెంగున జాంబవంతుడు దూకి శ్రీకృష్ణునిపై కలయబడ్డాడు. వారిరువురు ఇరవై ఎనిమిది దినాలు హోరాహోరిగా పోరాడారు. గుహాద్వారాన ఉన్న యాదవులు, లోనికి వెళ్లిన శ్రీకృష్ణు డెన్ని దినాలకు తిరిగిరానందుకు దుఃఖించి ద్వారకకు వెళ్లి దేవకీవసుదేవులకు ఈవిషయం తెలిపారు.

అక్కడ గుహలో శ్రీకృష్ణుని పిడికిటి పోటులకు జాంబవంతుడు ప్రాణావశిష్టుడై తెలివితెచ్చుకొని "ఓదేవా! నీవెవరవు? అలనాటి శ్రీరామచంద్రుడవు నీవుకాదా? స్వామీ! నన్ను క్షమింపు" మని శ్రీకృష్ణుని పాదాలపై పడ్డాడు.

తన భక్తుడైన జాంబవంతుని శరీరాన్ని నిమిరి శ్రీకృష్ణుడతనికి స్వస్థత కలిగించాడు. ఈ శ్రీకృష్ణుడు తన ఇష్టదైవమగు శ్రీరాముడేయని నిశ్చయించి జాంబవంతుడు తన కూతురగు జాంబవతిని, స్యమంతకమణిని ఇచ్చి శ్రీకృష్ణుణ్ణి సాదరముగా పంపించాడు.

ద్వారకలో శ్రీకృష్ణుడు జాంబవతిని పెండ్లాడి యాదవులందరు చూస్తుండగా సత్రాజిత్తునకు స్యమంతక మణిని ఇచ్చి, ఆమణి అపహరింపబడిన వృత్తాంతాన్ని వివరించి చెప్పాడు.

శ్రీకృష్ణునిపై నిందారోపణ చేసినందుకు సత్రాజిత్తు పశ్చాత్తాపంతో, తనకూతురు చక్కనిచుక్క అయిన సత్యభామను శ్రీకృష్ణునికిచ్చి వివాహం

జరిపించి, బలవద్విరోధం లేకుండ స్యమంతకమణిని కానుకగా ఇచ్చాడు. కాని, శ్రీకృష్ణుడు "నాకీ కన్యామణి చాలు, మణి అక్కరలేద"ని సత్రాజిత్తునకే ఆ మణినిచ్చాడు. ఆవిధంగా సత్రాజిత్తు తనయ అయిన సత్యభామ శ్రీకృష్ణునికి భార్య అయింది.

**బలమెవ్వడు కరిఁబ్రోవను**
**బలమెవ్వడు పాండుసుతుల భార్యను గావన్**
**బలమెవ్వడు సుగ్రీవుకు**
**బలమెవ్వడు నాకు నీవె బలమౌ కృష్ణా! 65**

కృష్ణా! కరిన్= గజేంద్రుని, ప్రోవన్= రక్షించుటకు బలమెవ్వడో, పాండుసుతుల భార్యను= పాండవులయొక్క భార్యయగు ద్రౌపదిని, కావన్= రక్షించుటకు, బలమెవ్వడో, సుగ్రీవునకు= వాలితమ్ముడగు సుగ్రీవునకు బలమెవ్వడో, వాడే నాకు కూడా బలమగువాడు.

శ్రీకృష్ణా! గజేంద్రునికి, ద్రౌపదికి, సుగ్రీవునకు నీవే బలమైతివి. నాకుకూడా నీవే తప్ప మరొక బలమేమున్నది?

గజేంద్రమోక్ష పుణ్యకథ 53వ పద్యమున తెలుపబడినది.

మహాభారతంలో ద్రౌపది చేసిన శరణాగతి ఈపద్యంలో కూడా ప్రస్తావింప బడినది. యజ్ఞసేన మహారాజగు ద్రుపదుని పుత్రిక ద్రౌపది. ఈమెకు 'కృష్ణ' అని 'యాజ్ఞసేని' అని పేర్లు కలవు.

ద్రౌపది వాస్తవానికి దేవేంద్రుని పత్ని శచీదేవి. స్వర్గలోక లక్ష్మి. భగవత్సంకల్పంతో ఆమే యజ్ఞకుండంలో అవతరించింది. యాజ్ఞసేని అయింది.

దేవదానవులకు కురుక్షేత్రంలో ఘోరయుద్ధం జరుగగలదని తెలుసుకొని దేవతాగణాలు తమతమ తేజస్సులలో పృథ్విపై అవతరింపసాగాయి. దేవేంద్రుని శరీరంలోని తేజస్సును ఆకర్షించి యమధర్మరాజు కుంతీగర్భంలో స్థాపించాడు. తత్ఫలంగా కుంతికి యుధిష్ఠిరుడు జన్మించాడు. వాయుదేవుడు ఇంద్రుని బలాన్ని ఆకర్షించి కుంతి గర్భాన ఉంచాడు. తత్ఫలితంగా భీముడు జన్మించాడు.

ఇంద్రుని అర్థాంశంతో కుంతీదేవికి అర్జునుడు అవతరించాడు. ఇంద్రుని తేజస్సును ఆకర్షించి అశ్వినీదేవతలు మాద్రిగర్భంలో స్థాపించారు. తత్ఫలితంగా మాద్రికి నకుల-సహదేవులు కవల పిల్లలు జన్మించారు. ఈ విధంగా ఇంద్రుడు అయిదుగురి రూపాలతో పృథ్విపై అవతీర్ణుడయ్యాడు.

ద్రుపదరాజు వేదవ్యాసుని వచనానుసారంగా ద్రౌపదిని పంచపాండవుల కిచ్చి వివాహం చేశాడు.

దుర్యోధనుడు పాండవులను రాజ్యభ్రష్టులను చేయదలచి కపట ద్యూతానికి ధర్మరాజును పిలిచాడు. శకుని ప్రయోగించిన మాయపాచికల మూలంగా ధర్మరాజు, రాజ్యాన్ని, తన తమ్ములను, తనను ద్యూత పణంగా ఒడ్డుకొని పోయాడు.

ద్రౌపదిని పణంగా పెట్టి జూదమాడుమని కౌరవులు ప్రోత్సహింపగా, ధర్మరా జట్లే చేసి ద్రౌపదిని కూడా కపటద్యూతంలో ఓడిపోయాడు. ఓటమిచేత పాండవులు కౌరవులకు దాసులయ్యారు. అప్పుడు ద్రౌపదిని సభకు పిలిపించి అవమానింపదలచిన కర్ణదుర్యోధనుల ప్రోత్సాహంతో దుశ్శాసనుడు అంతఃపురానికి వెళ్లి ఓదాసీ అని దుర్భాషలాడుతూ ద్రౌపదిని కొలువుకూటానికి బడబడ ఈడ్చి తెచ్చాడు.

ఇది అన్యాయము, ధర్మరాజు జూదంలో తానోడిన తర్వాత నన్ను ద్యూత పణంగా పెట్టే అధికారం ఆయనకు ఉండదని ద్రౌపది వాదించింది. సభలో న్యాయనిర్ణయం చేసి చెప్పేవారెవరూ లేరు. అప్పుడు దుర్యోధన కర్ణుల ఆదేశంతో దుశ్శాసనుడు ద్రౌపది కట్టుకొన్న చీరనులాగి ఆమెను నగ్నునుగా చేయడానికి ప్రయత్నించాడు. ద్రౌపది తన బలమంతయు చూపి దుశ్శాసనుని ప్రయత్నాన్ని నివారింప ప్రయత్నించింది. కాని, అతడు బలాఢ్యుడగుటచే ఆమె శ్రీకృష్ణుని శరణువేడి మానరక్షణము చేయుమని ఇట్లు ప్రార్థించింది.

గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ
హే నాథ! హే రమానాథ! వ్రజనాథార్తినాశన
కౌరవార్ణవమగ్నాం మా ముద్ధరస్వ జనార్దన
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన
ప్రపన్నాం పాహి గోవింద! కురుమధ్యే உవసీదతీమ్

- మహాభారతం. సభా. 68

"గోవిందా, ద్వారకలో నివసించువాడా, శ్రీకృష్ణా, గోపికలకు ప్రియుడయిన వాడా, గోపికలు ప్రియలుగా కలవాడా, కేశవా, కౌరవులు నన్ను పరాభవిస్తున్నారని నీకు తెలియదా? ఓ రక్షకా, ఓ లక్ష్మీపతి, ఓ వ్రజాధిపతి, ఓ సకలార్తి నాశకా, కౌరవులనే సముద్రంలో మునిగిపోయిన నన్ను ఉద్ధరించు. జనార్ధనా, కృష్ణా, మహాయోగీ, విశ్వస్వరూపా, ఎల్లరికీ ఆత్మ అయినవాడా, విశ్వాన్ని సృష్టించేవాడా, గోవిందా, నీశరణు చొచ్చిన నన్ను - కురుజనుల మధ్య క్షీణించుపోతున్న నన్ను రక్షించు" అని ప్రార్థించింది.

"గోపీజనప్రియ" అనగానే సర్వాంతర్యామి యగు శ్రీకృష్ణుడు సంప్రీతినొంది ద్రౌపదీ శరీరమున వస్త్రావతారుడై, మానదుడై నిలిచాడు. క్రూరకర్కశబాహుడగు దుశ్శాసనుడు బలిమి కొలది ఎంత లాగినను ఆమె చీరలు పరంపరగా వస్తూనే ఉన్నవి. ఇకలాగలేక దుశ్శాసనుడా చీరల గుట్టపై పడి మూర్ఛిల్లాడు. సభాసదులు అది పతివ్రతా మహిమమనుకొన్నారు. ధర్మరాజాదులు శ్రీకృష్ణానుగ్రహంగా భావించారు. శ్రీవిష్ణుదివ్యసహస్రనామస్తోత్రంలో "అమానీ మానదో మాన్యః" అను నామాలున్నాయి. శరణాగతురాలగు ద్రౌపది ఒడలిమీది వస్త్రం కావడంలో భగవంతుడు అభిమానపడడు కావున, ఆయన 'అమాని' అయ్యాడు. ద్రౌపది మాన సంరక్షణ చేసినవాడు కావున 'మానదు'డయ్యాడు. భక్తవాత్సల్య వివశుడై అర్జునునకు సారథ్యం వహించి ఆతని అభిమానాన్ని పెంపొందించినవాడగుట చేతను, ఉగ్రసేన మహారాజునకు, యుధిష్ఠిరునకు సార్వభౌముడను బిరుదము కలిగించుటచేతను శ్రీకృష్ణుడు మానదుడయ్యాడు. తన భక్తులకు సారథ్యాదులను

చేయుట తనకు గౌరవమని భావించువాడు కావున శ్రీకృష్ణుడు "మాన్యు" డయ్యాడు.

సుగ్రీవుడు: సీతాపహరణము జరిగిన తర్వాత శ్రీరామలక్ష్మణులు ఆమె కొరకు వెదకుచు కిష్కింధకు చేరుకొన్నారు. ఒకచోట ఆంజనేయుడు రామలక్ష్మణులను చూచి, వారి మహిమ నెఱిగి తన ప్రభువగు సుగ్రీవునకు వారిని పరిచయం చేశాడు.

సుగ్రీవుడు వాలియను వానరరాజునకు సోదరుడు. వాలి తన తమ్మునిపై కక్ష వహించి కిష్కింధానగరము నుండి తరిమి వేయగా అతడు ఋష్యమూక పర్వతంమీద హనుమదాది అనుచరులతో కాలం గడుపుతున్నాడు. హనుమంతుడు రామ సుగ్రీవులకు మైత్రి కలిగించాడు.

సుగ్రీవుడు తన దురవస్థను శ్రీరామునికి చెప్పికొని, తన భార్యను వాలి అపహరించినాడని, వాలి మహాబలశాలి యని, అతని నెదిరింపలేక ఇచ్చట పడియుంటినని దుఃఖించాడు.

శ్రీరాముడు సుగ్రీవుని రక్షింపదలచాడు. వాలిని యుద్ధమునకు రమ్మని పిలిపించాడు. వాలి సుగ్రీవులు గదాయుద్ధం చేశారు. వాలి తన తమ్ముని చంపుటకు ఉద్యుక్తుడయ్యాడు. సర్వాంతర్యామియు, సర్వభూత మనోభిజ్ఞుడునగు శ్రీరాముడిది గ్రహించి ఒక్క బాణంతో వాలిని నేలకు కూల్చి కిష్కింధారాజ్యానికి సుగ్రీవుణ్ని పట్టాభిషిక్తుని కావించాడు.

**పరుసము సోకిన యినుమును**
**వరుసగ బంగారమైన వడువున జిహ్వాన్**
**హరి! నీ నామము సోకిన**
**సురవందిత! నేను నటుల సులభుడ కృష్ణా! 67**

కృష్ణా! సురవందిత = దేవతల చేత నమస్కరింపబడిన వాడా! పరుసము= స్పర్శ మణి, సోకిన = తగిలినచో , ఇనుము= లోహము కూడా; వరుసగ = క్రమముగా బంగారమైన, వడువునన్= రీతిని, ఓ హరి= కృష్ణా! జిహ్వాన్= నాలుకయందు, నీ నామము = నీ శుభనామము సోకగానే, నేను, అటుల = ఆ

విధముగానే , సులభుడన్ = మోక్షమును సులువుగా పొందుగలవాడ నగుదును.

స్పర్శ వేది ఇనుమునకు సోకినచో ఇనుము బంగారమైనట్లుగా ఓ శ్రీహరీ! నీ శుభనామము నా నాలుకకు తాకగానే నేను కూడా సులువుగా మోక్షార్హుడనగుదును.

పరుసము = (స్పర్శ) పరుసవేది. "పరుసము సోకి లోహంబు పసిడియైన పగది" అని రుక్మాంగద చరిత్రము. పరుసవేదిని ఇనుమునకు తాకింపగా అది బంగారమగు ననుట లోకమున ప్రసిద్ధి.

"శ్రద్ధయా! హేలయా వా భృగువర నరమాత్రం తారయేత్ కృష్ణనామ" అబుద్ధి పూర్వకంగా అవహేళన చేసిన్పటికి శ్రీకృష్ణనామం ఉద్ధరిస్తుంది. అది "హేల". ఇక శ్రద్ధాభక్తులతో శ్రీకృష్ణనామాన్ని ఉచ్చరించేవారికి కలిగే సత్ఫలితాన్ని గూర్చి చెప్పనవసరం లేదు కదా!

**ఒకసారి నీదు నామము**
**ప్రకటముగా తలచువారి పాపము లెల్లన్**
**వికలములై తొలగుటకును**
**సకలాత్మ! అజామిళుండు సాక్షియె కృష్ణా! 68**

కృష్ణా! సకలాత్మ=జగత్తుకంతటికి · ఆత్మ అయినవాడా! (సర్వాత్ముడా) ఒకసారి నీదు నామము, ప్రకటముగా స్పష్టముగా, తలచువారి పాపములు + ఎల్లన్=స్మరించువారి పాపములన్నియు, వికలములై=విచ్ఛేదమొందినవై, తొలగుటకును = నశించి పోవుటకు, అజామిళుండు=అజామిళుడనువాడే, సాక్షి = సాక్షియగుచున్నాడు.

ఓ కృష్ణా! సర్వాంతరాత్మా! నీ శుభనామము నొక్కసారి మనస్ఫూర్తిగా స్మరించినంత మాత్రము చేత సకల పాపములను విచ్ఛేదమొనర్చుకొని మోక్షపదవి నొందిన అజామిళుడే మాకు సాక్షి.

అజామిళుడు భగవన్నామాభాసంతో ఉత్తమగతికి చేరుకొన్న వృత్తాంతం 5వ పద్యంలో వివరింపబడింది. నామాభాసం వల్లనే కాక, భక్త్యాభాసం

భక్త్యాభాసాపరాధం వల్లకూడా ఉత్తమగతి ప్రాప్తిస్తుందని స్కాందపురాణకథ తెలుపుతున్నది.

ఒక ఎలుక దేవాలయంలో ఉంది. భగవంతునికి దీపారాధన చేసే నేతి వత్తులను పట్టుకపోయి తింటుం దది. ఒకనాడా ఎలుక వత్తుల డబ్బీ మూత తీసి ఉండటం వల్ల, అందులోని వత్తుల కట్టను నోట గరచుకొని పోయేటప్పుడు, ఆవత్తులు దీపానికి అంటుకొని పెద్దమంట మండింది. అది తనకిచ్చిన నీరాజనంగా సర్వసుహృత్తగు భగవంతుడు స్వీకరించాడు. మండుతున్న వత్తులవల్లనే ఆఎలుక కాలి చచ్చిపోయింది.

ఆపుణ్యఫలంతో ఆ ఎలుక మరుజన్మలో ఒక మహారాజుకు రాణి అయింది. ఆమెకు గతజన్మసుకృతంవల్ల దేవాలయాలలో దీపోత్సవాలు జరిపించాలనే బుద్ధిపుట్టింది. ప్రతిదేవాలయంలోను దీపోత్సవాలను జరిపించి, ఆ రాణి సకలభోగాలను అనుభవించి వృద్ధురాలై మరణించి, వైకుంఠధామానికి చేరుకొన్నది.

ఎలుక వత్తులను ఓంగిలించడం అపరాధం. నిజానికి అది భగవంతునికి నీరాజనమివ్వలేదు. దానికి భక్తి లేదు. కాని, అది భక్త్యాభాసాపరాధమయింది. అయినా ఎలుక మహారాణి కావడం, వైకుంఠధామానికి చేరుకోవడం భక్త్యాభాసాపరాధమే పుణ్యకారణమయింది.

ఒకసారి శ్రీహరి నామమును భక్తితో స్మరించినవాడు మోక్షమును పొందుటకు అర్హుడగునని స్కాందపురాణము చెప్పుచున్నది:

"సకృదుచ్చారితం యేన హరిరిత్యక్షరద్వయం
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి"

"ఎవడైనా 'హరి' అనే రెండక్షరాలను ఒక్కసారైనా ఉచ్చరించినవాడైతే అతడు తగు సమయంలో మోక్షపదవిని చేరుకొనడానికి నడుము బిగించాడన్న మాట" అని.

ఇతర చింతలు గలవాడై, అపరిశుద్ధుడై యుండియు సదా హరినామ కీర్తన చేయువాడు, తన దోషములు నశింపజేసికొని మోక్షము పొందుననుటకు

చేదిరాజగు శిశుపాలుడే సాక్షి యగును:

అప్యన్యచిత్తోఽశుద్ధో వా యః సదా కీర్తయేత్ హరిమ్

సోఽపి దోషక్షయాన్ముక్తిం లభేత్ చేదిపతి ర్యథా.

అలసత్వమును విడిచి ఒకసారి నారాయణ నామమును ఉచ్చరించువాని అంతఃకరణము పరిశుద్ధమగును; నిర్వాణ(=మోక్ష)పదము ప్రాప్తించును.

సకృదుచ్చారయేద్ యస్తు నారాయణ మతంద్రితః

శుద్ధాంతఃకరణో భూత్వా నిర్వాణ మధిగచ్ఛతి - పద్మపురాణము

అజామిళుని వృత్తాంతము అనేక పురాణములందు ప్రసక్తమైనది. అతడు అనేక పాపములు చేసియు తన కుమారుని, నారాయణా! అని అవసానకాలమున పిలిచినమాత్రమున అతడు మోక్షము పొందుట యా కథలోని విశేషము.

నారాయణ మితి వ్యాజాదుచ్చార్య కలుషాశ్రయః

అజామిళోఽప్యగాద్ ధామ కిముత శ్రద్ధయా గృణన్

- బ్రహ్మవైవర్తము

అజామిళుడు అవసాన కాలమున తన పుత్రుని పిలుచు నెపమున 'నారాయణ' నామమును ఉచ్చరించినాడు. ఆ పుణ్యమున అతడు మోక్షమొందెను. నారాయణ నామమును శ్రద్ధాభక్తులతో ఉచ్చరించినవాని పుణ్యాతిశయము ఎంత గొప్పదో!

శ్రీహరినామమును కీర్తించుటకు ఒక సమయము, ఒక ప్రదేశము కావలయునన్న నియమము లేదు. ఎప్పుడైనను, ఎందైనను శ్రీహరిని స్మరింప వచ్చును.

మనుష్యులు శ్రీకృష్ణమంత్రం జపించడానికి దీక్షితులైతేనే ముక్తులవుతారు. ఇక సర్వదా భక్తితో శ్రీకృష్ణుణ్ని పూజించేవారిని గూర్చి చెప్పవలసినదేమున్నది?

"న దేశనియమో రాజన్ న కాలనియమ స్తథా

విద్యతే నాత్ర సందేహో విష్ణో ర్నామానుకీర్తనే

దీక్షామాత్రేణ కృష్ణస్య నరా మోక్షం లభంతి వై

కిం పునర్యే సదా భక్త్యా పూజయంత్యచ్యుతం నరాః -స్కాందపురాణం

**హరి సర్వంబున గలడని**
**గరిమను దైత్యుండు పలుక గంబములోనన్**
**ఇరవొంది వెడలి చీల్చవె**
**శరణను ప్రహ్లాదు డిందు సాక్షియె కృష్ణా! 69**

కృష్ణా! హరి = శ్రీకృష్ణుడు; సర్వంబునన్= అంతటను కలడని, గరిమను= గొప్పతనముతో, దైత్యుండు=రాక్షసుడు, పలుకన్=పలుకగా, కంబములోనన్= స్తంభములో, ఇరవొంది = నివాసము చేసికొని, వెడలి, చీల్చవె= హిరణ్యకశిపుని రొమ్మును చీల్చినాడవుగదా. ఇందు= ఇందుకు, శరణు+అను= శరణాగతుడైన, ప్రహ్లాదుడే సాక్షి.

కృష్ణా! శ్రీహరి సర్వాంతర్యామి, అనగా అంతట నిండియున్నాడని చెప్పగా, భక్తుని మాట వ్యర్థము కాకుండగా స్తంభమునుండి వెడలి హిరణ్యకశిపుని చీల్చి చంపితివి. ఇందుకు ప్రహ్లాదుడే సాక్షి.

భక్తాగ్రగణ్యుడగు ప్రహ్లాదుని చరిత్ర శ్రీమద్భాగవతమునందు హృద్యముగా వర్ణింపబడినది. పోతనగారు రచించిన ఆంధ్రభాగవతమును పఠించిన చదువరులు సంతృప్తి పొందుదురనుటలో సందేహము లేదు. మచ్చుకు రెండు పద్యములు.

కలడంబోధిఁగలండు గాలి గలడాకాశంబునం గుంభినిం
గల, డగ్నిన్ దిశలన్ పగళ్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
కల డోంకారమునన్ త్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులం దంతటన్
కల డీశుండు గలండు తండ్రి! వెదుకంగా నేల? యీయాయెడన్

ఇందుగల డందులేడని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే.

ప్రహ్లాదుని పలుకులు యథార్థము కావించుటకు,

"శ్రీనరసింహాకృతినుండె నచ్యుతుడు నానాజంగమస్థావరో

త్కరగర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్"

**భద్రార్చిత శుభచరణ! సు**

**భద్రాగ్రజ! సర్వలోక పాలన! హరి! శ్రీ**

**భద్రాధిప! కేశవ! బల**

**భద్రానుజ! నన్నుబ్రోవు భవహర! కృష్ణా! 70**

కృష్ణా! భద్ర+అర్చిత= మంగళముల చేత పూజింపబడిన, శుభ= శుభప్రదములైన చరణ= పాదములుగలవాడా! సుభద్రా+అగ్రజ= సుభద్రాదేవికి అన్నా! సర్వలోక పాలన = సమస్తలోకములను పరిపాలించువాడా! హరి= పాపములను హరించువాడా! శ్రీభద్రా+అధిప= భద్రాదేవికి భర్త అయినవాడా! కేశవ= త్రిమూర్తి స్వరూపమైనవాడా! బలభద్ర+అనుజ = బలరామునికి తమ్ముడైనవాడా! భవహర= సంసారమును హరించు ఓకృష్ణా! నన్నున్ బ్రోవు= నన్ను రక్షింపుము.

కృష్ణా! నీపాదములు శుభప్రదములు. నీవు సమస్తలోకపాలకుడవు. బలరామునకు, సుభద్రాదేవికి తోబుట్టువు, భద్రావతికి భర్తవు. భవబంధ విమోచనుడవు. నన్ను సంరక్షింపుము.

శ్రీకృష్ణునికి కుంతీదేవి కాక, మరికొందరు మేనత్తలుగలరు. శ్రుతకీర్తి అనే మేనత్త కేకయ రాజునకు పత్ని అయినది. ఆదపంతులకు జన్మించిన "భద్ర" అను కన్యను శ్రీకృష్ణుడు వివాహమాడెను.

శ్రుతకీర్తేః సుతాం భద్రాముపయేమే పితృష్వసుః

కైకేయీం భ్రాతృభిర్దత్తాం కృష్ణః సంతర్దనాదిభిః - శ్రీమద్భా 10. 58-56

సుభద్ర : వసుదేవుని పుత్రిక. బలరాముని తోబుట్టువు. శ్రీకృష్ణుని చెల్లెలు. రైవతక పర్వతమునందు బలరామాదులు జరుపుచున్న ఉత్సవమున అర్జునుడు సుభద్రను చూచెను. ఆమెను పెండ్లాడదలచెను. బలరాముడు ఇష్టపడడని తెలిసి తన ప్రేమ వృత్తాంతమును అర్జునుడు శ్రీకృష్ణునికి తెలుపుకొనెను.

సుభద్రను బలపూర్వకముగా రథమున నెక్కించుకొని పొమ్మని శ్రీకృష్ణుడర్జునునకు ఉపాయము చెప్పెను. బలరాముని ప్రేరణచే యాదవ వీరులు

అర్జునుని ఎదిరించి క్షతగాత్రులై కృష్ణబలరాముల దగ్గరికి వచ్చి అర్జునుని పరాక్రమమును వర్ణించి చెప్పిరి. అప్పుడు శ్రీకృష్ణుడు సుభద్రను అర్జునునికే ఇచ్చి విధివిహితముగా వివాహము చేయుట మంచిదని బలరామునికి తెలిపెను. బలరాముడందుకు అంగీకరించెను. ఇరువురును ఇంద్రప్రస్థమునకు వెళ్లి సుభద్రార్జునులకు వేడుకగా వివాహము జరిపించిరి.

సుభద్రార్జునులకు "అభిమన్యుడు" అను కుమారుడు చంద్రుని అంశతో జన్మించెను. అతడు మహావీరుడు. కురుక్షేత్ర యుద్ధమున ద్రోణాచార్యుడు పన్నిన పద్మవ్యూహమును ఛేదించుకొని పోయి, మహాసాహసముతో పెక్కండ్రు కౌరవయోధులను, దుర్యోధనుని పుత్రులను తెగటార్చిన వీరాధివీరుడు అభిమన్యుడు. ద్రోణ-కర్ణ-దుర్యోధనాదులు అభిమన్యుని పరాక్రమమును సహింపలేక యుద్ధనీతిని అతిక్రమించి అధర్మముగా అతనిని వధించిరి.

అభిమన్యుని మరణానికి ధర్మరాజు బోరున విలపించాడు. అభిమన్యుని మరణానికి మొదటి కారణమైన సైంధవుణ్ని ఆమరునాడే అర్జునుడు పాశుపతాస్త్రంతో సంహరించి ప్రతీకారం తీర్చుకొన్నాడు.

అభిమన్యుని భార్య ఉత్తర. ఈదంపతులకు జన్మించినవాడే భాగవత శ్రోతయయిన పరీక్షిన్మహారాజు.

**ఎటువలె కరిమొఱ వింటివి**
**ఎటువలె ప్రహ్లాదు కభయమిచ్చితి కరుణన్**
**అటువలె నను రక్షింపుము**
**కటకట నిను నమ్మినాడఁ గావుము కృష్ణా! 71**

కృష్ణా! ఎటువలె= ఏవిధంగా, కరి= గజేంద్రుని యొక్క, మొఱ= దీనాలాపాలను, వింటివో; ఎటువలె, ప్రహ్లాదునకు, అభయము= రక్షణమును, కరుణన్= దయతో, ఇచ్చితివో; అటువలె= ఆవిధంగా, ననున్ రక్షింపుము. కటకట= అయ్యయ్యో; నిను నమ్మినాడను, కావుము= కాపాడుము.

శ్రీకృష్ణా! శరణాగతుడైన గజేంద్రుని ఆర్తాలాపాలను విని, పరుగుపరుగున వచ్చి, సుదర్శన చక్రముచే మొసలిని ఖండించి గజేంద్రుని ఎట్లు రక్షించినావో,

ఈ స్తంభంలో నీదేవుడున్నాడా? లేనిచో నీశిరస్సు ఖండిస్తానని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని గద్దించినపుడు నీవు సర్వాంతర్యామివై, ఆస్తంభంలో ప్రవేశించి వెడలి హిరణ్యకశిపుని చీల్చి చెండాడి భక్తప్రహ్లాదుని ప్రేమ మీర ఎట్లు రక్షించినావో అట్లే నన్ను రక్షించు. ఓ దీనబంధూ! నేను నిన్నే నమ్ముకొన్నాను.

పరమ భాగవత దైత్యర్షి యయిన ప్రహ్లాదుని పుణ్యకథ సాహిత్యంలోను, పురాణసాహిత్యంలోను అత్యంత ప్రసిద్ధమైనది. సత్యయుగంలో శ్రీనృసింహ స్వామి ఆవిర్భావం జరిగింది. భగవంతుడు సర్వాంతర్యామియనే సత్యం జగద్విదితం చేసిన భగవదవతారమది.

**తటతట లేటికి చేసెదు?**
**కటకట పరమాత్మ! నీవు ఘంటాకర్ణున్**
**ఎటువలె నిపుణుని జేసితి**
**వటువలె రక్షింపుమయ్య! అచ్యుత! కృష్ణా! 72**

కృష్ణా! అచ్యుత= అవినాశియైన ఓ జగన్నాయకా! తటతటలు= తటపటాయించడాలు, ఏటికి చేసెదు= ఎందుకు చేస్తావు? కటకట= అయ్యయ్యో! పరమాత్మ= మరొక పరుడు నీకంటె లేనివాడవైన ఓ స్వామి! నీవు, ఘంటాకర్ణున్= ఘంటాకర్ణుడనువానిని, ఎటువలెన్= ఎలాగున, నిపుణుని = నేర్పరిని, చేసితివో అటువలె, నను, రక్షింపుమయ్య.

శ్రీకృష్ణా! నా విషయంలో ఏల జాగుచేస్తున్నావు? అయ్యయ్యో! నీవు పరమాత్ముడవు. ఘంటాకర్ణుణ్నే బాధలనుంచి తొలగించి మోక్షార్హుని చేసి రక్షించావు. నన్ను కూడా అలాగే రక్షింపుము.

ఘంటాకర్ణుడు కుబేరుని సేవకుడు శివభక్తుడు. ఇతని తమ్ముడు కాలాంతకుడు. ఘంటాకర్ణుడు తనకు శ్రీహరినామము వినపడకుండ చెవులకు గణగణ మ్రోగు గంటలను కట్టుకొన్నాడు. ఒకనాడాతడు శివుని దర్శించుటకు కైలాసానికి వెళ్లాడు. శివుడతని చెవులనున్న గంటలను చూచి ఆశ్చర్యపడి ఇవి ఎందుకు కట్టుకొన్నావని అడిగాడు. ‘‘శివనామము తప్ప శ్రీహరినామం వినగూడదని

ఈగంటలు చెవులకు కట్టుకొన్నాను. నేను మిమ్ముతప్ప మరెవ్వరిని భజింపనుగదా! నాకు మోక్షము ఒసగు''డని ప్రార్థించాడు.

అప్పుడు శివుడు ''ఓయీ! నీభక్తికి మెచ్చుకొంటున్నాను. నీకు మోక్షం కావాలంటే నీవు శ్రీహరిని భజింపక తప్పదు. మోక్షమొసగువాడు శ్రీహరియే'' అని చెప్పాడు. నాటినుండి శ్రీహరీ శ్రీహరీ అనుచు ఘంటాకర్ణుడు బదరికాశ్రమము నకు సమీపముననున్న అడవులలో సోదరునితో తిరుగుతూ బదరీయాత్రచేసే బ్రాహ్మణులను చంప సాగాడు.

శ్రీకృష్ణుడు బదరికాశ్రమవనంలో తపస్సుచేయడానికి వెళ్లి, సమాధిలో కూర్చున్నాడు. ఘంటాకర్ణుడు కుక్కల గుంపుతో, మాంసపు పళ్లెంతో అక్కడికి వెళ్లి, శ్రీకృష్ణుణ్ని ఫరిహసిస్తూ ఇలా అన్నాడు.

''ఎవరు నాయనా నీవు! ఈ కీకారణ్యంలో కూర్చొని తపస్సు చేస్తున్నావు? నిన్నిక్కడి క్రూరమృగాలు పిశాచాలు భక్షిస్తాయి. ఇంత ధైర్యం చేశావేమిటి? మేము నిన్ను వెంటనే వధించే వాళ్లమే కాని, నీ సుకుమార రూపం చూచి నీవెవరవో తెలుసుకొందామని అడుగుతున్నాను'' అన్నాడు.

అయితే మీరెవరు? అని అడిగాడు శ్రీకృష్ణుడు. ఘంటాకర్ణుడు, తన వృత్తాంతాన్ని, తాను చేసే దారుణకృత్యాలను వెల్లడించాడు. శ్రీకృష్ణుని రూపం శివుడు వర్ణించి చెప్పిన శ్రీహరిరూపంలాగానే ఉంది. శ్రీహరి ఈ వేషంతో ఇక్కడికి వచ్చాడేమో అని అనుమానించాడు ఘంటాకర్ణుడు.

శ్రీకృష్ణుణ్ని చూచి ఓయీ! ద్వారకాపురిలో శ్రీహరి కృష్ణుడుగా ఉన్నాడట. ఆయన అనుగ్రహం పొందడానికి నేను వెళుతున్నాను. అందుకే ఈ ప్రయత్నం. నీవు ఇక్కడి నుంచి మరొక భద్రమైన చోటికి వెళ్లు. అర్ధరాత్రి కావస్తున్నదని చెప్పి ఘంటాకర్ణుడు మాంసభక్షణం చేశాడు. నీళ్లు తెచ్చి ఒకచోట శుద్ధిచేశాడు. దానిమీద దర్భాసనం పరచాడు, కూర్చుండి శ్రీహరిని ధ్యానింపసాగాడు:

''నమో భగవతే తస్మై వాసుదేవాయ చక్రిణే
నమస్తే గదినే తుభ్యం వాసుదేవాయ ధీమహి

ఓం నమో నారాయణాయ విష్ణవే ప్రభవిష్ణవే

మమ భూయాన్మనఃశుద్ధిః కీర్తనాత్తవ కేశవ''

''సుప్రసిద్ధుడవైన చక్రధారి వయిన షడ్గుణైశ్వర్యసంపన్నుడవైన వాసుదేవునికి నమస్కారం. గదాధారివైన వాసుదేవుడవైన నీకు నమోవాకం. సర్వవ్యాపివి, వృద్ధినందే స్వభావం కలవాడవు నారాయణుడవైన నీకు నమస్సు. కేశవా, నిన్ను కీర్తించినందువల్ల నాకు మనఃశుద్ధి కలుగుగాక'' అని ఈవిధంగా స్తోత్రం చేసి సమాధిగతుడయ్యాడు. శ్రీకృష్ణుడు అనుగ్రహించి, ఆ పిశాచం తన మనస్సులో ధ్యానిస్తున్న శ్రీవిష్ణురూపంతోనే తాను సాక్షాత్కరించాడు.

ఘంటాకర్ణుని పిశాచత్వం వదలి పోయింది. అతడు సర్వాభరణభూషితుడైన గంధర్వుడై నిలిచి పరిపరివిధాలుగా శ్రీకృష్ణుణ్ని స్తోత్రం చేశాడు.

పరమాత్ముడు :- 'పరః పరాణాం పరమః పరమాత్మా' (విష్ణుపురాణం) పరమగు ఆత్మకోటులకు అన్నిటికి పరుడైనవాడు, తనవలె మరొకడు లేనివాడు. 'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి' (గీత. 7-7) నన్ను మించిన పరవస్తువు మరొకటి లేదు.

వదంతి తత్తత్త్వవిదః తత్త్వం యద్ జ్ఞానమద్వయం

బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే

శ్రీమద్భా. 1-2-12

అద్వయజ్ఞానతత్త్వాన్ని ''తత్త్వం'' అంటారు తత్త్వవేత్తలు. జ్ఞానమార్గసాధకులు బ్రహ్మమంటారు. యోగమార్గసాధకులు పరమాత్మ అంటారు. భక్తిమార్గసాధకులు ''భగవానుడు''అంటారు. మనము తత్త్వవేత్తలము కాము. జ్ఞానులము, యోగులము కాము. సంసార సాగరమీదుతున్నవాళ్లము. భగవంతుని అనుగ్రహాన్ని కోరుచున్న భక్తులము. కావున మనకు స్మర్తవ్యవుడు, కీర్తితవ్యుడు, ధ్యాతవ్యుడు, పూజనీయుడు శ్రీకృష్ణభగవానుడే అవుతాడు.

అనభివ్యక్తి స్వరూపం బ్రహ్మము. అంతర్యామితామయమైన మాయాశక్తి యొక్క చిచ్ఛక్త్యంశం పరమాత్మ. పరిపూర్ణ సర్వశక్తి యొక్క విశిష్ట స్వరూపము

భగవానుడు. భగవన్మాధుర్యానుభవము భక్తుల నయనాలను సంతృప్తపరుస్తుంది. భగవద్విషయక శ్రవణకీర్తనాదులతో భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. అప్పుడు

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి దృష్ట ఏవాత్మనీశ్వరే

భగవత్సాక్షాత్కారంతో అవిద్యాకర్మబద్ధత తొలగుతుంది. సర్వసంశయాలు, విపరీతజ్ఞానం నశిస్తాయి. కర్మ క్షయమవుతుంది.

**తురగాధ్వరంబు చేసిన**
**పురుషులకును వేఱెపదవి పుట్టుట యేమో**
**హరి మిము దలచినవారికి**
**నరుదా కైవల్యపదవి? అచ్యుత! కృష్ణా! 73**

కృష్ణా, అచ్యుతా! తురగ+అధ్వరంబు= అశ్వమేధయాగమును, చేసిన పురుషులకు, వేఱె=వేఱుగా, పదవి=గొప్పపదవి, పుట్టుట=కలుగుట, ఏమో= కలుగునో కలుగదో ఏమోకాని, మిమ్మున్= కృపాసింధువగు నిన్ను తలచినవారికి, కైవల్యపదవి=మోక్షస్థానము, అరుదా=లభింపనదియా? (తప్పక లభించునని భావము)

కృష్ణా! యాగాలలో ప్రశస్తమైన అశ్వమేధయాగం చేసినప్పటికి ప్రయోజనం ఉంటుందో లేదో చెప్పలేము. పుణ్యం లభిస్తుందో లేదో అనుమానమే. సర్వేశ్వరుడవైన నిన్ను స్మరించినవారికి మోక్షం నిశ్చయం.

అశ్వమేధ శతైరిష్ట్వా వాజపేయ శతేన చ
న ప్రాప్నువన్తి సుగతిం నారాయణ పరాఙ్ముఖాః

నూరు అశ్వమేధయాగాలు, నూరు వాజపేయయజ్ఞాలు చేసినప్పటికి నారాయణ పరాఙ్ముఖులు సుగతిని పొందలేరు.

మోక్షం అయిదు విధాలు : 1. సాలోక్యం 2. సార్ష్టి 3. సారూప్యం 4. సామీప్యం 5. సాయుజ్యం

(1) సాలోక్యం : సమానలోకంలో నివసించడం అనగా వైకుంఠవాసం.

(2) సార్ష్టి : అణిమాద్యష్టైశ్వర్యం కలిగి ఉండటం.

(3) సారూప్యం : భగవంతుని రూపాన్ని తాను పొందడం.

(4) సామీప్యం : భగవంతుడు తరచుగా వెలుపలనే తనకు సాక్షాత్కరించడం.

(5) సాయుజ్యం : భగవదంతఃకరణంలో ప్రవేశించడం. దీనినే కైవల్యమంటారు. కైవల్యమునకు అర్థం ఐకాంతికత; వ్యక్తితత్త్వం. ప్రకృతినుండి ఆత్మ వేరైపోవడం. పరమాత్మతో కూడి ఆత్మ తద్రూపాదులను పొందడం. దేహత్యాగానంతరం కలిగే అవస్థ. దీనినే ఉత్క్రాంతావస్థ అని అమృతపదమని అంటారు.

ముక్తి చెందినవాడు ఆత్మానందమనుభవిస్తాడు. స్వరాట్ అవుతాడు, సర్వలోకాలలో స్వచ్ఛంద గమనశీలి అవుతాడు. వీటిలో సామీప్య ముక్తి శ్రేష్ఠం. అది బ్రహ్మ సాక్షాత్కారం కనుక. ముక్తి సంపత్తి భగవంతుని అపారకృప వల్లనే కలుగుతుంది. అదే అనశ్వరమైన సంపత్తి.

"శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్" అని పోతనగారు భక్తితో శ్రీమద్భాగవతం రచించి ధన్యులైనారు. వారు కీర్తికై రచించినవారు కాదు.

**ఓ భవబంధ విమోచన!**
**ఓ భరతాగ్రజ! మురారి! ఓరఘురామా!**
**ఓ భక్తకామధేనువ!**
**ఓ భయహర! నన్నుఁగావుమో హరి కృష్ణా! 74**

కృష్ణా! భవబంధ విమోచన = జనన మరణ బంధాలను తొలగించువాడా! భరత+అగ్రజ= భరతునికి అన్నయైన ఓ శ్రీరామా! ఓ మురారీ, ఓ రఘురామా= రఘువంశదీపకుడవైన ఓ శ్రీరామా! భక్తకామధేనువ= భక్తుల పాలిటికి కోరిన వరములిచ్చువాడా! భయహర= భయమును పోగొట్టువాడా! ఓహరీ! నన్ను కావుము = నన్ను సంరక్షించుము.

భగవంతుడు భవబంధ విమోచనుడు అనగా ముక్తి నిచ్చువాడు, భక్తకామధేనువు= భక్తులు కోరిన కోర్కెలు కామధేనువు వలె నెరవేర్చువాడు.

**కామధేనువు:** క్షీరసాగరమథనమందు ప్రాప్తమైన పధ్నాలుగు రత్నాలలో కామధేనువొక రత్నం. గోరత్నం ఇది మనోవాంఛితాలను నెరవేరుస్తుంది.

గోవర్ధన గిరియెత్తి గోవులను గోపాలకులను కాపాడి, దేవేంద్రునికి బుద్ధి చెప్పిన శ్రీకృష్ణునికి గోవింద పట్టాభిషేకము చేయుటకు గోలోకమునుండి గోకులానికి వచ్చింది కామధేనువు. శ్రీకృష్ణుణ్ని త్రైలోక్యాధిపతిని చేసి క్షీరాభిషేకం చేసింది.

**ఏ తండ్రి కనకకశ్యపు**
**ఘాతుకుడై యతని సుతుని కరుణను గాచెన్**
**ప్రీతి సురకోటి పొగడగ**
**నాతండ్రీ! నిన్ను నేను నమ్మితి కృష్ణా! 75**

కృష్ణా! ఏతండ్రి = తండ్రివలె ఎవడు, కనకకశ్యపు= హిరణ్యకశిపుని, ఘాతుకుడై = చంపినవాడై; అతని సుతుని= అతనికుమారుడైన ప్రహ్లాదుని; సురకోటి =దేవతాసమూహము, పొగడగ=నుతింపగా; ప్రీతిన్=ప్రీతితో, కాచెన్= సంరక్షించెనో, ఆ తండ్రీ = అటువంటి ఓ తండ్రీ! నిన్ను నేను నమ్మితిని.

కన్న తండ్రివలె ప్రహ్లాదుని అనేకవిపత్తుల నుండి రక్షించిన యాతండ్రియే నాకు తండ్రిగా నిన్ను నమ్మితిని. నన్ను కాపాడుము.

ప్రీతికి విషయమైనవాడు లోకంలో భగవంతుడొక్కడే, పరమ పురుషార్థము భగవత్ప్రీతి ఒక్కటే.

ప్రహ్లాద చరిత్రను స్మరించినవాడు శ్రీహరిని కొల్చినవాడవుతాడు. అతడు సర్వకర్మబంధాల నుండి ముక్తుడవుతాడు.

"భవన్తి పురుషా లోకే మద్భక్తా స్త్వా మనువ్రతాః
భవాన్ మే ఖలు భక్తానాం సర్వేషాం ప్రతిరూపధృక్" - శ్రీమద్భా. 7-10-21

ప్రహ్లాదునికి శ్రీనృసింహస్వామి వరమిచ్చి "లోకంలో నిన్ను అనుసరించిన వారు కూడా నాకు భక్తులవుతారు. నాయనా! నీవు నా సమస్త భక్తులకు ఆదర్శమూర్తివి" అని ప్రశంసించాడు.

**ఓ పుండరీకలోచన!**
**యో పురుషోత్తమ! ముకుంద! ఓ గోవిందా!**
**ఓ పురసంహరమిత్రుడ**
**ఓ పుణ్యుడ! నన్ను బ్రోవుమో హరి! కృష్ణా! 76**

కృష్ణా! పుండరీకలోచన= తెల్లతామరపువ్వల వంటి నేత్రములు గలవాడా! పురుషోత్తమ= క్షేత్రాక్షరులకంటె ఉత్తముడా! ముకుంద= మోక్షమునిచ్చువాడా! ఓ గోవింద= వేదవేద్యా! ఓ పురసంహరమిత్రుడ= పురములను దగ్ధము కావించిన శివునికి మిత్రుడైనవాడా! ఓపుణ్యుడ = పాపులను కూడా పరిశుద్ధులనుగా చేయువాడా! హరి= కృష్ణా! నన్ను ప్రోవుము= నన్ను సంరక్షించుము.

"పుండరీకలోచనుడు" పుండరీకమంటే తెల్లతామర పువ్వుని సామాన్యార్థము. పుండరీకమనగా నిత్యము-సత్యము-శాశ్వతము, నిర్వికారమునైన పరమపదమని అర్థము. ఆ పరమపదమునకు నేత్రములవంటివాడు కనుక పుండరీకలోచనుడయినాడు.

"పుండరీకం పరంధామ నిత్యమక్షర మవ్యయం,
తద్భవాన్ పుండరీకాక్షః - పుండరీకవిలోచనః"
గోపవేషం సత్పుండరీకనయనం మేఘాభం
ద్విభుజం వనమాలిన మీశ్వరమ్"

"గోపవేషుడు, పుండరీకనయనుడు, మేఘసంకాశుడు, ద్విభుజుడు, వనమాలికా భరణుడు అయిన ఈశ్వరుడు సర్వనియంత" అని చెబుతున్నది గోపాలతాపనీయ శ్రుతి.

"ముక్తిదః" శబ్దమే "ముకుంద" అయినది. "గోవింద" నష్టమైన భూమిని వరాహరూపమున ఉద్ధరించినవాడు అని ఒక అర్థము.

'గోభిరేవ యతో వేద్యో గోవిందః సముదాహృతః" - విష్ణుతిలకం.
వేదవాక్కులచే తెలియదగినవాడు కనుక గోవిందుడనబడినాడు.
"గోవింద" నామానికి గల మహిమ-

వర్తమానం చ యత్పాపం యద్భూతం యద్భవిష్యతి
తత్సర్వం నిర్దహత్యాశు గోవిందానలకీర్తనమ్

వర్తమానంలోని, గతంలోని, భవిష్యత్తులోని పాపాలు సర్వం గోవింద నామాగ్నితో భస్మీపటలమవుతాయి.

తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామికి ప్రసిద్ధమైనది "గోవింద" నామం. ఈనామంలో అనేక రహస్యాలున్నాయి. శవవాహకులు ప్రేతాన్ని శ్మశానవాటికకు చేర్చేటప్పుడు కూడా గోవిందనామాన్ని ఉచ్చరిస్తారు.

'గోవింద'నామ సంకీర్తనలు పటహధ్వనివలె నలుదిక్కులనున్న పిశాచాదులను, సరీసృపాదులను, అమంగళాలను పటాపంచలుచేసి తొలగిస్తాయని శాస్త్రగ్రంథాలు చెబుతున్నాయి.

మంత్రోచ్చారణమే జపమవుతుంది. భగవన్నామాలను, కీర్తించడంలో కీర్తించేవానికే కాక, వినేవారికి, ఆ ప్రదేశానికి కూడా శుభం, పవిత్రత చేకూరుతుంది.

మంత్రం స్వరాది విశిష్టమూ, దేవతాప్రకాశమూ అయిన వర్ణ సముదాయము. అది విశిష్ట దేవతా వాచకమై ఉంటుంది. "క్వ జపో వాసుదేవేతి ముక్తిబీజ మనుత్తమమ్" "వాసుదేవ అని చేసే జపమెక్కడ? అది ముక్తికారణం సర్వోత్కృష్టమైనది" అది ద్వాదశాక్షర మంత్రము. అట్టి మంత్రమును భక్తిశ్రద్ధలతో జపించవలయును. మంత్రజపమున పరిశుద్ధత అవసరము: నామసంకీర్తన మెట్టివేళనైన, ఏ చోటనైన చేయవచ్చును.

పురసంహరమిత్రుడు అనగా శివునికి మిత్రుడైనవాడు విష్ణువు. పురసంహరుడు శివుడు. త్రిపురాసురులను శివుడు సంహరించెను. విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు అను రాక్షసులు పసిడి వెండి ఇనుములతో మూడు నగరములను మయునిచే నిర్మింపజేసికొని, ఆ నగరములతోపాటు తాము ఆకాశమునకు ఎగురుచు, దిగుచు ప్రజలను హతమార్చుచుండిరి. బ్రహ్మ దేవునిచే వరములుగన్న ఆ త్రిపురాసురులను వధించుటకు శివుడు పూనుకొనెను. శివునికి బ్రహ్మ తన తేజస్సు నిచ్చెను. విష్ణువు శివునికి బాణమయ్యెను. పృథ్వి రథమయ్యెను. నాల్గువేదములు గుఱ్ఱములయ్యెను. సూర్యచంద్రులు

రథచక్రములైరి. బ్రహ్మను రథసారథిగా చేసికొని శివుడు త్రిపురాసురులను వధించెను. అందుచే శివునికి త్రిపురారి-పురారి అనునామము లేర్పడెను.

శివుడు నారాయణ ప్రియుడు అగుటచే ఈ శతకకర్త 'పురసంహరమిత్రుడ!' అని శ్రీకృష్ణుని సంబోధించెను.

శ్రీకృష్ణుడు యోగేశ్వరుడు. శివుడు యోగీశ్వరుడు. వీరిద్దరి యెడ భేదభావమును చూపువాడు శాశ్వతముగా నరకవాసము ననుభవించునని శివపురాణం చెప్పుచున్నది.

సర్వభూతాత్మనాం ఏకభావానాం యో న పశ్యతి
త్రిసురాణాం భిదాం దక్ష సశాంతి మధిగచ్ఛతి
యః కరోతి త్రిదేవేషు భేదబుద్ధిం నరాధమః
నరకే స వసేన్నూనం యావదాచంద్ర తారకమ్ - శివపురాణం

**ఏ విభుడు ఘోరరణమున**
**రావణుని వధించి లంక రాజుగ నిలిపెన్**
**దీవించి యా విభీషణు**
**నా విభు నే దలతు మదిని నచ్యుత కృష్ణా! 77**

కృష్ణా! అచ్యుత=అవినాశియైనవాడా, అవ్యయుడా! ఏ విభుడు=ఏ ప్రభువు, ఘోరరణమున= భీకరమైన యుద్ధమున, రావణుని, వధించి= చంపి, లంకన్= లంకలో, ఆ విభీషణున్=రావణునితమ్ముడగు విభీషణుని, దీవించి= ఆశీర్వదించి, రాజుగ=ప్రభువుగా, నిలిపెన్=అభిషేకించి ప్రతిష్ఠించెనో, ఆ విభుని= ఆ ప్రభువగు శ్రీరామచంద్రుని, మదిని=మనస్సునందు, ఏన్ = నేను, తలతున్= స్మరింతును.

లంకాధిపతియగు రావణాసురుని సంహరించి యాతని తమ్ముడగు విభీషణుని లంకారాజ్యమునకు పట్టాభిషేకము కావించిన శ్రీరామచంద్రుని నేను మనసున నెల్లప్పుడు తలచుకొందును.

విభీషణుడు రావణాసురుని చిన్నతమ్ముడు. రావణుడు శ్రీరామపత్నియగు సీతాదేవిని అపహరించి లంకలో తన అశోకవనికలో ఉంచెను. సీతాదేవిని

వెదకుచు వచ్చి హనుమంతుడు ఆ దేవిని చూచి శ్రీరాముని క్షేమమును చెప్పి, ఆమెను ఓదార్చెను. అనంతరము రావణుని చూచు నెపమున అశోకవనికను ధ్వంసము చేసెను. తనను ఎదుర్కొనిన అక్షయకుమారాది వీరులను వధించెను. ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునకు కట్టువడి రావణుని సమక్షమునకు చేరెను.

శ్రీరాముని పత్నియగు సీతాదేవిని ఆరామునకు సమర్పించి, ఆయన పాదములపై పడితివేని బ్రతికెదవు. లేనిచో సర్వనాశనమగుదువని హనుమంతుడు రావణునికి హితవు చెప్పెను.

రావణుడు హనుమంతునిపై మండిపడి, అతనిని వధింపుడని భటులకు ఆజ్ఞాపించెను. అప్పుడు విభీషణుడు దూతలను చంపరాదని, శాస్త్రవిరుద్ధముగా ప్రవర్తించిన హాని కలుగునని రావణునికి హితవు చెప్పెను. అట్లైన కోతులకు తోక ప్రియమైనది కావున, ఇతని తోకకు నిప్పు పెట్టుడని రావణుడు రాక్షసులకు ఆనతిచ్చెను.

రాక్షసులు హనుమంతుని తోకకు బట్టలు చుట్టి నిప్పంటించిరి. హనుమంతుడు వెంటనే ఆకాశమున కెగసి లంకా పట్టణమును తన వాలాగ్నితో దగ్ధమొనర్చెను. ఒక విభీషణుని గృహమును మాత్రము తగులబెట్టకుండెను.

శ్రీరాముడు సముద్రమునకు వారధికట్టి లంకలో ప్రవేశించెను. అప్పుడు విభీషణుడు రావణునిదగ్గరికి వెళ్లి, మహారాజా! రాక్షసులకు మహాప్రమాదము సంభవించినది. సీతాదేవిని నీవు అపహరించుట వలననే రాక్షసవినాశనము సంభవించనున్నది. శ్రీరాముడు సామాన్య మానవుడు కాదు, ఆయన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. వెంటనే నీవు వెళ్లి సీతాదేవిని ఆయనకు సమర్పించి, నీ ప్రాణములను మా అందరి ప్రాణములను కాపాడుమని కోరెను.

రావణుడు అతని హితవచనములకు ఆగ్రహోదగ్రుడై అతనిని కాలితో తన్ని తన రాజ్యము నుండి బహిష్కరించెను.

విభీషణుడు తన సచివులతో సముద్రమును దాటి వచ్చి శ్రీరాముని పాదములపై పడి శరణు వేడుకొనెను. రావణుని తమ్ముడని సుగ్రీవాదులు విభీషణుని అనుమానించిరి.

విభీషణుడు రావణునికి భయపడి, ప్రాణరక్షణము కోరి, "పితరం, మాతరం, దారాన్, పుత్రాన్, బంధూన్, సఖీన్, గురూన్, రత్నాని, ధనధన్యాని క్షేత్రాణి చ గృహాణి చ" తన సర్వస్వము పరిత్యజించి "లోక విక్రాంత చరణౌ శరణం తే వ్రజం విభో" "తండ్రి, తల్లి, భార్య, సంతానం, సోదరులు, చుట్టాలు, స్నేహితులు, గురువులు, శ్రేష్ఠ వస్తువులు, ధనం, ధాన్యం, పొలాలు, ఇళ్ళు, అన్నీ విడిచి, లోకాలను ఆక్రమించిన మీ రెండు పాదాలను శరణు పొందుతున్నాను విభూ" అని శ్రీరాముని పాదములపై పడెను.

శరణాగత రక్షణ దీక్షగల శ్రీరాముడు విభీషణునికి అభయమిచ్చుచు, తన వ్రతమును ఇట్లు ఉద్ఘాటించెను. శ్రీమద్రామాయణము ఒక దీర్ఘ శరణాగతి అందలి చరమ శ్లోకమిది.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేతద్వ్రతం మమ"

శ్రీమద్రా. యుద్ధ. 18అధ్యా.

ఒక్కసారి నీవే నాకు శరణమవు అని నన్ను యాచించినటువంటి సర్వజీవులకు అభయమిచ్చుటయే నా వ్రతము.

"పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః
తేనైవ తే ప్రయాస్యంతి త ద్విష్ణోః పరమం పదమ్"

"పశువుకాని, మనుష్యుడుకాని, పక్షికాని, ఇంకా విష్ణు భక్తుని ఆశ్రయించిన వారెవరుకాని - అందరూ ఆ విష్ణుపరమపదానికి చేరుకుంటారు". అపరాధియైన రావణాసురుడే స్వయముగా వచ్చి శరణు చొచ్చినచో అతనికి కూడా అభయమిచ్చెదనని శ్రీరాముడు తన నిశ్చయమును తెలిపెను.

'సత్యవాదీ చ రాఘవః' శ్రీరాముడు సత్యవాది. "రామో ద్విర్నాభిభాషతే' ' శ్రీరాముడు రెండు విధాలుగా మాటాడడు. స్వోక్తికి విరుద్ధముగా మాటాడడని అర్థము. శ్రీరాముని శీలమిట్టిది.

సుగ్రీవుడు విభీషణుని శ్రీరాముని సన్నిధికి తోడ్కొని వచ్చెను. విభీషణుడు "అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అని నివేదన పూర్వకముగా శరణుచొచ్చెను. అప్పుడు అతనికి అభయమిచ్చి, శ్రీరాముడు కుంభకర్ణాది సహితముగా రావణుని వధింతునని ప్రతిజ్ఞ చేసి, సర్వవానర సమక్షమున లంకారాజ్యమునకు విభీషణుని పట్టాభిషిక్తుని కావించెను.

గీతలో శ్రీకృష్ణభగవానుని అభయవాక్యమిది:-

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః గీత.18-66

దీనిని చరమ శ్లోకమందురు. "భగవంతుని పొందుటకు ఆటంకములైన సకల పాపములనుండి నిన్ను తొలగింతును. కర్మయోగ, జ్ఞానయోగాదులు నిశ్రేయస సాధనములు. అవి భగవదారాధన రూపములు. వాటి కర్తృత్వ ప్రీతిని విడిచి, వాటిని నాకే అర్పించుము. భక్తియోగమునకు విరోధులైన అనాదికాలమునుండి సంచితములైన నానావిధపాపములు అనంతముగా కలవు. వాటికి ప్రాయశ్చిత్తములు శాస్త్రములలో అనేకము చెప్పబడినవి. మనము జీవించు కాలము చాల పరిమితము. వాటిని అనుష్ఠించుట అలవికానిపని. కావున అనాలోచిత విశేషాశేషలోక శరణ్యుడనైన, ఆశ్రితవాత్సల్య జలధినైన నన్నొక్కనినే శరణుచొరుము. నీభూత వర్తమాన పాపములన్నిటిని నుండి నిన్ను విడిపింతును. నన్ను విశ్వసించుము. ఇక విచారపడవలదు. విచారపడితివేని నన్ను విశ్వసింపలేదని తెలియును" అని దీని భావము.

శరణాగతినే భరన్యాసమందురు. మన రక్షణభారమంతయు భగవంతునిపై నుంచుట. శ్రీమద్రామానుజులు శరణాగతి గద్యను హృద్యముగా రచించిరి. శ్రీవేదాంత దేశికులు న్యాసదశకమను చక్కని ప్రపత్తిశ్లోకములు రచించిరి.

భక్తులకొరకు వాటిని తాత్పర్య సహితముగా పొందుపరుస్తున్నాను.

అహం మద్రక్షణభరో మద్రక్షణఫలం తథా
న మమ శ్రీపతే రేవేత్యాత్మానం నిక్షిపేద్ బుధః
న్యస్యామ్యకించనః శ్రీమన్ననుకూలో ఽన్యవర్జితః
విశ్వాసప్రార్థనా పూర్వ మాత్మరక్షాభరం త్వయి
స్వామి స్వశేషం స్వవశం స్వభరత్వేన నిర్భరమ్
స్వదత్త స్వధియా స్వార్థం స్వస్మిన్న్యస్యతి మాం స్వయం
శ్రీమన్నభీష్టవరద త్వామస్మి శరణం గతః
ఏతద్దేహావసానే మాం త్వత్పాదం ప్రాపయ స్వయం
త్వచ్ఛేషత్వే స్థిరధియం త్వత్ప్రాప్త్యైక ప్రయోజనం
నిషిద్ధ కామ్య రహితం కురు మాం నిత్య కింకరమ్
దేవీ భూషణ హేత్యాదిజుష్టస్య భగవం స్తవ
నిత్యం నిరపరాధేషు కైంకర్యేషు నియుంక్ష్వ మాం
మాం మదీయం చ నిఖిలం చేతనా చేతనాత్మకం
స్వకైంకర్యోపకరణం వరద స్వీకురు స్వయమ్
త్వ మేవ రక్షకో ఽసి మే త్వమేవ కరుణాకరః
న ప్రవర్తయ పాపాని ప్రవృత్తాని నివారయ
అకృత్యానాం చ కరణం కృత్యానాం వర్జనం చ మే
క్షమస్వ నిఖిలం దేవ ప్రణతార్తిహర ప్రభో
శ్రీమన్నియత పంచాంగం మద్రక్షణ భరార్పణం
అచీకరత్ స్వయం స్వస్మిన్నతో ఽహమిహ నిర్భరః

ం నారక్షణ భారము, తత్ఫలము నాది కాదు: అది శ్రీకృష్ణునిదే" అనే యాభిప్రాయంతో విద్వాంసుడు తనను భగవంతునికి సమర్పించుకొంటాడు. నగవన్! నేను అకించనుణ్ణి. నా రక్షణ భారం అనన్యంగాను అనుకూల్యంగాను, ్సంతో ప్రార్థనా పూర్వకంగా నీ పరం చేస్తున్నాను. నా స్వామివి నీవు. నాకు

పరమ పురుషార్థాన్ని సిద్ధింపజేయడానికి స్వయంగా నన్ను నీ శరణ్యానికి స్వీకరిస్తున్నావు. అభీష్ట వరప్రదాతవయిన ఓభగవన్! నేను నీకు శరణుచొచ్చాను. ఈదేహం అంతమయ్యేదాకా నన్ను నీచరణ కమలాలను చేరుకోనిమ్ము. నీ అంశగలవాణ్ని. స్థిరబుద్ధిగలవాణ్ని. నిన్నుపొందడమే ఏకమాత్రప్రయోజనంగా గలవాణ్ని, నిషిద్ధకార్యాలనుంచి తొలగించి, నన్ను నీ నిత్యసేవకుణ్ని చేసుకో. లక్ష్మీదేవి, కౌస్తుభం, శంఖ, చక్రగదా శార్ఙాదులతో కూడిన నీవు నీ నిర్దోష సేవలో నన్ను నిత్యమూ నియుక్తుణ్ని చేసుకో. హే వరదా! నాకున్న చేతనాచేతన సమస్త వస్తువులను నీ సేవా సామాగ్రిగా స్వీకరించు. నన్ను దయదలచువాడవు నీవే. కావున, పాపాలు నా వైపు రాకుండా నన్ను కాపాడుము. గతజన్మలోని పాపాలను నివారించుము. హేదేవా! దీనదయాళో! కర్తవ్యకర్మలను నన్ను చేయనిమ్ము. చేయగూడని కర్మలను నా చేత చేయింపవద్దు. నన్ను క్షమించుము. శ్రీమన్! నీవు స్వయంగా నా పంచేంద్రియాలు నియంత్రించగా, నా రక్షణ భారాన్ని నీ మీద మోపాను. నా బరువు దించుకొన్నాను. ఇక నిర్భరుడనయ్యాను.

**గ్రహభయ దోషము లొందవు**
**బహుపీడలు చేర వెఱచు పాయును నఘముల్**
**ఇహపర ఫల దాయక! విను,**
**తహతహ లెక్కడవి నిన్ను దలచిన కృష్ణా! 78**

కృష్ణా! ఇహపరఫలదాయక=ఈ లోకమునందలి పరలోకమునందలి సౌఖ్యములను ప్రసాదించు ఓస్వామీ! వినుము.

నిన్ను తలచిన=స్మరించిన యెడల, గ్రహభయ= గ్రహభయాలు, దోషములు=గ్రహ దోషములు; ఒందవు = కలుగవు; బహు=పెక్కు, పీడలు=బాధలు, చేరన్-వెఱచున్=చేరుటకు భయపడును. అఘముల్= పాపములు; పాయును= తొలగి పోవును, కావున, తహతహలు=తమకపడుటలు, ఎక్కడివి?= ఎక్కడనుండును? నిన్ను స్మరించినవారికి కలతలుండవని తాత్పర్యము.

ఇహలోక పరలోక సౌఖ్యములను ప్రసాదించు ఓకృష్ణా! నిన్ను స్మరించినంతనే భూతములుగాని, ఈతిబాధలుగాని, దుఃఖములుగాని దరిచేరుటకు భయపడును.

ఈ లోకమున స్వల్పమైన ధర్మమును ఆచరించిన యెడల అది రానున్న మహావిపత్తు నుండి రక్షించుటకు సమర్థమగునని శాస్త్రవచనము. "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్". మనుష్యుడు అనేక జన్మల నుండి చేసిన పాపములు పెక్కు జన్మలలో తత్ఫలములను అనుభవించి, ఆ పాపములు క్షీణ దశకు రాగానే, అతనికి శ్రీకృష్ణునియందు భక్తి కలుగును. "నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" -అనుగీత - మహాభారతం.

దీనినిబట్టి కృష్ణభక్తుడైనవాడు దోషరహితుడని గుర్తించనగును. శ్రీకృష్ణాను స్మరణమే పరమమైనదని, "వైకుంఠనామగ్రహణం అశేషాఘహరం విదుః" అశేషములైన పాపములు శ్రీహరినామముతో హరించిపోవునను విషయమును గూర్చి లక్ష్మీధరపండితుడు తన "భగవన్నామకౌముది"లో విశేషముగా వివరించియున్నాడు.

"భక్తానాం పాపాది దోషాన్ కృషతి నివారయతీతి కృష్ణః" భక్తుల పాపాది దోషాలను నివారించేవాడు కాబట్టి "కృష్ణుడు" అని ఒక వ్యుత్పత్తి; "తేషాం దుర్లభానపి పురుషార్థాన్ ఆకర్షయతి - ప్రాపయతి ఇతి వా కృష్ణః". అతిదుర్లభమైన పురుషార్థాలను ప్రాప్తింపజేసేవాడు కాబట్టి "కృష్ణుడు" అయ్యాడు. "కర్షతి ఆత్మని సర్వలోకాన్ ఇతి కృష్ణః, ప్రళయే ఇతి శేషః" ప్రళయకాలంలో సమస్తలోకాలను తన ఆత్మకు ఆకర్షించేవాడు కాబట్టి కృష్ణుడు.

"కర్షతి అరీన్ ఇతి వా కృష్ణః" శత్రువులను సంహారం చేసే వాడు కాబట్టి కృష్ణుడు. (మనుష్యుల పాపాన్ని కర్షణం చేసేవాడు కనుక కృష్ణుడయ్యాడు).

కృషిశ్చ పరమానందే ణశ్చ తద్దాస్య కర్మణి
తయో ర్దాతా హి యో దేవః తేన కృష్ణః ప్రకీర్తితః

కృషి అనగా పరమానందం. 'ణ' అనగా దాస్యం. ఈరెంటిని ప్రసాదించే దాత "కృష్ణుడు". ఈవిధంగా కృష్ణశబ్దానికి శాక్తేయులు, శైవులు, సౌరమతస్థులు, గాణాపత్యాది మతస్థులు తమతమ ఆరాధ్యదేవతయని అర్థం చెప్పుకొంటారు.

"ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానందవిగ్రహః
అనాది రాది ర్గోవిందః సర్వకారణ కారణమ్"

అని బ్రహ్మసంహిత శ్రీకృష్ణుడే సర్వదేవేశ్వరేశ్వరుడని కంఠోక్తిగా చెబుతున్నది. "ఆద్యోహరిః శ్రీకృష్ణః" అనే శ్రీశుకవాక్యాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీధరస్వామి సర్వావతార కర్తృత్వము శ్రీకృష్ణునిదని ప్రవచించారు.

**గంగ మొదలైన నదులను**
**మంగళముగ జేయునట్టి మజ్జనములకున్**
**సంగతి గలిగిన ఫలములు**
**రంగుగ మిము దలచు సాటి రావుర కృష్ణా! 79**

కృష్ణా! గంగ మొదలైన నదులందు, మంగళముగన్=శుభములను పొందుటకొఱకై, చేయునటువంటి, మజ్జనములకున్ = స్నానములకు, సంగతి= పవిత్రతీర్థము నంటుట వలన కలిగిన, ఫలములు= పుణ్యములు, రంగుగ = చక్కగా, మిము తలచు = మిమ్ము తలచిన కలుగు ఫలముతో సాటిరావు.

కృష్ణా! గంగ మొదలైన పుణ్యనదులతో స్నానమాడిన కలుగు పుణ్యఫలములు నిన్ను స్మరించుట వలన కలుగు పుణ్యముతో సాటిరాజాలవు.

హరిపదపాద్య తరంగణి గంగే హిమవిధుముక్తా ధవళ తరంగే
దూరీకురు మమ దుష్కృతి భారం కురు కృపయా భవసాగరపారం
- శ్రీశంకర భగవత్పాదులు.

శ్రీహరి చరణ పాదోదక మయమైన నదివి నీవు. హే గంగానది! నీతరంగములు హిమము, చంద్రముడు, ముత్యాలు మాదిరిగా తెల్లనైనవి. మలినములైన నా పాపములను తొలగించుము. కృపతో సంసారసాగరమును తరింపజేయుము. గంగా స్నానము కంటె శ్రీకృష్ణనామస్మరణము గొప్పది.

**ఆ దండకా వనంబున**
**కోదండము దాల్చినట్టి కోమలమూర్తీ**
**నాదండ గావ రమ్మీ**
**వేదండము కాచినట్టి వేలుప కృష్ణా! 80**

కృష్ణా! ఆదండకావనంబునన్= దండకయను ప్రసిద్ధమగు అడవి యందు, కోదండమున్= ధనుస్సును, తాల్చినట్టి= ధరించినట్టి, కోమలమూర్తీ = మృదువైన శరీరము గలవాడా! వేదండమున్= గజేంద్రుని కాచినట్టి= సంరక్షించినట్టి, వేలుప= ఓదైవమా! కావన్= రక్షించుటకు, నాదండన్ = నా దగ్గరకు, రమ్మీ = రమ్ము; దయచేయుము.

కృష్ణా! నీవు శ్రీరామావతారమున సుకుమార సుందర రూపముతో దండకారణ్యమున ధనుర్బాణములు ధరించి రాక్షసులను వధించుచు సంచరించితివి. గజేంద్రుని రక్షించుటకు వైకుంఠమునుండి వెడలి వచ్చితివి. అట్లే నన్ను రక్షించుటకు రమ్ము.

శ్రీసీతారామలక్ష్మణులు దండకారణ్యంలో పర్ణకుటీరంలో ఉండగా రావణాసురుని సోదరియైన శూర్పణఖ చూచింది. శ్రీరాముని మోహించి తనను పెండ్లాడుమని బలవంతం చేసింది. నేను భార్యాసహితంగా ఉన్నాను. నాతమ్ముడు ఒంటరిగా ఉన్నాడు. అతని అభిప్రాయాన్ని తెలుసుకొమ్మని రాముడు చెప్పాడు శూర్పణఖ లక్ష్మణుని వద్దకు వెళ్లి తనను పెండ్లాడుమని కోరింది. లక్ష్మణుడు నిరాకరించాడు. మరల శూర్పణఖ రాముని వద్దకు వెళ్లి, నీభార్య ఉండగా నన్ను పెండ్లాడవు కనుక నీభార్యను మ్రింగి వేస్తానని సీతాదేవిని కబళింపబోయింది. అప్పుడు శ్రీరాముడు ఈ శూర్పణఖకు బుద్ధి చెప్పుమని లక్ష్మణునికి ఆజ్ఞాపించాడు. స్త్రీని వధింపరాదను ధర్మాన్ని అనుసరించి లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులను ఖండించి విరూపను చేశాడు.

శూర్పణఖ రక్తమోడుచు, పెద్దపెట్టున రోదిస్తూ తన సోదరుడైన ఖరుని వద్దకు వెళ్లి తన పరాభవాన్ని గూర్చి చెబుతూ రామలక్ష్మణులను ఇట్లు వర్ణించింది.

తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ
పుండరీక విశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ
ఫలమూలాశినౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ
పుత్రౌ దశరథస్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ

శూర్పణఖ లక్ష్మణునిచే విరూప అయినను ఆ రామలక్ష్మణులను చూచినప్పుడు కలిగిన కామమోహాతిశయము ఆమెకేమాత్రము తగ్గలేదు. కొంచెమైనను వైరాగ్యము కలుగలేదని ఆమె చేసిన ఈ వర్ణనను బట్టి తెలియుచున్నది.

ఆ రామలక్ష్మణులు తరుణులు. కామినులకు ప్రథమాకర్షకమైనది తారుణ్యము. వయోరూప తేజస్వులైనప్పటికి పరుషతర శరీరులు కారు. పుష్పహాస సుకుమారరూపులు. అట్లున్నప్పటికి వారు మహాబలులు. తెల్లతామర పువ్వుల వలె శోభిల్లుచుండిన విశాల నేత్రములు గలవారు, అనగా వారి నేత్రాలలో తమోగుణోద్రేకం కాని, నిద్రాకషాయితత్వం కాని, రజోగుణం చేత సంరక్తత్వం కాని లేదు. సర్వదా సత్వ ప్రసన్ననయనులు అని తాత్పర్యం. నారచీరలు ధరించిన వారైనను రమణీయులు. “ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ” ‘శకుంతల నారచీరలు ధరించినప్పటికి మిక్కిలి మనోహరముగా ఉన్నది’ అని శకుంతలను కాళిదాసు వర్ణించాడు. వారిని చూచిన వెంటనే శూర్పణఖ కామపరవశురాలైనది. వారు నారచీరలు ధరించిన తీరును బట్టి సర్వదా యుద్ధ సన్నాహ సూచక వస్త్ర బంధాది యుక్తులై ఉన్నారన్న భావం కూడా తోపింపజేసింది.

వాల్మీకి మహర్షి రచించిన శ్రీమద్రామాయణం, దానికి గోవిందరాజీయ వ్యాఖ్యానం చదువుకొన్నవారికి పై శ్లోకాలలోని అర్థవిశేషాలు ఎన్నెన్నో తెలుస్తాయి. ఆనందభరితులవుతారు. శ్రీరామున్ని, కోమలమూర్తీ అని సంబోధించడంలోని చక్కని ఔచిత్యాన్ని తెలపడానికే ఇంతగా వ్రాయవలసి వచ్చింది.

**చూపుము నీరూపంబును**
**పాపపు దుష్కృతము లెల్ల పంకజనాభా**
**పాపుము నాకును దయతో**
**శ్రీపతి నిను నమ్మినాఁడ సిద్ధము కృష్ణా! 81**

కృష్ణా! నీరూపంబును చూపుము. పంకజనాభా= తామరపువ్వు బొడ్డునందు గలవాడా! పాపపు దుష్కృతములు+ఎల్లన్=పాపమును కలిగించు నా చెడు పనుల నన్నిటిని; నాకును = నాకుసైతము, పాపుము= తొలగించుము, శ్రీపతి = లక్ష్మీనాథా! నిను నమ్మినాడను. ఇది, సిద్ధము= ఈడేరిన లేదా నా మనసు పండిన విషయము.

కృష్ణరూపమును ధరించిన శ్రీపతీ! నీదివ్యమంగళ చతుర్భుజ రూపాన్ని దర్శింపజేయుము. పాపభాజనములైన నా దుష్కార్యాల నన్నిటిని తొలగించి నన్ను పరిశుద్ధుణ్ని చేయుము. నిన్ను పరిపూర్ణంగా విశ్వసించాను.

అనాది కాలంనుంచి మనో వాక్కాయాలతో ప్రవృత్తమైన నా అకృత్యాల వల్ల, సత్కృత్యాలను చేయనందువల్ల, భగవదపచారాలవల్ల కలిగిన పాపాలను నిశ్శేషంగా తొలగించుమని ప్రార్థిస్తున్నాడీ భక్తుడు.

దేవకీవసుదేవులకు చెరసాలలో చూపిన తన చతుర్భుజ రూపాన్ని దేవతలు నిత్యం దర్శింపగోరుతారు. "దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః" (గీత 11-52) ఆ శ్రీపతి రూపాన్ని తనకు దర్శింపజేయుమని ఈ భక్తకవి కోరుతున్నాడు. తన నరాకృతిని గూర్చి శ్రీకృష్ణుడిట్లన్నాడు.

జాత్యాహం కృష్ణరూపశ్చ పరిపూర్ణతమః స్వయమ్
గోలోకే గోకులే పుణ్యే క్షేత్రే బృందావనే వనే
ద్విభుజో గోపవేషశ్చ స్వయం రాధాపతిః శిశుః
గోపాలో. గోపికాభిశ్చ సహితః కామధేనుభిః
చతుర్భుజో ఽహం వైకుంఠే ద్విధారూపః సనాతనః
లక్ష్మీసరస్వతీకాంతః సతతం శాంతవిగ్రహః

బ్రహ్మవైవర్త పురాణం అధ్యాయం 126-86,87,88

"నేను శ్రీకృష్ణునిగా పరిపూర్ణతముడను. గోలోకంలో, గోకులంలో, బృందావనంలో రాధాపతినై ద్విభుజుడనై గోపవేషధారినై, గోపికలతో కామధేనువులతో వ్రజవాసులతో శైశవ క్రీడలను జరుపుతుంటాను. అలరిస్తూ వారికి సహాయంగా ఉంటాను. వైకుంఠంలో చతుర్భుజరూపంతో లక్ష్మీసరస్వతులతో సదా శాంతాకారుడనై ఉంటాను."

**నీ నామము భవహరణము**
**నీ నామము సర్వసౌఖ్యనివహకరంబున్**
**నీ నామ మమృతపూర్ణము**
**నీ నామము నే దలంతు నిత్యము కృష్ణా! 82**

కృష్ణా! నీనామము; భవ-హరణము= సంసారాన్ని హరించునటువంటిది. సర్వ-సౌఖ్య-నివహ-కరంబున్= సమస్త సౌఖ్య సమూహాలను కలిగించునది, నీనామము; అమృతపూర్ణము= అమృతముతో నిండినది. నిత్యము నీ నామమును నేను తలతును.

శ్రీకృష్ణా! నీ నామమును స్మరించిన సాంసారిక దుఃఖాలు తొలగిపోతాయి. నీ నామం స్మరిస్తే సర్వసౌఖ్య సంపదలు కలుగుతాయి. నీనామం అమృతభరితం. నీనామాన్ని నేను నిరంతరం స్మరిస్తాను.

శ్రీకృష్ణ నామ మాహాత్మ్యం

శ్రీకృష్ణనామం అంతరంగమాలిన్యాన్ని తొలగించే సులభమైన సాధనం. అందుకు భగవన్నామోచ్చారణం కంటె వేరే ఉపాయం కాని, సాధనం కాని లేదు. స్త్రీలు పురుషులు బాలురు శ్రీకృష్ణనామాన్ని ప్రేమతో ఉచ్చరించాలని పెద్దలు ఆదేశించారు.

అప్రాకృతమైన శ్రీకృష్ణనామానికి పాపనాశనశక్తి స్వాభావికంగా ఉంది. నాల్కమీద శ్రీకృష్ణనామం ఉంటే మనసులోని పాపం తొలగిపోతుంది.

శ్రీకృష్ణనామం పాపాన్ని నాశనం చేయకుండా అది శాంతింపదు. శ్రీకృష్ణనామంలో సుదర్శనచక్రం యొక్క శక్తి ఉంది.

శ్రీకృష్ణనామానికి, ఆయన స్వరూపానికి, ఆయన లీలలకు, ఆయన నిత్యధామానికి భేదం ఉండదు. శ్రీకృష్ణ నామమే భగవత్స్వరూపం.

శ్రీకృష్ణనామం మనల్ని ఆయన పాదాల వద్దకు లాగుకొని పోతుంది. మనం ఆయన చరణసన్నిధికి చేరుకొంటాము.

శ్రీకృష్ణనామాన్ని ఉచ్చరింపగా అంతరంగమాలిన్యం తొలగిపోయి, ఆ నామం లోని రుచి తెలుస్తుంది. నామరుచి తెలిసిన తర్వాత, ఆ రుచిని వదలుకోవడం సాధ్యంకాదు.

శ్రీకృష్ణనామరాశి కలిగినవారికి యమధర్మరాజు వల్ల భయం ఉండదు.

'తే సభాగ్యా మనుష్యేషు కృతార్థా నృప చింతితమ్
స్మరంతి యే స్మారయంతి హరేర్నామ కలౌ యుగే"

ఈ కలియుగంలో హరినామాన్ని స్మరించేవారు, ఇతరులచే స్మరింపజేసేవారు మహాభాగ్యవంతులు, వారే కృతార్థులు.

శ్రీకృష్ణనామజపం చేసేవారికి పూర్వకర్మ వల్ల కలిగే విపత్తులు సంపత్తులుగా పరిణమిస్తాయి. (శ్రీమద్భాగవతంలో 12-3-51).

కలే ర్దోషనిధే రాజ న్నస్తిహ్యేకో మహాన్ గుణః
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసంగః పరం వ్రజేత్

కలియుగం దోషభూయిష్ఠమయింది. కాని, ఈ యుగంలో ఒకానొక గొప్పగుణం ఉన్నది. ఈయుగంలో శ్రీకృష్ణనామాన్ని కీర్తిస్తే పరమ కళ్యాణ మవుతుంది.

భగవంతునియందు విశ్వాసం ఉంటే ఆయన కృపమీద ఆధారపడదలిస్తే, నామజపం చేయాలి. అప్పుడు నిర్భయత కలుగుతుంది. సాహసం ఏర్పడుతుంది. విపత్తులను పారదోలడానికి ఏకైక ఉపాయం భగవన్నామాన్ని జపించడమే. ఒక్క నాల్కమీద కృష్ణనామం ఉంటేచాలు, తక్కిన అవయవాలన్నీ పరిపుష్టమవుతాయి.

నామజపాన్ని భంగపరచేవి రెండున్నాయి. 1. భగవన్నామ జపం చేయడం లో ఆలస్యం చేయడం 2. నామాన్నిగూర్చి తర్కించడం.

శ్రీమద్భాగవతంతో భగవన్నామ జపమహిమను గూర్చి దేవహూతి ఇలా అంటుంది.

అహో బత శ్వపచో ఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యం
తేపుస్తపస్తే జుహువుః సస్నురార్యా
బ్రహ్మానూచు ర్నామ గృణంతి యే తే

- శ్రీమద్భా. 3-33-7

ఆహా! చండాలుడు కూడా శ్రీకృష్ణనామాన్ని జిహ్వాగ్రాన విరాజిల్లజేసుకొన్నవాడయితే అతడు మహాశ్రేష్ఠుడవుతాడు. అతడు తపస్సు చేసినవాడవుతాడు. హవనం చేసినవాడవుతాడు, తీర్థస్నానం చేసినవాడవుతాడు, సదాచారాన్ని పాలించిన వాడవుతాడు, వేదాధ్యయనం చేసినవాడు కూడా అవుతాడు. అనగా భగవన్నామం నిరంతరం ఉచ్చరించేవానికి పైన పేర్కొన్న వాటితో అవసరముండదని తాత్పర్యం. భగవన్నామ మనే వస్తుగుణమే వాటినన్నిటిని మించినదని సారాంశం.

భగవన్నామ స్మరణం వల్ల హృదయంలో అమృతమూరుతుంది. అప్పుడొక క్షణం కూడా భగవంతుణ్ని స్మరించకుండా ఉండలేము. ఒక క్షణం స్మరించకుంటే ఎంతో వ్యాకులతకు లోనవుతాము. జీవితం వ్యర్థయిందే అని ఎంతగానో చింతిస్తాము. "యదుపతి కథా వియోగే వ్యర్థం గతం ఆయు రితి చింతా" శ్రీకృష్ణకథతోడి ఎడబాటువల్ల నాజీవితము వ్యర్థమవుతున్నదనే విచారం నన్ను బాధిస్తున్నది అని అన్నారు శ్రీశంకర భగవత్పాదులు.

కృష్ణ కృష్ణేతి కృష్ణేతి కలౌ వక్ష్యసి ప్రత్యహమ్
నిత్యం యజ్ఞాయుతం పుణ్యం తీర్థకోటి సముద్భవమ్

- స్కాందపురాణం

కలియుగంలో ప్రతిదినం కృష్ణకృష్ణ అని ఉచ్చరించినవానికి నిత్యం పదివేల యజ్ఞాలు చేసిన ఫలం, కోటి తీర్థాలలో స్నానమాడిన ఫలం ప్రాప్తిస్తుంది.

భగవద్భజనకు సరళమైన పద్ధతులు రెండున్నాయి. శ్రీకృష్ణుణ్ని స్మరించడం లేదా కృష్ణనామాన్ని నిరంతరం నాల్కమీద నర్తింపజేయడం. నామజపంద్వారా అసంభవాలు కూడా సంభవాలవుతాయి.

శ్రీకృష్ణభగవన్నామం. సర్వతీర్థాలను మించిన తీర్థమని స్కాంద-పద్మ-బ్రహ్మవైవర్త-గరుడ-లింగ- భాగవత పురాణాలు చెబుతున్నాయి. మనుష్యులకు శ్రీకృష్ణ స్మరణం తప్ప వేరే గతిలేదు. పరలోకయాత్రకు శ్రీకృష్ణనామస్మరణం తప్ప మరొక పాథేయంలేదు. శ్రీకృష్ణస్మరణం చేసినవాని జన్మ సఫలమవుతుంది.

కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః
జలం భిత్వా యథా పద్మం నరకాదుద్ధరా మ్యహమ్

నన్ను నిత్యము కృష్ణకృష్ణయని స్మరించినవానిని జలాన్ని భేదించుకొని పద్మం పైకి వచ్చినట్లుగా, నరకం నుంచి ఉద్ధరిస్తాను. (స్కాందపురాణం)

నామచింతామణిః కృష్ణః చైతన్యరసవిగ్రహః
పూర్ణః శుద్ధో నిత్యముక్తోఽభిన్నత్వా న్నామ నామినోః

-పద్మపురాణం

శ్రీకృష్ణుని మాదిరిగా శ్రీకృష్ణనామం కూడా చైతన్యవంతమైనది. నిత్యముక్తమైనది, చిద్రసరూపమైనది. చింతామణితో సమానంగా అభీష్టప్రదానంలో సమర్థమైనది. ఋగ్వేదంలో "ఓం ఆఽస్యజానంతో నామ చిద్వివిక్తన్ మహస్తే విష్ణో సుమతిం భజామహే ఓం తత్సత్" ఓ విష్ణు భగవన్! నీ నామం చిత్స్వరూపం - స్వప్రకాశం. అల్పజ్ఞానులు సైతం నామాన్ని ఉచ్చరిస్తే సుమతులవుతారు. అనగా భగవద్విషయక జ్ఞానాన్ని పొందుతారు అని ఉంది.

"కృష్ణాత్పరం నాస్తి దైవం దోషవర్జితం". కాలాతీతుడైనవాడు శ్రీకృష్ణుడొకడే. ఆయనే సర్వదోషరహితుడు, సర్వమంగళుడైన దేవాదిదేవుడు అన్నారు శ్రీవల్లభ ప్రభువులు. కాబట్టి శ్రీకృష్ణభగవానుని సేవించడమే భక్తి శాస్త్రం యొక్క నిష్కర్ష.

**పరులను నడిగిన జనులకు**
**కురుచ సుమీ యిది యటంచు గుఱుతుగ నీవున్**
**కురుచడవై వేడితి మును**
**ధర పాదత్రయము బలిని తద్దయు కృష్ణా! 83**

కృష్ణా! పరులను=ఇతరులను, అడిగిన = యాచించినచో, జనులకు, కుఱుచసుమీ= చులకనయగును సుమా! అటంచు; గుఱుతుగ= నిదర్శనముగా, నీవున్= నీవుకూడా, కురుచడవై= (పొట్టివాడవై) వామనుడవై, మును= పూర్వము, బలిని = బలిచక్రవర్తిని, పాదత్రయము = మూడడుగులు, ధరన్=నేలను, తద్దయు= మిక్కిలి, వేడితి= వేడితివి.

కృష్ణా! పరుల యొద్ద చేసాపి ఏదేని యాచించుట చులకనయగునని లోకమునకు చాటుటకేమో నీవు వామనుడవై బలిచక్రవర్తిని మూడడుగుల నేలను యాచించితివి.

శ్రీహరి కృపపొందినవారు జన్మసాఫల్యాన్ని పొందుతారు. శ్రీహరి కృపతో దేవతలు అమృతపానం చేయగలిగారు. యుద్ధంలో అసురులను జయింప గలిగారు. ఓడిపోయిన అసురులు అస్తాచలంలో దాగుకొన్నారు. మిగిలిన అసురులు ఇంద్రుని వజ్రాయుధం దెబ్బకు మృతులయ్యారు. శుక్రాచార్యుడు మృత సంజీవినీ విద్యతో అసురులను బ్రతికించి, బలికి స్వస్థత కలిగించాడు. అందుకు బలి శుక్రునిపట్ల విధేయుడై ఉన్నాడు. శుక్రాచార్యుడు ప్రసన్నుడై బలిచేత ఒక మహాయజ్ఞం జరిపించాడు. అగ్నిదేవుని చేత దివ్యరథాన్ని అభేద్యకవచాన్ని, అక్షయతూణీరాన్ని బలికి ఇప్పించాడు.

బలి అమరావతి మీదికి దండెత్తాడు. అతణ్ని చూచి దేవతలు ఈసారి బలిని గెలవడం అసాధ్యమనుకొన్నారు. బ్రహ్మతేజస్సుతో బలి పోషితుడైనాడు. దేవగురువు బృహస్పతి "ఈసారి మీరు బలిని జయింపలేరు. స్వర్గం విడిచి పారిపొండ"ని చెప్పాడు.

అమరధామము అసురరాజధాని అయింది. శుక్రాచార్యుడు బలికి

ఇంద్రపదవి స్థిరపడటం కోసం, అతనిచేత అశ్వమేధయాగం ప్రారంభింపజేశాడు. లోకంలో బలిని ఎదిరించే మొనగాడెవ్వడూ లేకుండా పోయాడు.

దేవమాత అదితి తన పుత్రులు దేవనగరి నుంచి పారిపోయి, అజ్ఞాతంగా తలదాచుకోవలసి వచ్చినందుకు దుఃఖపడ్డది. అదితి భర్త కశ్యపమహర్షి ఒక ఉపాయం ఆలోచించాడు. తమ సంతానాన్ని కాపాడుకోవాలంటే శ్రీహరిని సర్వాత్మనా శరణువేడుకోవాలి. ఆరాధించాలని నిశ్చయించి అదితికి చెప్పాడు. అదితి ఫాల్గున శుక్లపక్షం నుంచి పన్నెండు రోజులు దీక్షగా పయోవ్రతం చేసింది. శ్రీహరి సాక్షాత్కరించాడు. శంఖచక్రగదాపద్మధారిగా, చతుర్భుజుడుగా దర్శనమిచ్చిన శ్రీహరి అదితి కోరిక నెఱిగి ఆమె గర్భంలో ప్రవేశించాడు. వామనుడుగా జన్మించాడు. కశ్యపమహర్షి ఋషిసముదాయంతో కూడి వామనునికి ఉపనయన సంస్కారం జరిపించాడు.

వామన భగవానుడు పిత్రాజ్ఞతో బలిచక్రవర్తిని చూడబోయాడు. నర్మదానదీ తీరాన అసురేంద్రుడైన బలిచక్రవర్తి అశ్వమేధయాగంలో దీక్షితుడై ఉన్నాడు. అది బలి చేసిన చివరి అశ్వమేధయాగం.

ఛత్రం, పలాశదండం, కమండలువు చేతబట్టి వామనుడు బలిచక్రవర్తి దగ్గరికి వెళ్లాడు. అగ్నిదేవునిలాగా మహాతేజస్వియైన వామన బ్రహ్మచారిని బలి చక్రవర్తి చూచి ఆశ్చర్యపడ్డాడు. అతని చెంతనే శుక్రాచార్యుడున్నాడు.

బలిచక్రవర్తి లేచి ఆ వామనబ్రహ్మచారి పాదాలకు మ్రొక్కి నీకు ఏమి కావాలో చెప్పు తప్పకుండా ఇస్తానని వాగ్దానం చేశాడు.

నాకు మూడడుగుల నేల చాలునన్నాడు వామనుడు. "ఇంకా ఏమైనా అడుగు, నా రాజ్యాన్ని అడుగు, తప్పక ఇస్తాను" అన్నాడు మహాదాత బలి చక్రవర్తి.

"నాకు మూడడుగుల నేలమాత్రమే చాలును. అది ఇస్తే భువనమంతా ఇచ్చినట్లు"అన్నాడు వామనుడు.

"బలీ! అతడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. అతనికేమీ ఇవ్వవద్దు" అని శుక్రాచార్యుడు బలిని హెచ్చరించాడు.

అతడు శ్రీమహావిష్ణువే అయితే నేను చేసిన యజ్ఞం సంపన్నమైనట్లే. అతడడిగిన మూడడుగులు ఇస్తానని గురువుతో అన్నాడు బలిచక్రవర్తి.

"నీ ఐశ్వర్యమంతా నశిస్తుంది" అని కోపంతో శపించాడు శుక్రాచార్యుడు. పోనిమ్మన్నాడు బలి. వామనునికి మంత్ర పూర్వకంగా మూడడుగుల నేల దానం చేశాడు.

వెంటనే వామనుడు త్రివిక్రముడైనాడు. ఒక అడుగునకు భూమి సరిపోయింది. రెండవ అడుగు బ్రహ్మలోకం పైకి పోయింది. ఆ విష్ణుపాదానికి బ్రహ్మదేవుడు అభిషేకం చేశాడు. విష్ణుపాదోదకాన్ని తన కమండలువులో నింపుకొన్నాడు. అదే గంగానది, విష్ణుపదీ ప్రవాహమయింది.

త్రివిక్రముడు మూడవ పాదం మోపడానికి స్థానం లేకుండా పోయింది. "నీవాగ్దానాన్ని విడిచి పెడితే నరకవాసం అనుభవించవలసి వస్తుంది సుమా" అని బలిని హెచ్చరించాడు త్రివిక్రముడు.

ఆ మూడవ పాదం "నా శిరసుమీద ఉంచు" అని బలి ప్రార్థించాడు. త్రివిక్రముడు బలి శిరసుపై తన పాదముంచి, గరుత్మంతుని చేత అతణ్ని బంధింపజేశాడు.

"ఓ మహాదాతా! బలిచక్రవర్తీ! నీవు తర్వాతి మన్వంతరంలో దేవేంద్రుడవవుతావు. అంతవరకు నీవు సుతలంలో నివసించు. నేను గదాపాణినై నిత్యము నీ ద్వారం దగ్గర కాపలా కాస్తుంటాను" అని దయామయుడైన భగవానుడు బలిని ఓదార్చాడు.

శ్రీహరి కృపకు సంతృప్తి చెంది బలిచక్రవర్తి స్వర్గాధికైశ్వర్య సంపన్నమైన సుతలానికి తన పరివారంతో వెళ్లిపోయాడు. శ్రీహరి ఆజ్ఞతో శుక్రాచార్యుడు ఆ యజ్ఞశేషాన్ని పూర్తిచేశాడు.

ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వచ్చాడు. వామనునికి ఉపేంద్ర పదవిని ప్రదానం చేశాడు. ఇంద్రుణ్ని రక్షిస్తూ ఉపేంద్రుడు అమరావతిలో అధిష్ఠించాడు.

సుతలంలో బలిచక్రవర్తికి మహావిష్ణువు గదాపాణియైన ద్వారపాలకుడుగా

ఉన్నాడు. త్రేతాయుగంలో రావణాసురుడు బలిని జయించడానికి సుతలం లోనికి ప్రవేశించాడు. నేను బలితో యుద్ధం చేయడానికి వచ్చానని అక్కడున్న ద్వారపాలకునికి చెప్పాడు. ఆద్వారపాలకుడు కోపించి రావణుణ్ని కాలితో ఒకతన్ను తన్నాడు. ఆ దెబ్బకు రావణుడు నూరుయోజనాల దూరాన ఉన్న లంకలోనికి వచ్చిపడ్డాడు.

పోతన రచించిన శ్రీమద్భాగవతం అష్టమస్కంధంలో వామనావతార ఘట్టం చదువుకొని భావుకులైన భక్తులు ఆనందానుభూతిని పొందుతారు.

**పాలను వెన్నయు ముచ్చిల**
**రోలను మీతల్లి గట్టి రోషముతోడన్**
**లీలావినోది వైతివి**
**బాలుడవా? బ్రహ్మగన్న ప్రభుడవు కృష్ణా! 84**

కృష్ణా! పాలను, వెన్నయున్, నీవు, ముచ్చిలన్= దొంగిలింపగా, మీ తల్లి= మీతల్లి అయిన యశోద; రోషముతోడన్=కోపముతో; ఱోలన్=రోటికి; కట్టన్= కట్టివేయగా; లీలా వినోదివి = విలాసముతో వినోదించువాడవు; ఐతివి= అయినాడవు; బాలుడవా = (నీవు) పసివాడవా? బ్రహ్మన్= చతుర్ముఖ బ్రహ్మను, కన్న = కన్నట్టి, ప్రభుడవు = సర్వలోక నియంతవు.

కృష్ణా! నీవు పాలువెన్నలను దొంగిలించావని మీ అమ్మ యశోద కోపంతో నిన్ను రోటికి కట్టివేసింది. అప్పుడు నీవు బండెద్దు ఆట ఆడి వినోదించావు. యమలార్జున మోక్షలీల జరిపావు. స్వామీ! నీవు పిల్లవాడవా? బ్రహ్మను కన్నతండ్రివి.

యశోద తాళ్లతో శ్రీకృష్ణుణ్ని రోటికి కట్టివేసిందువల్ల ఆయన దామోదరు డయ్యాడు. శ్రీకృష్ణుడు బండెద్దువలె ఆ రోటిని దొడ్లో ఉన్న పాతకాలపు రెండు మద్దిచెట్ల మధ్యకు చేర్చి లాగాడు. ఆ మహావృక్షాలు రెండు పెళ్లున పెల్లగిలి పడిపోయాయి. ఆ చెట్ల నుండి ఇద్దరు తేజస్వులైన పురుషులు వెలువడ్డారు. వారు పూర్వ జన్మలో ధనాధిపతి అయిన కుబేరుని పుత్రులు. ఒకడు నలకూబరుడు, రెండవవాడు మణిగ్రీవుడు.

వీరిద్దరికి తండ్రి సంపత్తి పుష్కలంగా లభించింది. ఆర్షేయమైన దమములేనివాని సంపత్తి ద్యూతానికి, వ్యభిచారానికి, మాంసమదిరాపానానికి అనేక దుర్గుణాలకు జన్మదాత అవుతుంది. వీరిద్దరు ధనమదాంధులై మదిరాపానం చేసి గంగానదిలో దిగంబరలైన యువతులతో జలక్రీడలాడుతున్నారు. విలాస పురుషులు తీర్థమర్యాదలను పాటించరు. విలాస స్త్రీ పురుషులు నగ్నంగా పవిత్రగంగాది నదులలో క్రీడిస్తే అందున్న అధిదేవతలు ఆ తీర్థాలనుంచి వెళ్లిపోతారని శాస్త్రం చెబుతున్నది. "గంగాది తీర్థవర్యేషు దుష్టై రావృతేశ్చిహ, తిరోహితాధిదైవేషు కృష్ణ ఏవ గతిర్మమ".

నారదమహర్షి అక్కడికి వచ్చి, వారిని చూచి దుఃఖితుడయ్యాడు. నారదుడు చూచినప్పటికి అక్కడివారు సిగ్గుపడి తమ శరీరాలకు వస్త్రాలను కప్పుకోలేదు. తమ శరీరాలను భోగవిలాసాలకు మాత్రమే ఉపయెగించేవారు మరుజన్మలో వృక్షాలై జన్మిస్తారు. నారదుడు వారిని "మీరు మద్ది చెట్లు కండి" అని శపించాడు. ఆ శాపవాక్యాలు విని కుబేరపుత్రులిద్దరు నారదుని కాళ్లపై పడి శాపమోక్షం ప్రసాదించుమని వేడుకొన్నారు.

"గోకులంలో నందుని ఇంటి దొడ్డిలో మీరు వృక్షాలుగా ఎదిగి, శ్రీకృష్ణుని పాదస్పర్శతో మీరు ఉద్ధరింపబడతారు" అని ప్రసన్నుడై శాపమోక్షం ప్రసాదించాడు. సత్పురుషుల శాపం ఆశీర్వాదంతో సమానమవుతుంది. అంతటి భోగపరాయణు లైన నలకూబర మణిగ్రీవులకు శ్రీకృష్ణభగవానుని దర్శనమయింది.

రోటికి కట్టబడిన సౌందర్యమాధుర్యనిధి అయిన శ్రీకృష్ణుడు వారిని చూచి చిర్నవ్వు నవ్వాడు. "దామ్నా చోలూఖలే బద్ధః ప్రహసన్నాహ గుహ్యకౌ". ఎందుకంటే "సర్వదా నేను ముక్తుణ్ని. బద్ధజీవులు నన్ను స్తుతిస్తారు. ఇప్పుడు నేను బద్ధుడనయ్యాను. ముక్తజీవులు అయిన మీరు నన్ను స్తుతిస్తున్నారు". ఈ విపరీత దశకు కృష్ణుడు చిర్నవ్వు నవ్వాడని మహాకవి హరిసూరి చక్కని అర్థం చెప్పాడు.

ముక్తోహ మస్మి యదముక్తజనస్తుతాంఘ్రి
ర్యుక్తం తదేత దధునా తు తదన్యథైవ

ఇత్యాత్మచిత్ర చరితోల్లసితాంతరంగ

తోషః స ఏష భగవానుచితం జహాస - శ్రీభక్తిరసాయనమ్

తన చిత్రమైన చరిత్రకు తానే సంతోషపడుతూ శ్రీకృష్ణుడు కుబేరపుత్రులను చూచి నవ్వడం ఉచితమే అంటాడు హరిసూరి. జగన్మోహినియగు మాయయే శ్రీకృష్ణుని మందస్మితము. "హాసో జనోన్మాదకరీ చ మాయా" ఈ అనంత సృష్టి ఆ మాయాదేవి కటాక్షవిక్షేపము మాత్రమే.

సంస్కృతసాహిత్యంలో గుణశబ్దానికి, సద్గుణమని, సత్వగుణమని, త్రాడు అని అర్థాలున్నాయి. భగవంతుడు సగుణుడై యున్నప్పుడే దర్శించడానికి సులభమవుతుంది. ఆయన నిర్గుణుడైతే ధ్యానధారణ స్మరణలకుగాని, దర్శించడానికిగానీ అనుకూలం కాదు.

యావదేష సగుణోఽస్తి సౌఖ్యద స్తావదేవ సులభశ్చ చక్షుషా

నిర్గుణస్తు నహి చేతసాఽప్యలం ద్రష్టుమిత్యనుగతౌ తథైవ తౌ

- శ్రీభక్తిరసాయనమ్

"నిర్గుణ పరబ్రహ్మ మనస్సుకే అందదు. ఇక కంటితో చూడటం ఎలా పొసగుతుంది?" అని ప్రశ్నిస్తాడు హరిసూరి.

శ్రీకృష్ణుడు రోటిమీదికెక్కి ఉట్టిలోని వెన్నను దొంగిలించాడు. రోలుకూడా కృష్ణుడికి సహాయపడి అపరాధం చేసింది కనుక, యశోద ఆ రోటితో సహా కృష్ణుణ్ని బంధించాలని నిశ్చయించింది. తాడొకటి తీసుకవచ్చి కృష్ణుని బొజ్జకు కట్ట బోయింది. అది రెండంగుళాలు తక్కువైంది. మరొకతాడు తెచ్చిదానికి ముడివేసి కృష్ణుని బొజ్జకు కడుతుంటే అదికూడా తక్కువైంది. ఇంట్లో ఉన్న తాళ్లన్నీ తెచ్చి శ్రమపడి ముళ్లు వేసి కట్టడానికి పూనుకొన్నది. అప్పటికి, ఆ పెద్దతాడు సగము తక్కువయింది. తల్లి అవస్థనుచూచి జాలిపడి కృష్ణుడు ఆ త్రాళ్లకు, తల్లిప్రేమకు బద్ధుడైనాడు. దామోదరుడైనాడు. లీలావినోది అయినాడు. భగవంతుడు ఇతరుల బంధాలను తొలగిస్తాడు. ప్రేమభక్తి గలవారి బంధాలకు బద్ధుడవుతాడు. తల్లి పట్టుదలను చూచి తన పట్టుదలను వదలుకొన్నాడు.

వాత్సల్యప్రేమకు కృష్ణుడు దుర్బలుడైనాడు. ప్రేమ సమక్షంలో శక్తి దుర్బలమవుతుంది. మహాతపస్వులు భగవంతుని గుర్తెరుగగలరు. దర్శించగలరు కాని, ఆయన్ను కట్టివేయలేరు. ఈ విషయంలో యశోద విజయం పొందింది.

ఇది శ్రీకృష్ణుని భక్తపూజాగ్రహణలీల. "తస్కరాణాం పతయే నమః" అను యజుర్వేద (13-21) వాక్యాన్ని యథార్థం చేశాడు శ్రీకృష్ణ భగవానుడు. భక్తులు తనకోసం దాచిపెట్టిన నవనీతాన్ని స్వీకరించి వారి ప్రేమోపహారాన్ని ఆమోదించాడు.

గోపకులు ఇలా ప్రార్థించారని అథర్వవేదం(2-13-1) చెబుతున్నది. "ఘృతం పీత్వా మధు చారు గవ్యం పితేవ పుత్రానభిరక్షతాదిమమ్" "హే భగవన్ నీవు నవనవమైన నవనీతాన్ని స్వీకరించి, తండ్రి తన సంతానాన్ని రక్షించి నట్లుగా మమ్మల్ని సంరక్షించు" అని గోపికాగోపకులు వేడుకొన్నారు. "మా నః ప్రియా భోజనాని ప్రమోషీః" మా భోజనాదులను మాత్రం హరించవద్దు. తస్కరుల ప్రభువా! నీకు నమస్కారము" అని ఈ శ్రుతికి అర్థము.

నిజమునకు శ్రీకృష్ణుడు వెన్నదొంగ కాదు. వెన్న అంటే శ్రీకృష్ణునికి చాలా ఇష్టమని తెలుసుకొని వెన్నపిడతను తమ యింట ఒకచోట అందుబాటుగా పెట్టుకొని, శ్రీకృష్ణుడు ఏదారినుండి వచ్చునో, ఉట్టిపై ఉన్న వెన్నను ఎట్లు తీసికొని తినునో చూడవలెనన్న వాత్సల్యయుతమైన కోరికగలవారు గోపికలు. వారి కోర్కెలను తీర్చుటకే శ్రీకృష్ణుడు వెన్నదొంగ అయినాడు.

"నీతం యది నవనీతం నీతం నీతం చ కిం తేన
ఆతపతాపితభూమౌ మాధవ! మా ధావ - మా ధావ

వెన్నదొంగిలించి ఎండలో పరుగిడుతున్న శ్రీకృష్ణచంద్రుని చూచి ఒక గోపిక ప్రేమ విహ్వాలయై ఇట్లన్నది. "ఓ కృష్ణా! నీవు వెన్న తీసుకో ఎంతయినా తీసుకో, అందువల్ల మాకు నష్టమేమున్నది? కాని, మధ్యాహ్నం మండుటెండలో కాళ్లుకాలుతుండే ఈనేలమీద పరుగెత్తకు - పరుగెత్తకు" అన్నది. దొంగిలించి పారిపోతున్న వ్యక్తిని చూచి ఎవరైనా ఇలా అంటారా? గోపికా ప్రేమ అట్టిది. మాటలతో చెప్పనలవి కాని కృష్ణ ప్రేమఅది. రసస్నేహము, మమతామయమైన

వాత్సల్యము వారిది.

నాయం సుఖాపో భగవాన్ దేహినాం గోపికాసుతః

జ్ఞానినాం చాత్మభూతానాం యథా భక్తిమతామిహ - (శ్రీమద్భా 10-9-21

గోపికానందనుడైన శ్రీకృష్ణుడు అనన్యప్రేమికులైన భక్తులకు అత్యంత సులభుడు. దేహాభిమానంగల కర్మయోగులకు, జ్ఞానులకు, తపస్వులకు అతడు భక్తులకయినంత సులభుడు కాడు. జ్ఞానము పురుషునివంటిది. భక్తి స్త్రీవంటిది. ఎంతవైరాగ్యవంతుడైనను పురుషుడు మాయానారికి వశమవుతాడు. భక్తినిచూస్తే మాయానారి భయపడి పారిపోతుంది.

శ్రీకృష్ణుడు యోగీశ్వరులకు, మునీశ్వరులకు ఆత్మారాముడైనప్పటికి ఆకలితో ఉంటాడు. తాను పూర్ణకాముడైనప్పటికి అతృప్తుడవుతాడు. శుద్ధసత్వ స్వరూపుడైనప్పటికి క్రోధం వహిస్తాడు. స్వారాజ్యలక్ష్మీయుక్తుడైనప్పటికి చౌర్యం చేస్తాడు. మహాకాలునికి, యమునికి భయం కలిగించేవాడైనప్పటికి తాను తల్లికి భయపడి పరుగెత్తుతాడు. మనస్సుకంటె తీవ్రగతి గలవాడైనప్పటికి తల్లి చేతులకు చిక్కుతాడు. తాను ఆనందమయుడైనప్పటికి దుఃఖపడతాడు. కళ్లు నులుముకొంటూ ఏడుస్తాడు. తాను సర్వవ్యాపకుడైనప్పటికి బంధింపబడతాడు. ఇవన్నీ శ్రీకృష్ణభగవానుని భక్తవశ్యతాలీలలు మాత్రమే. విశ్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు వాత్సల్యభక్తికి లోనై రోటికి బంధింపబడ్డాడు! లీలాశుకుడిలా పండితులకు ప్రబోధించాడు.

"వర మిమ ముపదేశ మాద్రియధ్వం

నిగమవనేషు నితాంతచారఖిన్నాః

విచినుత భవనేషు వల్లవీనాం

ఉపనిష దర్థ ములూఖలే నిబద్ధమ్" - శ్రీకృష్ణకర్ణామృతము

"ఓపండితులారా! వేదమనే అరణ్యంలో అవిశ్రాంతంగా తిరిగి ఎందుకు అలసిపోతారు? నా విజ్ఞాపనను శ్రద్ధగా వినండి. మీకు ఉపనిషత్తుల సారాంశం తెలుసుకోవాలని నిజంగా ఉంటే గోపికల ఇళ్లల్లో శ్రద్ధగా వెదకండి. అక్కడ మీకు

అది రోటికి కట్టబడినదై కనిపిస్తుంది".

శ్రీకృష్ణుణ్ని బంధించే వస్తువులు మూడు మాత్రమే ఉన్నాయని చమత్కరించాడు లీలాశుకుడు. రోలుగాని, యోగీశ్వరుల మనస్సుగానీ, గోపాంగనల కుచకుట్మలంగానీ కృష్ణుడనే కరికలభాన్ని ఈమూడు మాత్రమే బంధించగలుగుతాయట!

"ఉలూఖలం వా యమినాం మనో వా
గోపాంగనానాం కుచకుట్మలం వా
మురారినామ్నః కలభస్య నూనం
ఆలాన మాసీ త్త్రయమేవ భూమౌ". - శ్రీకృష్ణకర్ణామృతము

**రఘునాయక నీరూపము**
**లఘుమతితోఁ దలపఁగలనె లక్ష్మీరమణా!**
**అఘములఁబాపుము దయతో**
**రఘురాముడవైన లోకరక్షక! కృష్ణా! 85**

కృష్ణా! రఘునాయక= రఘువంశానికి నాయకుడవైన ఓ శ్రీరామా! నీనామము = నీరామనామము; లఘుమతితో = అల్పబుద్ధితో, తలపగలనె = తలచుకోగలనా? లక్ష్మీరమణా=లక్ష్మీనాథా! రఘురాముడవైన= శ్రీరామచంద్రుడవైన, లోకరక్షక = లోకమును రక్షించిన, నీవు, దయతో నా అఘములను = నా పాపాలను, పాపుము = పోగొట్టుము.

కృష్ణా! శ్రీరామావతారమున నీవే రక్షకుడవు, నన్ను రక్షించుము అని యాచించిన సమస్త జీవులకు అభయమిచ్చెదనని శపథముచేసి యున్నావు. అట్టి నిన్ను అల్ప బుద్ధితో ఎట్లు తలపగలను? నీవు ప్రపంచమును కాపాడినవాడవు. నా పాపములను పోగొట్టి నన్నును కాపాడుము.

శ్రీరామనామాన్ని స్మరించడానికి కాల నియమంలేదు. శౌచాశౌచ నిర్ణయము లేదు. ఏఅవస్థలోనైనా శ్రీరామనామం ధ్యానించవచ్చు.

"న దేశకాలనియమః శౌచాశౌచ వినిర్ణయః
పరం సంకీర్తనాదేవ రామరామేతి ముచ్యతే"

**అప్పా! ఇత్తువు దయతో**
**నప్పాలను నతిరసంబు లనుభవశాలీ!**
**అప్పా! ననుఁ గనుఁగొనవే**
**అప్పా! ననుఁబ్రోవు వేంకటప్పా! కృష్ణా! 86**

కృష్ణా! అప్పా = తండ్రీ! అనుభవశాలీ = అనుభవం కలవాడా! వేంకట+అప్పా! = శ్రీ వేంకటేశ్వరా, పాపాలను పోగొట్టువాడా, దయతో, ననున్, కనుగొనవే = చూడుమా!

కృష్ణా ! శ్రీవేంకటేశ్వరా! నీవు అప్పాలను అతిరసాలను దయతో ప్రసాదంగా ఇస్తావు. నన్ను దయతో చూడు. కాపాడు తండ్రీ!.

శ్రీవేంకటేశ్వరుడు శ్రీకృష్ణుడే. గీతలో "మన్మనా భవ, మద్భక్తో, మద్యాజీ, మాం నమస్కురు" "నాయందే మనసుంచు, నా భక్తుడవుకా, నన్ను గురించి యజ్ఞం ఆచరించు, నాకు నమస్కరించు" అని అర్జుననకు ప్రబోధించి అభయదానం చేస్తున్న శ్రీకృష్ణ భగవానుడే శ్రీవేంకటపతి.

వరాహపురాణంలో పద్మావతీదేవి తన చెలికత్తెలతో శ్రీవేంకటేశ్వరుని నీపేరేమి అని అడిగిస్తుంది. అప్పుడాయన తాను కృష్ణుడనని పేర్కొన్నాడు.

యస్య నామాన్యనంతాని పావనాని మనీషిణాం
వర్ణతో నామత శ్చాపి కృష్ణం ప్రాహు స్తపస్వినః - వరాహపురాణం 3-5-44

"ఎవనినామములు అనంతములో, పావనములో, అట్టి నన్ను తాపసులు రంగును బట్టి, పేరునుబట్టి, కృష్ణుడు అంటారు" అని.

**కొంచెపువాఁడని నను మఱి**
**కుంచకుమీ వాసుదేవ గోవింద హరీ!**
**అంచితముగ నీ కరుణకు**
**కొంచెము నధికంబు గలదె కొలదియు కృష్ణా! 87**

కృష్ణా! వాసుదేవ = విశ్వమంతట నిండి క్రీడించువాడా! గోవింద = వేదవేద్యా, హరీ = పాపాలను హరించువాడా! కొంచెపువాడని = (వీడు) అల్పుడని, నను మరి = నన్ను ఇంకను, కుంచకుము=క్రుంగజేయకుము. అంచితముగ = పూజింబడినవిధముగా, నీకరుణకు = నీదయకు, కొంచెము-అధికము అను కొలత యున్నదా?

కృష్ణా! ఇతడు అల్పుడని నన్ను మరీ క్రుంగజేయకుము. నీదయకు కొద్ది గొప్ప భేదము లేదుకదా. సర్వభూతములపట్ల సముడవు గదా!

"సమోఽహం సర్వభూతేషు" గీత 9-29. "సర్వేషు భూతేషు సమాశ్రయణీయత్వేన సమోఽహం" నన్ను ఆశ్రయించిన సర్వజీవులపట్ల నేను సముడను. "దేవతిర్యక్ మనుష్యస్థావరాత్మనా ఽవస్థితోపి, జాతిత శ్చాఽకారతః స్వభావతో, జ్ఞానత శ్చాత్యంతోత్కృష్టాపకృష్ట రూపేణ వర్తమానేషు ----" భగవద్రామానుజుల గీతాభాష్యం. సమస్తమైన భూతాలను దేవతలని, మనుష్యులని, తిర్యక్కులని, స్థావరాలని వ్యవహృతమవుతూ, జాతినిబట్టి, ఆకారాన్ని బట్టి, స్వభావాన్ని బట్టి, జ్ఞానాన్ని బట్టి ఎక్కువ తక్కువలుగా వ్యవహరిస్తుంటారు. అయినా వాటి ఎక్కువ తక్కువలను నేను పాటించను. అన్నిటికిని సమంగా ఆశ్రయింపదగిన వాడనుగా ఉంటాను అన్నాడు. కాబట్టి కొంచెపువానిని క్రుంగజేయువాడు కాడు శ్రీకృష్ణుడు.

**వావిరి నీభక్తులకున్**
**కావరమున నెగ్గుసేయు గర్వాంధుల మున్**
**దేవ! వధించుట వింటిని**
**నీ వల్లను భాగ్యమయ్యె నిజముగ కృష్ణా! 88**

కృష్ణా! వావిరిన్= అధికముగా; నీభక్తులకును, కావరమున = మదముతో ఎగ్గుసేయు = హాని కలిగించు; గర్వ+అంధులన్ = గర్వముచే గ్రుడ్డియైన వారలను, మున్=పూర్వము, ఓదేవా!, నీవు వధించుట విన్నాడను. నీవల్లను, నిజముగా, భాగ్యమయ్యెను. నీభక్తులకు నీవల్లనే శ్రేయము కలిగెను.

కృష్ణా! నీభక్తులకు హాని కలిగించే మదమత్తులను నీవు వధించియున్నాడని వింటిని. వారికి నీవల్లనే శ్రేయము కలిగినది. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం" అను శ్రీముఖోక్తిని ఇక్కడ అనుసంధించుకోవాలి.

శ్రీకృష్ణుడు భక్తత్రాణపరాయణుడు. ఆపదుద్ధారకుడు. పరమ కరుణాసముద్రుడు. కర్మజ్ఞానయోగాలకంటె భక్తియోగమే మొదటిది. జీవుల సంఖ్య పెరిగిన తర్వాత కర్మ జ్ఞాన యోగాలు ఏర్పడినవి. కర్మ జ్ఞానయోగాల ప్రచారము అధికంకాగా శ్రీకృష్ణుడు మరల భక్తియోగాన్ని గీతోపనిషత్తుద్వారా ప్రవర్తింపజేశాడు. కర్మజ్ఞానయోగాలు లేక పోయినప్పటికి, ముఖ్యముగా ఆచరింపదగినది భక్తియోగమే అని స్పష్టంగా చెప్పాడు శ్రీకృష్ణభగవానుడు.

భక్తియోగము సనాతనమైనది. కర్మజ్ఞానయోగాలు కాలక్రమాన ఆవశ్యకమైనవి కావున అవిరెండు ఆధునికమైనవని చెప్పవలసి యున్నది. వాటి సాధనల ఫలంకూడా అల్పమైనదే. కావున భక్తియే అవశ్యకర్తవ్యత కలది.

**అయ్యా! పంచేంద్రియముల**
**నుయ్యాలల నూచినట్టు లూచఁగ నేనున్**
**చయ్యనఁ గలఁగుచు నుంటిని**
**కుయ్యాలింపుము మహాత్మ! గుఱుతుగ కృష్ణా! 89**

కృష్ణా! పంచ+ఇంద్రియములున్; త్వక్కు (చర్మము), చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము ఈ అయిదు జ్ఞానేంద్రియాలు, నన్ను, ఉయ్యాలలో ఉంచి ఊపినట్టులుగా; నన్ను ఊపగా, నేనున్ = నేనుకూడా, చయ్యనన్ = శీఘ్రముగా, కలగుచున్+ఉంటిని, కల్లోలపడుచున్నాడను. మహాత్మా=ఓ పరమాత్మా, గుఱుతుగ = గుర్తుపెట్టుకొని, కుయ్యి+ఆలింపుము = నా మొరను ఆలకింపుము.

కృష్ణా! నా పంచేంద్రియాలు నన్ను ఉయ్యాలలో ఉంచి ఊపుతున్నాయి. నేను కలవరపడిపోతున్నాను. నన్ను రక్షించి నా దీనాలాపాలను ఆలకించుము.

**కంటికి రెప్ప విధంబున**
**బంటుగదా యనుచు నన్ను బాయక యెపుడున్**
**జంటయు నీవుండుట నే**
**కంటకమగు పాపములను గడచితి కృష్ణా! 90**

కృష్ణా! బంటు గదా = ఇతడు నా సేవకుడు కదా, అనుచు కంటికి రెప్ప విధంబున = కంటిని కాపాడు రెప్పవలె, ఎపుడున్ = నిరంతరము, జంటగా, నాతోపాటు నీవుండుట వలన, నేను, కంటకము+అగు = ముళ్లవలె బాధపెట్టే పాపములను, కడచితిని = దాటుకొంటిని.

కృష్ణా! ఇతడు నాసేవకుడని, కంటిని కాపాడు రెప్పవలె నన్ను నీవు అంటిపెట్టుకొని యుండుట వల్ల నేను కంటకమగు పాపమార్గమును దాటగలిగితిని.

**యమునికి నిఁక నే వెఱవను**
**కమలాక్ష! జగన్నివాస! కామితఫలదా!**
**విమలమగు నీదు నామము**
**నమరగఁ దలఁచెదను వేగ ననిశము కృష్ణా! 91**

కృష్ణా! కమలాక్ష=పద్మములవంటి నేత్రములు గలవాడా! జగత్+నివాస= వాసుదేవా! కామితఫలదా=అభీష్టఫలములను ఇచ్చువాడా!, ఇక నేను, యమునికి నేను; వెఱవను=భయపడను. విమలమగు=నిర్మలమగు(అప్రాకృతమగు) నీదు నామము=నీశుభనామము, అనిశము=ఎల్లప్పుడు, అమరగన్=ఒప్పునట్లుగా, తలచెదను = చింతన చేసెదను.

కృష్ణా! ఇకపై నేను యమధర్మరాజునకు భయపడను. అప్రాకృతమగు నీ శుభనామమును నిరంతరము స్మరించెదను.

శ్రీకృష్ణనామం స్మరించేవారికి యమధర్మరాజుపట్లగాని, అతని దూతల పట్లగానీ, ఏమాత్రం భయం ఉండదు.

"దేవకీతనయ పూజన పూతః
పూతనారి చరణోదక ధూతః
యద్యహం స్మృతధనంజయదూతః
కిం కరిష్యతి స మే యమదూతః"

"దేవకీ తనయుడైన కృష్ణుని పూజించటం వల్ల పవిత్రుడనై, పూతనను సంహరించిన కష్ణుని పాదోదకం గంగవల్ల సమస్తపాపాలను కడిగివేసుకుని, అర్జునుని దూతఅయిన కృష్ణుని స్మరిస్తూ నేనుంటే, నన్నాయమదూత ఏమి చేయగలడు?"

భగవన్నామానికి అమోఘమైనశక్తి ఉన్నది. దాని ద్వారా మనుష్యుడు బహుశీఘ్రంగా కళ్యాణాన్ని పొందుతాడు. నామపరాయణత యందు, భగవన్నామము నందు పరిపూర్ణమైన విశ్వాసం ఉండాలి; భగవన్నామం పట్ల ఆదరబుద్ధి ఉండాలి; భగవన్నామం పట్ల ప్రేమ ఉండాలి; నిష్కామభావం ఉండాలి; నిరంతర నామచింతనం ఉండాలి; ఆ చింతన రహస్యంగా జరగాలి. ఈ ఏడు చాలా ముఖ్యమైనవి. ఈభావాలతో భగవన్నామాన్ని ఆశ్రయించినవారికి భగవన్నామ ప్రభావం అతిశీఘ్రంగా దర్శనమిస్తుంది.

భగవన్నామ మహిమనుగూర్చి అనేక శాస్త్రములు, పెక్కండ్రు మహాత్ములు చెప్పిన విషయములన్నియు పరమ సత్యాలన్న విశ్వాసము నామచింతకునికి ఉండటం ముఖ్యం.

**దండమయా! విశ్వంభర!**
**దండమయా! పుండరీకదళనేత్ర! హరీ!**
**దండమయా! కరుణానిధి!**
**దండమయా! నీకు నెపుడు దండము కృష్ణా! 92**

కృష్ణా! విశ్వంభర=విశ్వమును భరించిన వాడా! పుండరీకదళ నేత్ర=తెల్లతామర పువురేకులవంటి నేత్రములు కలవాడా! కరుణానిధి= దయకు పెన్నిధి అయిన వాడా! నీకు ఎల్లప్పుడు అనేక నమస్కారములు. విశ్వరూపము

చూపినవాడు నరాకృతిగల పరబ్రహ్మము శ్రీకృష్ణుడు. విశ్వరూపము శ్రీకృష్ణ రూపాధీనము .

'పుండరీకాక్ష గోవింద' అని భగవన్నామ చింతనం చేసేవారికి నేత్ర వ్యాధి తొలగిపోవునని శాస్త్రగ్రంథములు చెబుతున్నవి

**నారాయణ! లక్ష్మీపతి!**
**నారాయణ! వాసుదేవ! నందకుమారా!**
**నారాయణ! నిను నమ్మితి**
**నారాయణ! నన్నుఁబ్రోవు నగధర! కృష్ణా!** 93

కృష్ణా! నారాయణ=శ్రీమన్నారాయణా! లక్ష్మీపతి= లక్ష్మీనాథా, వాసుదేవ= జగత్తునందంతట వ్యాపించి క్రీడించువాడా! నందకుమారా!= నందుని పుత్రా. నిను నమ్మితి, నన్ను, ప్రోవుము = కాపాడుము ఓ నగధర = ఓ గిరిధారీ కృష్ణా!

కృష్ణా! నీవు నారాయణుడవు, లక్ష్మీనాథుడవు, వాసుదేవుడవు, నందుని కుమారుడవు, గిరిధారివి నిన్ను నమ్ముకొంటిని, నన్ను కాపాడుము.

ఈ పద్యంలో నారాయణ - వాసుదేవ శబ్దాల అర్థాలు పరమరహస్యమైనవి. సాధకులు వీటి అర్థాలను ఆచార్యులసన్నిధిలోనే తెలుసుకొనడం ఆచారంగా ఉంది.

"నారాయణాయ విద్మహే" నారాయణుని కొరకు చింతించుము. "నారాయణ పరంబ్రహ్మ" నారాయణుడే పరబ్రహ్మము. "ఏకో నారాయణ ఆసీత్" నారాయణుడొకడే ఉన్నాడు. "అథ పునరేవ నారాయణః" ఆ తర్వాత కూడా నారాయణుడే ఉంటాడు. "చక్షుశ్చ ద్రష్టవ్యం చ నారాయణః" చూచేది, చూడ దగినవాడు, వినదగినవాడు నారాయణుడే. "దివ్యో దేవ ఏకో నారాయణః' ' దివ్యుడగు దేవుడు నారాయణుడొకడే అని వేదమంత్రాలు ఘోషించుచున్నవి. "యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" - నారాయణోపనిషత్తు. ఈ కనిపించే వినిపించే సమస్త జగత్తు లోపలను బయటను ఉన్నవాడు నారాయణుడే అని శ్రుతి

చెప్పుచున్నది.

వాసుదేవుడు:- 'వాసుః' అనగా సూర్యుడు తన కిరణాలచే ఆవరించునట్లు ప్రపంచమంతటా వ్యాపించి, తనయందు దానిని వసింపజేసి, తాను దానియందు వసించి క్రీడించువాడు. వసుదేవునికి పుత్రుడుగా అవతరించినవాడు అనేది సామాన్యార్థం.

**తిరుమణి దురితవిదూరము**
**తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్**
**తిరుమణి పెట్టిన మనుజుడు**
**పరమపవిత్రుండు భాగ్యవంతుడు కృష్ణా! 94**

కృష్ణా! తిరుమణి= శ్వేతమృత్తిక (తెల్లమట్టి) దురితవిదూరము=పాపములను తొలగించునది. సౌభాగ్యకరము=సంపదలను కలిగించునది. త్రిజగములందున్= ముల్లోకములందును, తిరుమణిని బొట్టుగా పెట్టుకొన్న మనుష్యుడు, పరమ పవిత్రుడు = మిక్కిలి పరిశుద్ధుడు, భాగ్యవంతుడు అగును.

కృష్ణా! తిరుమణి, ఉర్ధ్వపుండ్రముగా పెట్టుకొనుటచేత అది పాపములను తొలగించును. ఊర్ధ్వపుండ్రము సౌభాగ్యకరము. తిరుమణితో ఊర్ధ్వపుండ్రము లను ధరించినవాడు ముల్లోకములందును పరమపవిత్రుడు, సౌభాగ్యవంతుడు అగును.

ప్రశస్తే పర్వతాగ్రాదౌ జాతయా శ్వేతమృత్స్నయా
ఊర్ధ్వపుండ్రం తతః కార్యం వైష్ణవైస్తు విశేషతః
ఊర్ధ్వపుండ్రం తథా చక్రం నిత్యం ధారయతే జనః
శుభాని తస్య వర్ధంతే త్వశుభాని ప్రణశ్యతి - వృద్ధ మనుప్రోక్తం

తిరుమణి ఊర్ధ్వపుండ్రములు మధ్య శ్రీచూర్ణరేఖ వైష్ణవుల ముఖచిహ్నము అది శుభప్రదమైనది. అమంగళములను పారద్రోలునది. అపమృత్యువు బారినుండి తప్పించునది. యమధర్మరాజునకు భీతి కలిగించునది అని వృద్ధమను వచనమే కాకుండా, పాంచరాత్రాగమము తెలుపుచున్నది.

తిరుమణి (శ్వేతమృత్తిక) పర్వతాగ్రాన లభిస్తుంది. కాబట్టి అది అతి పవిత్రమైనది అవుతుంది. శ్రీమధ్వాచార్యులవారికి శ్రీకృష్ణవిగ్రహం గోపీచందన మృత్తికలో లభించిందన్న విషయం జగత్ప్రసిద్ధం.

**సర్వేశ్వర! చక్రాయుధ!**
**శర్వాణీవినుతనామ! జగదభిరామా!**
**నిర్వాణనాథ! మాధవ!**
**సర్వాత్మక! నన్నుఁగావు సదయత కృష్ణా! 95**

కృష్ణా! సర్వ+ఈశ్వర=సమస్తమునకు నియంత అయినవాడా! చక్ర+ ఆయుధ=సుదర్శన చక్రము ఆయుధముగా కలవాడా! శర్వాణీ వినుతనామ= పార్వతీదేవి చేత కొనియాడబడిన శుభనామము కలవాడా! జగత్+అభిరామా= జగత్తునందు సుందరమైనవాడా! మాధవ=లక్ష్మీనాథా; సర్వ+ఆత్మన్= సమస్తము నకు ఆత్మఅయినవాడా! నిర్వాణనాథ=మోక్షమునకు అధిపతి అయినవాడా! సదయతన్= దయతో, నన్నున్, కావుము =నన్ను సంరక్షించుము.

కృష్ణా! నీవు సర్వేశ్వరుడవు, చక్రాయుధుడవు, పార్వతీదేవిచేత స్తుతింపబడువాడవు, జగదేక సుందరుడవు, మోక్షాధిపతివి, లక్ష్మీనాథుడవు, సర్వాత్మకుడవు, నన్ను దయతో సంరక్షింపుము.

శివుడు పార్వతీదేవికి ఆధ్యాత్మరామాయణమును బోధించెను. “శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే, సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే” శ్రీరామనామము ఒక్కటి విష్ణు సహస్రనామములతో సమానమని చెప్పెను. పద్మపురాణస్థ విష్ణు సహస్రనామములును శివుడు పార్వతికి చెప్పినవే.

**శ్రీలక్ష్మీ నారాయణ!**
**వాలాయము నిన్నుఁదలఁతు వందితచరణా!**
**ఏలుము నను నీ బంటుగ**
**జాలఁగ నిను నమ్మినాడ సరసుడ! కృష్ణా! 96**

కృష్ణా! లక్ష్మీనారాయణా, వాలాయము=నిరంతరము, నిన్ను దలతును,

చెప్పుచున్నది.

వాసుదేవుడు:- 'వాసుః' అనగా సూర్యుడు తన కిరణాలచే ఆవరించునట్లు ప్రపంచమంతటా వ్యాపించి, తనయందు దానిని వసింపజేసి, తాను దానియందు వసించి క్రీడించువాడు. వసుదేవునికి పుత్రుడుగా అవతరించినవాడు అనేది సామాన్యార్థం.

**తిరుమణి దురితవిదూరము**
**తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్**
**తిరుమణి పెట్టిన మనుజుడు**
**పరమపవిత్రుండు భాగ్యవంతుడు కృష్ణా! 94**

కృష్ణా! తిరుమణి= శ్వేతమృత్తిక (తెల్లమట్టి) దురితవిదూరము=పాపములను తొలగించునది. సౌభాగ్యకరము=సంపదలను కలిగించునది. త్రిజగములందున్= ముల్లోకములందును, తిరుమణిని బొట్టుగా పెట్టుకొన్న మనుష్యుడు, పరమ పవిత్రుడు = మిక్కిలి పరిశుద్ధుడు, భాగ్యవంతుడు అగును.

కృష్ణా! తిరుమణి, ఉర్ధ్వపుండ్రముగా పెట్టుకొనుటచేత అది పాపములను తొలగించును. ఊర్ధ్వపుండ్రము సౌభాగ్యకరము. తిరుమణితో ఊర్ధ్వపుండ్రము లను ధరించినవాడు ముల్లోకములందును పరమపవిత్రుడు, సౌభాగ్యవంతుడు అగును.

ప్రశస్తే పర్వతాగ్రాదౌ జాతయా శ్వేతమృత్స్నయా
ఊర్ధ్వపుండ్రం తతః కార్యం వైష్ణవైస్తు విశేషతః
ఊర్ధ్వపుండ్రం తథా చక్రం నిత్యం ధారయతే జనః
శుభాని తస్య వర్ధంతే త్వశుభాని ప్రణశ్యతి - వృద్ధ మనుప్రోక్తం

తిరుమణి ఊర్ధ్వపుండ్రములు మధ్య శ్రీచూర్ణరేఖ వైష్ణవుల ముఖచిహ్నము అది శుభప్రదమైనది. అమంగళములను పారద్రోలునది. అపమృత్యువు బారినుండి తప్పించునది. యమధర్మరాజునకు భీతి కలిగించునది అని వృద్ధమను వచనమే కాకుండా, పాంచరాత్రాగమము తెలుపుచున్నది.

తిరుమణి (శ్వేతమృత్తిక) పర్వతాగ్రాన లభిస్తుంది. కాబట్టి అది అతి పవిత్రమైనది అవుతుంది. శ్రీమధ్వాచార్యులవారికి శ్రీకృష్ణవిగ్రహం గోపీచందన మృత్తికలో లభించిందన్న విషయం జగత్ప్రసిద్ధం.

**సర్వేశ్వర! చక్రాయుధ!**
**శర్వాణీవినుతనామ! జగదభిరామా!**
**నిర్వాణనాథ! మాధవ!**
**సర్వాత్మక! నన్నుగావు సదయత కృష్ణా! 95**

కృష్ణా! సర్వ+ఈశ్వర=సమస్తమునకు నియంత అయినవాడా! చక్ర+ ఆయుధ=సుదర్శన చక్రము ఆయుధముగా కలవాడా! శర్వాణీ వినుతనామ= పార్వతీదేవి చేత కొనియాడబడిన శుభనామము కలవాడా! జగత్+అభిరామా= జగత్తునందు సుందరమైనవాడా! మాధవ=లక్ష్మీనాథా; సర్వ+ఆత్మన్= సమస్తము నకు ఆత్మఅయినవాడా! నిర్వాణనాథ=మోక్షమునకు అధిపతి అయినవాడా! సదయతన్= దయతో, నన్నున్, కావుము =నన్ను సంరక్షించుము.

కృష్ణా! నీవు సర్వేశ్వరుడవు, చక్రాయుధుడవు, పార్వతీదేవిచేత స్తుతింపబడువాడవు, జగదేక సుందరుడవు, మోక్షాధిపతివి, లక్ష్మీనాథుడవు, సర్వాత్మకుడవు, నన్ను దయతో సంరక్షింపుము.

శివుడు పార్వతీదేవికి ఆధ్యాత్మరామాయణమును బోధించెను. "శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే, సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే" శ్రీరామనామము ఒక్కటి విష్ణు సహస్రనామములతో సమానమని చెప్పెను. పద్మపురాణస్థ విష్ణు సహస్రనామములును శివుడు పార్వతికి చెప్పినవే.

**శ్రీలక్ష్మి నారాయణ!**
**వాలాయము నిన్నుఁదలఁతు వందితచరణా!**
**ఏలుము నను నీ బంటుగ**
**జాలఁగ నిను నమ్మినాడ సరసుడ! కృష్ణా! 96**

కృష్ణా! లక్ష్మీనారాయణా, వాలాయము=నిరంతరము, నిన్ను దలతును,

వందిత చరణా= నమస్కరింపబడిన పాదములు కలవాడా! నన్ను నీబంటుగ= నీసేవకునిగా, ఏలుము= పరిపాలించుము. చాలగ= అధికముగా; నిను నమ్మినాను, సరసుడ = ఓ అఖిలరసామృతమూర్తీ! కృష్ణా!

శ్రీకృష్ణా! నీవు లక్ష్మీనారాయణుడవు, నమస్కరింపబఢిన చరణములు గలవాడవు. నన్ను నీ సేవకునిగా ఎంచి పాలించుము. నీవు సరసుడవు, రస స్వరూపుడవు. నిన్ను మెండుగా నమ్మియుంటిని.

కృష్ణుణ్ని సరసుడనడంలో ఆయన అఖిల రసామృతమూర్తి అని కవి అభిప్రాయము. "రసో వై సః" అని శ్రుతి.

"రసాత్మా రసరీతిజ్ఞో రసలీలాపరాయణః
రసాత్మగోపీరసికః స కృష్ణః శరణం మమ"

"రసస్వరూపుడు, రసముల తీరు తెలిసిన వాడు, రసలీల, రాసలీలయందు అత్యంత ఆసక్తుడు, రసస్వరూపలైన గోపికల పట్ల ప్రీతికలవాడు, అయిన కృష్ణుడు నాకు రక్షకుడు".

**శ్రీధర మాధవ అచ్యుత**
**భూధర! పురుహూత వినుత! పురుషోత్తమ! నీ**
**పాదయుగళంబు నెప్పుడు**
**మోదముతో నమ్మినాడ ముద్దుల కృష్ణా! 97**

కృష్ణా! శ్రీధర=లక్ష్మిని(రాధను) ధరించినవాడా! మాధవ=లక్ష్మీనాథా, అచ్యుత= శాశ్వతుడా! భూధర= భూదేవి ధరించినవాడా, పురుహూత వినుత = ఇంద్రునిచే స్తుతింప బడినవాడా! పురుషోత్తమ= క్షర-కూటస్థుల కంటె ఉత్తముడైన వాడా! నీపాదయుగళంబున్= నీచరణయుగ్మమును, ఎప్పుడు= ఎల్లప్పుడు, మోదముతో= సంతోషముతో, నమ్మినాడ= నమ్మియున్నవాడను, ముద్దుల= ముగ్ధమోహనుడవైన ఓకృష్ణా!

కృష్ణా! నీ చరణ ద్వంద్వమును నిరంతరము నమ్ముకొని యున్న వాడను.

శ్రీధరుడు రాధను ధరించినవాడు, "కృష్ణస్య భారాక్రాంతస్య కామినః" (శ్రీమద్భా.10-31-32) బృందావన విహార మందు శ్రీకృష్ణుడు రాధను భుజమున కెత్తుకొన్నాడు. "రాసోత్సవేఽస్య భుజదండ గృహీతకంఠ" (శ్రీమద్భా. 10-47-60) నికుంజ స్వారాజ్య రాసిక్య పట్టమహిషి రాధ.

"పురుష ఏ వేదం సర్వం" ఈ పురుషుడు సకల రూపాలతో విహరిస్తాడని శ్వేతాశ్వత రోపనిషత్తు చెబుతున్నది.

ఈకవి శ్రీశంకరాచార్యులవారు రచించిన అచ్యుతాష్టకమును నిరంతరం పఠించుచుండెడివాడని ఈపద్యమును బట్టి ఊహింపవచ్చును.

అచ్యుతం కేశవం రామనారాయణం
కృష్ణదామోదరం వాసుదేవం హరిం
శ్రీధరం మాధవం గోపికావల్లభం
జానకీ నాయకం రామచంద్రం భజే
అచ్యుతం కేశవం సత్యభామాధవం
మాధవం శ్రీధరం రాధికారాధితమ్
ఇందిరామందిరం చేతసా సుందరం
దేవకీనందనం నందజం సందధే"

శరణాపన్నులను వదలనివాడు కావున శ్రీకృష్ణుడు అచ్యుతుడు. (న చ్యుతః అచ్యుతః) ఎన్ని అవతారాలు ధరించినను తన స్థానం నుండి తొలగనివాడు కావున శ్రీకృష్ణుడు అచ్యుతుడు. 'అచ్యుతం చామృతం చైవ జపే దౌషధ కర్మణి' ఔషధం సేవించు సందర్భంలో అచ్యుతనామాన్ని జపించవలయును అని శాస్త్ర వచనం. "అచ్యుతానంత గోవిందనామోచ్చారణ భేషజాత్, నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహం" ఇది ధన్వంతరి వాక్యం.

తుమ్మినప్పుడు, దగ్గినప్పుడు, గ్రహపీడయందు, దైవికమైన విపత్తియందు తన్నివారణకు "నారాయణ" నామాన్ని జపించవలయుననియు శాస్త్రవచనం.

విద్యాభ్యాసం చేయు శిష్యుడు పురుషోత్తమనామాన్ని జపించాలి.

వందిత చరణా= నమస్కరింపబడిన పాదములు కలవాడా! నన్ను నీబంటుగ= నీసేవకునిగా, ఏలుము= పరిపాలించుము. చాలగ= అధికముగా; నిను నమ్మినాను, సరసుడ = ఓ అఖిలరసామృతమూర్తీ! కృష్ణా!

శ్రీకృష్ణా! నీవు లక్ష్మీనారాయణుడవు, నమస్కరింపబఢిన చరణములు గలవాడవు. నన్ను నీ సేవకునిగా ఏంచి పాలించుము. నీవు సరసుడవు, రస స్వరూపుడవు. నిన్ను మెండుగా నమ్మియుంటిని.

కృష్ణుణ్ని సరసుడనడంలో ఆయన అఖిల రసామృతమూర్తి అని కవి అభిప్రాయము. "రసో వై సః" అని శ్రుతి.

"రసాత్మా రసరీతిజ్ఞో రసలీలాపరాయణః
రసాత్మగోపీరసికః స కృష్ణః శరణం మమ"

"రసస్వరూపుడు, రసముల తీరు తెలిసిన వాడు, రసలీల, రాసలీలయందు అత్యంత ఆసక్తుడు, రసస్వరూపలైన గోపికల పట్ల ప్రీతికలవాడు, అయిన కృష్ణుడు నాకు రక్షకుడు".

**శ్రీధర మాధవ అచ్యుత**
**భూధర! పురుహూత వినుత! పురుషోత్తమ! నీ**
**పాదయుగళంబు నెప్పుడు**
**మోదముతో నమ్మినాడ ముద్దుల కృష్ణా! 97**

కృష్ణా! శ్రీధర=లక్ష్మిని(రాధను) ధరించినవాడా! మాధవ=లక్ష్మీనాథా, అచ్యుత= శాశ్వతుడా! భూధర= భూదేవి ధరించినవాడా, పురుహూత వినుత = ఇంద్రునిచే స్తుతింప బడినవాడా! పురుషోత్తమ= క్షర-కూటస్థుల కంటె ఉత్తముడైన వాడా! నీపాదయుగళంబున్= నీచరణయుగ్మమును, ఎప్పుడు= ఎల్లప్పుడు, మోదముతో= సంతోషముతో, నమ్మినాడ= నమ్మియున్నవాడను, ముద్దుల= ముగ్ధమోహనుడవైన ఓకృష్ణా!

కృష్ణా! నీ చరణ ద్వంద్వమును నిరంతరము నమ్ముకొని యున్న వాడను.

శ్రీధరుడు రాధను ధరించినవాడు, "కృష్ణస్య భారాక్రాంతస్య కామినః" (శ్రీమద్భా.10-31-32) బృందావన విహార మందు శ్రీకృష్ణుడు రాధను భుజమున కెత్తుకొన్నాడు. "రాసోత్సవేఽస్య భుజదండ గృహీతకంఠ" (శ్రీమద్భా. 10-47-60) నికుంజ స్వారాజ్య రాసిక్య పట్టమహిషి రాధ.

"పురుష ఏ వేదం సర్వం" ఈ పురుషుడు సకల రూపాలతో విహరిస్తాడని శ్వేతాశ్వత రోపనిషత్తు చెబుతున్నది.

ఈకవి శ్రీశంకరాచార్యులవారు రచించిన అచ్యుతాష్టకమును నిరంతరం పఠించుచుండెడివాడని ఈపద్యమును బట్టి ఊహింపవచ్చును.

అచ్యుతం కేశవం రామనారాయణం
కృష్ణదామోదరం వాసుదేవం హరిం
శ్రీధరం మాధవం గోపికావల్లభం
జానకీ నాయకం రామచంద్రం భజే
అచ్యుతం కేశవం సత్యభామాధవం
మాధవం శ్రీధరం రాధికారాధితమ్
ఇందిరామందిరం చేతసా సుందరం
దేవకీనందనం నందజం సందధే"

శరణాపన్నులను వదలనివాడు కావున శ్రీకృష్ణుడు అచ్యుతుడు. (న చ్యుతః అచ్యుతః) ఎన్ని అవతారాలు ధరించినను తన స్థానం నుండి తొలగనివాడు కావున శ్రీకృష్ణుడు అచ్యుతుడు. 'అచ్యుతం చామృతం చైవ జపే దౌషధ కర్మణి' ఔషధం సేవించు సందర్భంలో అచ్యుతనామాన్ని జపించవలయును అని శాస్త్ర వచనం. "అచ్యుతానంత గోవిందనామోచ్చారణ భేషజాత్, నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహం" ఇది ధన్వంతరి వాక్యం.

తుమ్మినప్పుడు, దగ్గినప్పుడు, గ్రహపీడయందు, దైవికమైన విపత్తియందు తన్నివారణకు "నారాయణ" నామాన్ని జపించవలయుననియు శాస్త్రవచనం.

విద్యాభ్యాసం చేయు శిష్యుడు పురుషోత్తమనామాన్ని జపించాలి.

"విద్యామభ్యసతా నిత్యం జప్తవ్యః పురుషోత్తమః"

నేత్రబాధా నివారణకు పుండరీకాక్ష నామాన్ని జపించాలి. "కేశవం పుండరీకాక్ష మనిశం హి తథా జపేత్ నేత్రబాధాసు సర్వాసు".

స్నానం, దేవతార్చన, హోమం, ప్రదక్షిణ చేసే సమయంలో వాసుదేవ నామాన్ని జపించాలి. "కీర్తయేత్ భగవన్నామ వాసుదేవేతి తత్పరః"

లేచునపుడు "విష్ణవే నమః" విష్ణునామాన్ని, చీకటిలో శ్రీనారసింహనామాన్ని, కలిదోష నివారణకు గోవింద నామాన్ని, నిద్రించే సమయంలో మాధవ నామాన్ని, భోజనవేళ మధుసూదననామాన్ని, మంగళకార్యాలలో విష్ణునామాన్ని, అన్ని వేళలలోను, కార్యపరిసమాప్తసమయంలోను శ్రీకృష్ణనామాన్ని జపించాలని శాస్త్రాలు చెబుతున్నాయి.

అంతఃకరణశుద్ధికి, బాహ్యపరిశుద్ధికి పుండరీకాక్షనామాన్ని స్మరించాలి. ఈ క్రింది శ్లోకం పఠించాలి.

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా
యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః.

"అపవిత్రుడైన, పవిత్రుడైన, ఏదశలో ఉన్నవాడైనా, పుండరీక్షుని స్మరించినవాడు, లోపలా బయటా, పరిశుద్ధుడవుతాడు".

కలియుగంలో జపించవలసిన నామావళిః

"హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే"

ఈపదహారు నామాలను ఉచ్చరిస్తే కలికాలపు సమస్త పాతకాలు నశిస్తాయి.

**శిరమున రత్న కిరీటము**
**కరయుగమున శంఖచక్రఘనభూషణముల్**
**ఉరమున వజ్రపుఁబతకము**
**సిరినాయక! అమరఁదాల్తు శ్రీహరి! కృష్ణా! 98**

కృష్ణా! సిరినాయక= లక్ష్మీనాథా! శిరమునందు= తలపై; రత్నకిరీటము= రత్నాలు పొదిగిన కిరీటము; కరయుగమున= చేతుల రెండిటను, శంఖ-చక్రములనబడు, ఘనభూషణముల్= గొప్పవైన ఆభరణములు, ఉరమున= వక్షఃస్థలమున, వజ్రపు పతకము= వజ్రాలు పొదిగిన పతకము, అమరన్= శోభిల్లునట్లుగా, తాల్తు= ధరింతువు, ఓ శ్రీహరీ.

కృష్ణా! శిరమున రత్నకిరీటమును, రెండుచేతులను శంఖ చక్రములను, వక్షస్థ్సలమున వజ్రాల పతకమును అందముగా ధరింతువు కదా!

ఈ పద్యమున కవి శ్రీవేంకటేశ్వరస్వామి రూపమును దర్శింప జేసినాడు. శ్రీకృష్ణుడు ద్విభుజుడైనను చతుర్భుజుడే. సహస్రశీర్షములుగల విశ్వరూపమును చూపినవాడు నరాకృతిలో నున్న శ్రీకృష్ణుడే కదా!

**అందెలు పాదములందున**
**సుందరముగ నుంచినావు సొంపలరంగా**
**మందరధర! మునిసన్నుత!**
**నందుని వరపుత్ర! నిన్ను నమ్మితి కృష్ణా! 99**

కృష్ణా! మందరధర= మందరమను పర్వతమును ధరించినవాడా; ముని సన్నుత=మునులచేత సన్నుతింపబడువాడా! నందుని వరపుత్ర=నందుని ప్రియపుత్రుడా!, అందెలు=పాదములందున, సుందరముగా ఉంచుకొంటివి; చూడసొంపగునట్లుగా.

కృష్ణా! నీవు పాదాలకు అందెలు ధరించి సుందరముగా కనిపింతువు. నిన్ను నేను నమ్ముకొన్నాను.

"మునిసన్నుత" మునులచేత సన్నుతింపబడువాడు ఈ కృష్ణుడే.

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వ న్త్యహైతుకీం భక్తిం ఇత్థంభూతగుణో హరిః" - శ్రీమద్భా. 1-7-10.

యోగీశ్వరులకుగానీ, మునీశ్వరులకుగాని, సర్వజనులకు భజనీయమైన భగవత్స్వరూపమిది. పరమాత్మైక నిష్ఠులు, నిఖిల విషయ విరక్తజనుల మనో

వశీకరణ చతురగుణ స్వరూపము శ్రీకృష్ణరూపమని ఈశ్లోక వ్యాఖ్యాత శ్రీధరస్వామివారన్నారు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు యోగారాధ్యుడు.

జ్ఞానులు, అవిద్యాగ్రంథి విడిపోయినవారు ఆత్మలోనే ఆనందించువారైన యోగీశ్వరులు సదా తమ ఆత్మల యందు శ్రీకృష్ణరూపమును ధ్యానిస్తారు. శ్రీకృష్ణుని రూపమాధుర్యమును, లీలా మాధుర్యమును, ప్రియా మాధుర్యమును, వేణుమాధుర్యమును వారు అనుభవిస్తారు. ముక్తులైనవారు ఇంక ధ్యానింప వలసిన దేమున్నది? అనగా "ఇత్థం భూత గుణో హరిః" పైన పేర్కొనబడినటువంటి అఖిల మాధుర్య రసానందరూపుని ధ్యానించినవారయితేనే ఆమునీశ్వరులు ఆత్మారాములవుతారు. మునీశ్వరుల భక్తి 'అహైతుకి' అనగా అనన్యప్రయోజనము గలది.

**కందర్పకోటి సుందర!**
**మందరధర! భానుతేజ! మంజులదేహా!**
**సుందర విగ్రహ! మునిగణ**
**వందిత! మిముఁదలతు భక్తవత్సల! కృష్ణా! 100**

కృష్ణా! కందర్పకోటి సుందర = కోటి మన్మథుల సౌందర్యము గలవాడా! మందరధర=మందరమను పర్వతమును ధరించినవాడా (కూర్మావతారమున)! భానుతేజ=సూర్యుని తేజస్సు కలవాడా; మంజుల దేహా=మనోజ్ఞమైన శరీరము గలవాడా! సుందర విగ్రహ= సుందరమైన రూపము గలవాడా! మునిగణవందిత= మునులసమూహముచే నమస్కరింపబడువాడా! భక్తవత్సల=భక్తులపట్ల వాత్సల్యము గలవాడా! మిమ్ము, తలతును=స్మరింతును.

కృష్ణా! నీవు కోటిమన్మథాకారుడవు. సాక్షాన్మన్మథ మన్మథుడవు. మందరధరుడవు. సూర్యసంకాశుడవు, మనోహర శరీరుడవు, సుందర రూపుడవు, సకలముని గణవందితుడవు, భక్తవత్సలుడవు. మిమ్ము సర్వదా స్మరింతును.

ఆత్మారాములైన మునీశ్వరులు ఇట్టి శ్రీకృష్ణుని రూపమును భజింతురు. ఇది శ్రీకృష్ణుని భజనీయ రూపము.

ఇది ఫలశ్రుతి

**అనుదినము కృష్ణశతకము**
**వినినఁ బఠించినను ముక్తి వేడుకఁగలుగున్**
**ధనధాన్యము గోగణములు**
**తనయులు నభివృద్ధిఁ బొందుఁదద్దయు కృష్ణా! 101**

కృష్ణా! అనుదినము=ప్రతిదినము, ఈ కృష్ణశతకమును, వినినన్= విన్నను, పఠించినను=చదివినను, ముక్తియు, వేడుకయు, ధనధాన్యము గోగణము= ఆవుల సమూహము, తనయులు=కుమారులు, అభివృద్ధి, తద్దయు= మిక్కిలి, పొందును.

కృష్ణా! ఈకృష్ణశతకమును ప్రతిదినము విన్నను, పఠించినను ముక్తి కలుగును. ఆనందము కలుగును. ధనధాన్యాలు, గోగణము, కుమారులు మిక్కిలి అభివృద్ధి చెందుదురు.

శ్రీకృష్ణశతక గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య సంపూర్ణము.
"త్వదీయం వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పయే"
సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.



# జగత్కళ్యాణసంహిత అను
# శ్రీ గోపాల సహస్రనామ స్తోత్రము

**పార్వత్యువాచ**

కైలాసశిఖరే రమ్యే గౌరీ పృచ్ఛతి శంకరం
బ్రహ్మాండాఖిలనాథస్త్వం సృష్టిసంహారకారకః

**హేత్వంతర మాహ-**

త్వమేవ పూజ్యతే లోకై ర్బ్రహ్మ విష్ణు సురాదిభిః
నిత్యం పఠసి దేవేశ కస్య స్తోత్రం మహేశ్వర

**తదేవాహ**

ఆశ్చర్య మిద మాఖ్యాతం జాయతే మయి శంకర
తత్ప్రాణేశ మహాప్రాజ్ఞ సంశయం ఛింధి మే ప్రభో

**శ్రీమహాదేవ ఉవాచ**

ధన్యాసి కృతపుణ్యాసి పార్వతి ప్రాణవల్లభే
రహస్యాతి రహస్యం చ త్వృచ్ఛతి వరాననే

స్త్రీస్వభావాన్మహాదేవి పునస్త్వం పరిపృచ్ఛసి
గోపనీయం గోపనీయం గోపనీయం ప్రయత్నతః

దత్తే చ సిద్ధిహానిః స్యాత్తస్మాద్యత్నేన గోపయేత్
ఇదం రహస్యం పరమం పురుషార్థప్రదాయకమ్

ధన రత్నౌఘమాణిక్యం తురగం చ గజాదికం
దదాతి స్మరణాదేవ మహామోక్షప్రదాయకమ్

తత్తేస్వాహం సంప్రవక్ష్యామి శ్రుణుష్వా వహితాప్రియే
యోసౌ నిరంజనో దేవః చిత్స్వరూపీ జనార్దనః

సంసారసాగరోత్తారకరణాయ నృణాం సదా
శ్రీగంగా దివ్యరూపేణ త్రైలోక్యం వ్యాప్యతిష్ఠతి

తతో లోకా మహామూఢా విష్ణుభక్తివివర్జితాః
నిశ్చయం నాధిగచ్ఛంతి పునర్నారాయణో హరిః

నిరంజనో నిరాకారో భక్తానాం ప్రీతికామదః
బృందావనవిహారస్య గోపాలం రూపముద్వహన్

మురళీవాదనాధారీ రాధాయై ప్రీతిమావహన్
అంశాంశేభ్యః సమున్మీల్య పూర్ణరూపకలాయుతః

శ్రీకృష్ణచంద్రో భగవాన్ నందగోపవరోద్యతః
ధరణీరూపిణీ మాతృయశోదానందదాయకః

ద్వాభ్యాం ప్రయాచితో నాథో దేవక్యాంవసుదేవతః
బ్రహ్మణాభ్యర్థితో దేవో దేవైరపి సురేశ్వరి

జాతోఽవన్యాం ముకుందోఽపి మురళీవాదరేచికా
తయా సార్థం వచః కృత్వా తతో జాతో మహేతలే

సంసారసారసర్వస్వం శ్యామలం మహదుజ్జ్వలమ్
ఏతజ్జ్యోతిరహం వేద్యం చింతయామి సనాతనమ్

గౌరతేజో వినాయస్తు శ్యామతేజ స్సమర్చయేత్
జపేద్వా ధ్యాయతే వాపి సభవేత్ పాతకీ శివే

సబ్రహ్మహా సురాపీ స్వర్ణస్తేయీ చ పంచమః
ఏతైర్దోషై ర్విలిప్యేత తేజోభేదా న్మహేశ్వరి

తస్మాజ్జ్యోతి రభూద్ద్వేధా రాధామాధవరూపకం
తస్మాదిదం మహాదేవి గోపాలేనైవ భాషితమ్

**తదేవాహ:**

దుర్వాససో మునేర్మోహే కార్తిక్యాం రాసమండలే
తతః పృష్టవతీ రాధా సందేహభేద మాత్మనః

నిరంజనాత్సముత్పన్నం మయాధీతం జగన్మయి
శ్రీకృష్ణేన తతః ప్రోక్తం రాధాయై నారదాయ చ

తతో నారదత స్సర్వే విరలా వైష్ణవా జనాః
కలౌ జానంతి దేవేశ గోపనీయం ప్రయత్నతః

శఠాయ కృపణాయాథ దాంభికాయ సురేశ్వరి
బ్రహ్మహత్యా మవాప్నోతి తస్మా ద్యత్నేన గోపయేత్

అస్య గోపాల సహస్రనామస్తోత్రమహామంత్రస్య శ్రీనారద ఋషిః అనుష్టుప్ఛందః శ్రీగోపాలో దేవతా, కామో బీజం, మాయా శక్తిః, చంద్రః కీలకమ్. శ్రీకృష్ణచంద్ర భక్తిరూపఫల ప్రాప్తయే శ్రీగోపాల సహస్రనామ జపేవినియోగః

అథ ధ్యానమ్

కస్తూరీతిలకం లలాట పటలే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే వర మౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్
సర్వాంగే హరిచందనం సులలితం కంఠే చ ముక్తావలిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః

ఫుల్లేందీవరకాంతి మిందువదనం బర్హావతంసప్రియం
శ్రీవత్సాంక ముదారకౌస్తుభధరం పీతాంబరం సుందరం
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసంఘావృతం
గోవిందం కలవేణువాదనపరం దివ్యాంగభూషం భజే

ఓం క్లీం దేవః కామదేవః కామబీజశిరోమణిః
శ్రీగోపాలో మహాపాలో వేదవేదాంతపారగః

కృష్ణః కమలపత్రాక్షః పుండరీకః సనాతనః
గోపతిః భూపతిః శాస్తా ప్రహర్తా విశ్వతోముఖః

ఆదికర్తా మహాకర్తా మహాకాలః ప్రతాపవాన్
జగజ్జీవో జగద్ధాతా జగద్భర్తా జగద్వసుః

తతో లోకా మహామూఢా విష్ణుభక్తివివర్జితాః
నిశ్చయం నాధిగచ్ఛంతి పునర్నారాయణో హరిః

నిరంజనో నిరాకారో భక్తానాం ప్రీతికామదః
బృందావనవిహారస్య గోపాలం రూపముద్వహన్

మురళీవాదనాధారీ రాధాయై ప్రీతిమావహన్
అంశాంశేభ్యః సమున్మీల్య పూర్ణరూపకలాయుతః

శ్రీకృష్ణచంద్రో భగవాన్ నందగోపవరోద్యతః
ధరణీరూపిణీ మాతృయశోదానందదాయకః

ద్వాభ్యాం ప్రయాచితో నాథో దేవక్యాంవసుదేవతః
బ్రహ్మణాభ్యర్థితో దేవో దేవైరపి సురేశ్వరి

జాతోఽవన్యాం ముకుందోఽపి మురళీవాదరేచికా
తయా సార్ధం వచః కృత్వా తతో జాతో మహేతలే

సంసారసారసర్వస్వం శ్యామలం మహదుజ్జ్వలమ్
ఏతజ్జ్యోతిరహం వేద్యం చింతయామి సనాతనమ్

గౌరతేజో వినాయస్తు శ్యామతేజ స్సమర్చయేత్
జపేద్వా ధ్యాయతే వాపి సభవేత్ పాతకీ శివే

సబ్రహ్మహా సురాపీ స్వర్ణస్తేయీ చ పంచమః
ఏతైర్దోషై ర్విలిప్యేత తేజోభేదా న్మహేశ్వరి

తస్మాజ్జ్యోతి రభూద్ద్వేధా రాధామాధవరూపకం
తస్మాదిదం మహాదేవి గోపాలేనైవ భాషితమ్

**తదేవాహ:**

దుర్వాససో మునేర్మోహే కార్తిక్యాం రాసమండలే
తతః పృష్టవతీ రాధా సందేహభేద మాత్మనః

నిరంజనాత్సముత్పన్నం మయాధీతం జగన్మయి
శ్రీకృష్ణేన తతః ప్రోక్తం రాధాయై నారదాయ చ

తతో నారదత స్సర్వే విరలా వైష్ణవా జనాః
కలౌ జానంతి దేవేశ గోపనీయం ప్రయత్నతః

శఠాయ కృపణాయాథ దాంభికాయ సురేశ్వరి
బ్రహ్మహత్యా మవాప్నోతి తస్మా ద్యత్నేన గోపయేత్

అస్య గోపాల సహస్రనామస్తోత్రమహామంత్రస్య శ్రీనారద ఋషిః అనుష్టుప్ఛందః శ్రీగోపాలో దేవతా, కామో బీజం, మాయా శక్తిః, చంద్రః కీలకమ్. శ్రీకృష్ణచంద్ర భక్తిరూపఫల ప్రాప్తయే శ్రీగోపాల సహస్రనామ జపేవినియోగః

అథ ధ్యానమ్

కస్తూరీతిలకం లలాట పటలే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే వర మౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్
సర్వాంగే హరిచందనం సులలితం కంఠే చ ముక్తావలిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః

ఫుల్లేందీవరకాంతి మిందువదనం బర్హావతంసప్రియం
శ్రీవత్సాంక ముదారకౌస్తుభధరం పీతాంబరం సుందరం
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసంఘావృతం
గోవిందం కలవేణువాదనపరం దివ్యాంగభూషం భజే

ఓం క్లీం దేవః కామదేవః కామబీజశిరోమణిః
శ్రీగోపాలో మహాపాలో వేదవేదాంతపారగః

కృష్ణః కమలపత్రాక్షః పుండరీకః సనాతనః
గోపతిః భూపతిః శాస్తా ప్రహర్తా విశ్వతోముఖః

ఆదికర్తా మహాకర్తా మహాకాలః ప్రతాపవాన్
జగజ్జీవో జగద్ధాతా జగద్భర్తా జగద్వసుః

మత్స్యో భీమః కుహూభర్తా హర్తా వారాహమూర్తిమాన్
నారాయణో హృషీకేశో గోవిందో గరుడధ్వజః

గోకులేంద్రో మహీచంద్రః శర్వరీప్రియకారకః
కమలాముఖలోలాక్షః పుండరీకః శుభావహః

దుర్వాసాః కపిలో భౌమః సింధుసాగరసంగమః
గోవిందో గోపతిర్గోపః కాళిందీ ప్రేమపూరకః

గోపస్వామీ గోకులేంద్రో గోవర్ధనవరప్రదః
నందాది గోకులత్రాతా దాతా దారిద్ర్యభంజనః

సర్వమంగళదాతా చ సర్వకామప్రదాయకః
ఆదికర్తా మహీభర్తా సర్వసాగరసింధుజః

గజగామీగజోద్ధారీ కామీకామకళానిధిః
కళంకరహితశ్చంద్రో బింబాస్యో బింబసత్తమః

మాలాకారకృపాకారః కోకిలస్వరభూషణః
రామో నీలాంబరో దేవో హలీ దుర్దమమర్దనః

సహస్రాక్ష పురీభేత్తా మహామారీవినాశనః
శివః శివతమో భేత్తా బలారాతి ప్రపూజకః

కుమారీవరదాయీ చ వరేణ్యో మీనకేతనః
నరో నారాయణో ధీరో రాధాపతి రుధారధీః

శ్రీపతిః శ్రీనిధిః శ్రీమాన్ మాపతిః ప్రతిరాజహా
బృందాపతిః కులగ్రామీ ధామీ బ్రహ్మా సనాతనః

రేవతీరమణో రామః ప్రియశ్చంచలలోచనః
రామాయణ శరీరోఽయం రామో రామః శ్రియఃపతిః

శర్వరః శర్వరీ శర్వః సర్వత్ర శుభదాయకః
రాధా రాధయితారాధీ రాధాచిత్తప్రమోదకః

రాధారతి సుఖోపేతః రాధా మోహనతత్పరః
రాధావశీకరో రాధాహృదయాంభోజషట్పదః

రాధాలింగనసమ్మోహః రాధానర్తనకౌతుకః
రాధా సంజాత సంప్రీతో రాధా కామ్యఫలప్రదః

బృందాపతిః కోశనిధిః కోకశోకవినాశనః
చంద్రాపతిః చంద్రపతిః చండకోదండభంజనః

రామో దాశరథీ రామః భృగువంశసుముద్భవః
ఆత్మారామో జితక్రోధో మోహో మోహాంధభంజనః

వృషభానుభవోభావః కాశ్యపిః కరుణానిధిః
కోలాహలో హలీ హాలీ హేలీ హలధర ప్రియః

రాధా ముఖాబ్జమార్తాండః భాస్కరో రవిజా విధుః
విధి ర్విధాతా వరుణో వారుణో వారుణీ ప్రియః

రోహిణీహృదయానందో వసుదేవాత్మజో బలీ
నీలాంబరో రౌహిణేయో జరాసంధవధోఽమలః

నాగో నవాంభో విరుదో వీరహా వరదో బలీ
గోపథో విజయీ విద్వాన్ శిపివిష్టః సనాతనః

పరశురామవచోగ్రాహీ వరగ్రాహీ శృగాలహా
దమఘోషోపదేష్టా చ రథగ్రాహీ సుదర్శనః

వీరపత్నీయశస్త్రాతా జరావ్యాధివిఘాతకః
ద్వారకావాసతత్వజ్ఞః హుతాశనవరప్రదః

యమునావేగ సంహారీ నీలాంబరధరః ప్రభుః
విభుః శరాసనో ధన్వీ గణేశో గణనాయకః

లక్ష్మణో లక్షణో లక్ష్యోరక్షోవంశ వినాశనః
వామనో వామనీ భూతోఽవామనో వామనారుహః

యశోదానందనః కర్తా యమలార్జునముక్తిదః
ఉలూఖలీ మహామానీ దామబద్ధాహ్వయీ శమీ

భక్తానుకారీ భగవాన్ కేశవో బలధారకః
కేశిహా మధుహా మోహీ వృషాసురవిఘాతకః

అఘాసురవినాశీ చ పూతనా మోక్షదాయకః
కుబ్జావినోదీ భగవాన్ కంస మృత్యు మహామఖీ

అశ్వమేధో వాజపేయో గోమేధో నర మేధవాన్
కందర్పకోటిలావణ్యః చంద్ర కోటి సుశీతలః

రవికోటిప్రతీకాశో వాయుకోటి మహాబలః
బ్రహ్మే బ్రహ్మాండకర్తా చ కమలా వాంఛితప్రదః

కమలా కమలాక్షశ్చ కమలా ముఖలోలుపః
కమలావ్రతధారీ చ కమలాభ : పురందరః

సౌభాగ్యాధికచిత్తోఽయం మహామాయీ మహోత్కటః
కారకారిః సురత్రాతా మారీచక్షోభకారకః

విశ్వామిత్ర ప్రియో దాంతో రామో రాజీవలోచనః
లంకాధిప కులధ్వంసీ విభీషణ వరప్రదః

సీతానందకరో రామో వీరో వారిధిబంధనః
ఖరదూషణ సంహారీ సాకేతపురవాసవాన్

చంద్రావలీపతిః కూలః కేశికంసవధోఽమలః
మాధవో మధుహా మాధ్వీ మాధ్వీకో మాధవో విభుః

ముంజాటవీ గాహమానః ధేనుకారిర్ధరాత్మజః
వంశీ వటవిహారీ చ గోవర్ధనవనాశ్రయః

తథా తాలవనోద్దేశీ భాండీరవన శంఖహా
తృణావర్తకృపాకారీ వృషభాను సుతాపతిః

రాధాప్రాణసమో రాధావదనాబ్జ మధు వ్రతః
గోపీరంజన దైవజ్ఞః లీలా కమల పూజితః

క్రీడాకమల సందోహః గోపీకా ప్రీతిరంజనః
రంజకో రంజనోరంగో రంగీ రంగమహీరుహః

కామః కామారి భక్తోఽయం పురాణ పురుషః కవిః
నారదో దేవలో భీమో బాలో బాల ముఖాంబుజః

అంబుజో బ్రహ్మ సాక్షీ చ యోగీ దత్తవరో మునిః
వృషభ : పర్వతో గ్రామో నదీ పవన వల్లభః

పద్మనాభః సురజ్యేష్టీ బ్రహ్మ రుద్రోఽహిభూషితః
గణానాంత్రాణ కర్తా చ గణేశో గ్రహిలో గ్రహీ

గణాశ్రయో గణాధ్యక్షః క్రోడీకృత జగత్త్రయః
యాదవేంద్రో ద్వారకేంద్రో మధురావల్లభో ధురీ

భ్రమరః కుంతలీ కుంతీసుత రక్షో మహామఖీ
యమునా వరదాతా చ కాశ్యపశ్య వరప్రదః

శంఖ చూడవధోద్దామో గోపీ రక్షణ తత్పరః
పాంచజన్యకరో రామీ త్రిరామీ వనజో జయః

ఫాల్గునః ఫాల్గున సఖో విరాధవధకారకః
రుక్మిణీప్రాణనాథశ్చ సత్యభామాప్రియంకరః

కల్పవృక్షో మహావృక్షః దానవృక్షో మహాఫలః
అంకుశో భూసురో భావో భ్రామకో భామకో హరిః

సరళః శాశ్వతో వీరో యదువంశీ శివాత్మకః
ప్రద్యుమ్నో బలకర్తా చ ప్రహర్తాదైత్యహా ప్రభుః

మహాధనీ మహావీరో వనమాలా విభూషణః
తులసీధామ శోభాఢ్యో జలంధరవినాశనః

శూరః సూర్యో మృతండశ్చ భాస్కరో విశ్వపూజితః
రవిస్తమోహో వహ్నిశ్చ బాడబో బదబానలః

దైత్యదర్పవినాశీ చ గరుడో గరుడాగ్రజః
గోపీనాథో మహీనాథో బృందానాథోఽనిరోధకః

ప్రపంచీ పంచరూపశ్చ లతాగుల్మశ్చగోపతిః
గంగా చ యమునారూపో గోదా వేత్రవతీ తథా

కావేరీ నర్మదా తాప్తీ గండకీ సరయూస్తథా
రాజసఃతామసఃసత్వీ సర్వాంగీ సర్వలోచనః

సుధామయోఽమృతమయో యోగినీవల్లభః శివః
బుద్ధో బుద్ధిమతాం శ్రేష్ఠో విష్ణుర్జిష్ణుః శచీపతిః

వంశీ వంశీధరో లోకః విలోకో మోహనాశనః
రవరావో రవో రావో బలో బాలబలాహకః

శివో రుద్రో నలో నీలో లాంగలీ లాంగలాశ్రయః
పారదః పావనో హంసో హంసారూఢో జగత్పతిః

మోహినీమోహనో మాయీ మహామాయో మహామఖీ
వృషో వృషాకపిః కాలః కాలీ దమనకారకః

కుబ్జా భార్గ్యప్రదో వీరః రజకక్షయకారకః
కోమలో వారుణో రాజా జలజో జలధారకః

హారకః సర్వపాపఘ్నః పరమేష్ఠీ పితామహః
ఖడ్గధారీ కృపాకారీ రాధారమణసుందరః

ద్వాదశారణ్యసంభోగీ శేషనాగ ఫణాలయః
కామః శ్యామః సుఖ శ్రీ దఃశ్రీపతిః శ్రీనిధిః కృతీ

హరిర్నారాయణో నారో నరోత్తమ ఇషుప్రియః
గోపాలీ చిత్తహర్తా చ కర్తా సంసారతారకః

ఆదిదేవో మహాదేవో గౌరీ గురురనాశ్రయః
సాధుర్మధుర్విధు ర్ధాతా త్రాతాక్రూరపరాయణః

రోలంబీ చ హయగ్రీవో వానరారి ర్వనాశ్రయః
వనంవనీ వనాధ్యక్షః మహావంద్యో మహామునిః

స్యమంతకమణిప్రజ్ఞో విజ్ఞోవిఘ్నవిఘాతకః
గోవర్ధనో వర్ధనీయః వర్ధనో వర్ధన ప్రియః

వర్ధన్యో వర్ధనీ వర్ధీ వర్ధిష్ణుః సుముఖప్రియః
వర్ధితో వృద్ధకో వృద్ధో బృందారకజనప్రియః

గోపాలరమణీభర్తా సాంబకుష్ఠ వినాశకః
రుక్మిణీ హరణః ప్రేమ ప్రేమీ చంద్రావలీపతిః

శ్రీకార్తా విశ్వభర్తా చ నరో నారాయణో బలీ
గణో గణపతిశ్చైవ దత్తాత్రేయో మహామునిః

వ్యాసో నారాయణో దివ్యో భవ్యో భావుక ధారకః
శ్వఃశ్రేయసం శివం భద్రం భావుకం భావికం శుభం

శుభాత్మకః శుభః శాస్తా ప్రశాస్తా మేఘనాదహా
బ్రహ్మణ్యదేవో దీనానాముద్ధారకరణక్షమః

కృష్ణః కమల పత్రాక్షః కృష్ణః కమల లోచనః
కృష్ణఃకామీ సదాకృష్ణః సమస్తప్రియకారకః

నందో నందీ మహానందీ మాదీ మాదనకః కిలీ
మిలీ హిలీ గిలీ గోలీ గోలో గోలాలయో గులీ

గుగ్గులీ భారకీ శాఖీ వటః పిప్పలకః కృతీ
మ్లేచ్ఛహా కాలకర్తా చ యశోదాయశ ఏ వచ

అచ్యుతః కేశవో విష్ణుః హరిః సత్యోజనార్దనః
హంసో నారాయణో లీలో నీలో భక్తిపరాయణః

జానకీవల్లభో రామః విరామో విఘ్ననాశనః
సహభానుర్మహాభానుః వీరబాహుర్మహోదధిః

సముద్రోఽబ్ధిరకూపారః పారావారః సరిత్పతిః
గోకులానందకారీ చ ప్రతిజ్ఞాపరిపాలకః

సదారామః కృపారామః మహారామో ధనుర్ధరః
పర్వతః పర్వతాకారో గయో గేయో ద్విజప్రియః

కంబలాశ్వతరో రామో రామాయణ ప్రవర్తకః
ద్యౌర్దివో దివసో దివ్యో భవ్యో భావీ భయాపహః

పార్వతీ భాగ్యసహితో భర్తా లక్ష్మీవిలాసవాన్
విలాసీ సాహసీ సర్వీ గర్వీ గర్వితలోచనః

మురారిర్లోకధర్మజ్ఞః జీవనో జీవనాంతకః
యమో యమాదియమనో యామీ యామవిధాయకః

వసులీ పాంసులీ పాంసుః పాండు రర్జున వల్లభః
లలితా చంద్రికామాలీ మాలీ మాలాంబుజాశ్రయః

అంబుజాక్షో మహాయజ్ఞః దక్షః చింతామణిః ప్రభుః
మణిర్దినమణిశ్చైవ కేదారో బదరీశ్రయః

బదరీవన సంప్రీతః వ్యాసః సత్యవతీ సుతః
అమరారి నిహంతా చ సుధాసింధు విధూదయః

చంద్రో రవిః శివః శూలీ చక్రీ చైవ గదాధరః
శ్రీకర్తా శ్రీపతిః శ్రీదః శ్రీదేవో దేవకీసుతః

శ్రీపతిః పుండరీ కాక్షః పద్మనాభో జగత్పతిః
వాసుదేవోఽప్రమేయాత్మా కేశవో గరుడధ్వజః

నారాయణః పరంధామ దేవదేవో మహేశ్వరః
చక్రపాణిః కళాపూర్ణో వేదవేద్యో దయానిధిః

భగవాన్ సర్వభూతేశో గోపాలః సర్వపాలకః
అనంతో నిర్గుణో నిత్యో నిర్వికల్పో నిరంజనః

నిరాధారో నిరాకారః నిరాభాసో నిరాశ్రయః
పురుషః ప్రణవాతీతో ముకుందః పరమేశ్వరః

క్షణావనిః సార్వభౌమో వైకుంఠో భక్తవత్సలః
విష్ణుర్దామోదరః కృష్ణో మాధవో మధురాపతిః

దేవకీగర్భసంభూతో యశోదావత్సలో హరిః
శివః సంకర్షణః శంభు ర్భూతనాథో దివస్పతిః

అవ్యయః సర్వధర్మజ్ఞః నిర్మలో నిరుపద్రవః
నిర్వాణనాయకో నిత్యోనీలజీమూతసన్నిభః

కలాక్షయశ్చ సర్వజ్ఞః కమలారూపతత్పరః
హృషీకేశః పీత వాసా వసుదేవ ప్రియాత్మజః

నందగోపకుమారార్యః నవనీతాశనో విభుః
పురాణ పురుషః శ్రేష్ఠః శంఖపాణిః సువిక్రమః

అనిరుద్ధశ్చక్రధరః శార్ఙ్గపాణిశ్చతుర్భుజః
గదాధరః సురార్తిఘ్నో గోవిందో నందకాయుధః

బృందావనచరః శౌరిర్వేణువాద్యవిశారదః
తృణావర్తాంతకో భీమ సాహసీ బహు విక్రమః

శకటాసురసంహారీ బకాసురవినాశనః
ధేనుకాసురసంహారీ పూతనారిర్నృకేసరీ

పితామహో గురుస్సాక్షాత్ ప్రత్యగాత్మా సదాశివః
అప్రమేయః ప్రభుః ప్రాజ్ఞోఽప్రతర్క్యః స్వప్నవర్ధనః

ధన్యో మాన్యో భవో భావో ధీరః శాంతో జగద్గురుః
అంతర్యామీశ్వరో దివ్యో దైవజ్ఞో దేవసంస్తుతః

క్షీరాబ్ధిశయనో ధాతా లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః
ధాత్రీపతి రమేయాత్మా చంద్రశేఖరపూజితః

లోకసాక్షీ జగచ్చక్షుః పుణ్యచారిత్రకీర్తనః
కోటిమన్మథ సౌందర్యః జగన్మోహనవిగ్రహః

మందస్మితాననో గోపో గోపికాపరివేష్టితః
ఫుల్లారవిందనయనః చాణూరాంధ్రనిషూదనః

ఇందీవరదళశ్యామో బర్హిబర్హావతంసకః
మురళీనినదాహ్లాదః దివ్యమాల్యాంబరావృతః

సుకపోలయుగః సుభ్రూయుగళః సులలాటకః
కంబుగ్రీవో విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః

పీనవక్షాశ్చతుర్బాహు శ్చతుర్మూర్తిః త్రివిక్రమః
కళంకరహితః శుద్ధః దుష్టశత్రునిబర్హణః

కిరీటకుండలధరః కటకాంగద మండితః
ముద్రికా భరణోపేతః కటిసూత్ర విరాజితః

మంజీర రంజిత పదః సర్వాభరణభూషితః
విన్యస్తపాదయుగళో దివ్య మంగళ విగ్రహః

గోపికానయనానందః పూర్ణచంద్రనిభాననః
సమస్తజగదానంద సుందరో లోకనందనః

యమునాతీరసంచారీ రాధామన్మథ వైభవః
గోపనారీప్రియో దాంతో గోపీవస్త్రాపహారకః

శృంగారమూర్తిః శ్రీధామా తారకో మూలకారణం
సృష్టిసంరక్షణోపాయః క్రూరాసురవిభంజనః

నరకాసురసంహారీ మురారి రరిమర్దనః
ఆదితేయప్రియో దైత్యభీకరో యదుశేఖరః

జరాసంధకులధ్వంసీ కంసారాతిః సువిక్రమః
పుణ్యశ్లోకః కీర్తనీయః యాదవేంద్రో జగన్నుతః

రుక్మిణీరమణః సత్యభామా జాంబవతీప్రియః
మిత్రవిందా నాగ్నజితీ లక్ష్మణా సముపాసితః

సుధాకరకులే జాతోऽనంత ప్రబల విక్రమః
సర్వసౌభాగ్యసంపన్నో ద్వారకా పత్తనేస్థితః

భద్రాసూర్యసుతానాథో లీలా మానుషవిగ్రహః
సహస్ర షోడశస్త్రీశో భోగమోక్షైకదాయకః

వేదాంతవేద్యః సంవేద్యో వైద్యో బ్రహ్మాండనాయకః
గోవర్ధనధరో నాథః సర్వజీవదయాపరః

మూర్తిమాన్ సర్వభూతాత్మా ఆర్తత్రాణ పరాయణః
సర్వజ్ఞః సర్వసులభః సర్వశాస్త్రవిశారదః

షడ్గుణైశ్వర్యసంపన్నః పూర్ణకామో ధురంధరః
మహానుభావః కైవల్యదాయకో లోకనాయకః

ఆదిమధ్యాంతరహితః శుద్ధసాత్త్విక విగ్రహః
అసమానః సమస్తాత్మా శరణాగత వత్సలః

ఉత్పత్తిస్థితి సంహార కారణం సర్వకారణం
గంభీరః సర్వ భావజ్ఞః సచ్చిదానందవిగ్రహః

విష్వక్సేనః సత్యసంధః సత్యవాక్ సత్యవిక్రమః
సత్యవ్రతః సత్యరతః సత్యధర్మ పరాయణః

ఆపన్నార్తి ప్రశమనః ద్రౌపదీ మాన రక్షకః
కందర్ప జనకః ప్రాజ్ఞో జగన్నాటక వైభవః

భక్తివశ్యో గుణాతీతః సర్వైశ్వర్యప్రదాయకః
దమఘోషసుతద్వేషీ బాణ బాహువిఖండనః

భీష్మభక్తి ప్రదో దివ్యః కౌరవాన్వయనాశనః
కౌంతేయ ప్రియబంధుశ్చ పార్థస్యందనసారథిః

నారసింహో మహావీరః స్తంభ జాతో మహాబలః
ప్రహ్లాదవరదః సత్యో దేవ పూజ్యోఽభయంకరః

ఉపేంద్ర ఇంద్రావరజో వామనో బలిబంధనః
గజేంద్రవరదః స్వామీ సర్వదేవనమస్కృతః

శేషపర్యంకశయనః వైనతేయరథో జయీ
అవ్యాహత బలైశ్వర్యసంపన్నః పూర్ణమానసః

యోగేశ్వరేశ్వరః సాక్షీ క్షేత్రజ్ఞో జ్ఞానదాయకః
యోగిహృత్పంకజావాసో యోగమాయాసమన్వితః

నాదబిందుకలాతీత శ్చతుర్వర్గ ఫలప్రదః
సుషుమ్నామార్గసంచారీ దేహస్యాంతర సంస్థితః

దేహేంద్రియ మనః ప్రాణ సాక్షీ చేతః ప్రసాదకః
సూక్ష్మః సర్వగతో దేహీ జ్ఞానదర్పణగోచరః

తత్త్వత్రయాత్మకోఽవ్యక్తః కుండలీ సముపాశ్రితః
బ్రహ్మణ్యః సర్వధర్మజ్ఞః శాంతో దాంతో గతక్లమః

శ్రీనివాసః సదానందః విశ్వమూర్తిః మహాప్రభుః
సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్

సమస్త భువనాధారః సమస్త ప్రాణరక్షకః
సమస్తసర్వభావజ్ఞో గోపికా ప్రాణవల్లభః

నిత్యోత్సవో నిత్యసౌఖ్యో నిత్యశ్రీర్నిత్యమంగళః
వ్యూహార్చితో జగన్నాథః శ్రీవైకుంఠపురాధిపః

పూర్ణానంద ఘనీభూతః గోపవేషధరో హరిః
కలాపకుసుమ శ్యామః కోమలః శాంత విగ్రహః

గోపాంగనావృతోఽనంతో బందావన సమాశ్రయః
వేణువాదరతః శ్రేష్ఠో దేవానాం హితకారకః

బాలక్రీడాసమాసక్తో నవనీతస్యతస్కరః
గోపాలకామినీజారః చౌరజార శిఖామణిః

పరంజ్యోతిః పరాకాశః పరావాసః పరిస్పుటః
అష్టాదశాక్షరో మంత్రో వ్యాపకో లోకపావనః

సప్తకోటి మహామంత్ర శేఖరో దేవశేఖరః
విజ్ఞానజ్ఞాన సంధానః తేజోరాశి ర్జగత్పతిః

భక్తలోక ప్రసన్నాత్మా భక్తమందార విగ్రహః
భక్తిదారిద్ర్యదమనో భక్తానాం ప్రీతి దాయకః

భక్తాధీనమనాః పూజ్యః భక్త లోకశివంకరః
భక్తాభీష్టప్రదః సర్వభక్తాఘౌఘనికృంతనః

అపార కరుణాసింధుః భగవాన్ భక్తతత్పరః
స్మరణాత్ పాపరాశీనాం ఖండనం మృత్యునాశనం.

**అథఫలశ్రుతిః**

వైష్ణవానాం ప్రియకరం మహారోగ నివారణమ్ బ్రహ్మహత్యా సురాపానం పరస్త్రీగమనం తథా. పరద్రవ్యాపహరణం పరద్వేషసమన్వితం మానసం వాచికం కాయం యత్పాపం పాపసంభవమ్. సహస్రనామ పఠనాత్ సర్వం నశ్యతి తత్క్షణాత్ మహాదారిద్ర్యయుక్తో యో వైష్ణవో విష్ణుభక్తిమాన్. కార్తిక్యాం సంపఠేద్రాత్రౌ శతమష్టోతరం క్రమాత్ పీతాంబరధరో ధీమాన్ సుగంధై పుష్పచందనైః. పుస్తకం పూజయిత్వా తు నైవేద్యాదిభిరేవ చ రాధాధ్యానాంకితో ధీరో వనమాలా విభూషితః. శత మష్టోత్తరం దేవి పఠేన్నామ సహస్రకమ్ చైత్ర శుక్లే చ కృష్ణే చ కుహూ సంక్రాంతివాసరే. పఠితవ్యం ప్రయత్నేన త్రైలోక్యం మోహయేత్ క్షణాత్ తులసీమాలయా యుక్తో వైష్ణవో భక్తి తత్పరః రవివారే చ శుక్రే చ ద్వాదశ్యాం శ్రాద్ధవాసరే

బ్రాహ్మణం పూజయిత్వా చ భోజయిత్వా విధానతః. పఠేన్నామసహస్రం చ తతః సిద్ధిః ప్రజాయతే మహా నిశాయాం సతతం వైష్ణవో యః పఠేత్ సదా. దేశాంతరగతా లక్ష్మీః సమాయాతి న సంశయః త్రైలోక్యే చ మహాదేవి సుందర్యః కామమోహితాః. ముగ్ధః స్వయం సమాయాంతి వైష్ణవం చ భజన్తి తాః రోగీ రోగాత్ ప్రముచ్యేత బద్ధో ముచ్యేత బంధనాత్. గుర్విణీ జనయేత్పుత్రం కన్యా విందతి సత్పతిమ్. రాజానో వశ్యతాం యాన్తి కిః పునః క్షుద్ర మానవాః. సహస్రనామ శ్రవణాత్ పఠనాత్ పూజనాత్ ప్రియే ధారణాత్ సర్వమాప్నోతి వైష్ణవో నాత్ర సంశయః. వంశీవటే చాన్యవటే తథా పిప్పలకే Z థవా కదంబపాదపతలేగోపాలమూర్తి సన్నిధౌ యః పఠేత్ వైష్ణవో నిత్యం స యాతి హరిమందిరం. కృష్ణేనోక్తం రాధికాయై మయిప్రోక్తం తథా శివే. నారదాయ పురా ప్రోక్తం నారదేన ప్రకాశితం మయా తుభ్యం వరారోహే ప్రోక్తమేత త్సుదుర్లభమ్. గోపనీయం ప్రయత్నేన న ప్రకాశ్యం కథంచన శఠాయ పాపినే చైవ లంపటస్య విశేషతః. నదాతవ్యం నదాతవ్యం న దాతవ్యం కదాచన దేయం శిష్యాయ శాంతాయ విష్ణుభక్తిరతాయ చ. గోదాన బ్రహ్మయజ్ఞాదేర్వాజపేయ శతస్య చ అశ్వమేధ సహస్రస్య ఫలం పాఠే భవేద్ధ్రువమ్. మోహనం స్తంభనం చైవ మారణోచ్చాటనాదికమ్ యద్యద్వాంఛతి చిత్తేన తత్తత్ ప్రాప్నోతి వైష్ణవః. ఏకాదశ్యాం నరః స్నాత్వా సుగంధిద్రవ్య తైలకైః ఆహారం బ్రాహ్మణో దత్వా దక్షిణాం స్వర్ణభూషణమ్. తత ఆరంభకర్తాస్య సర్వం ప్రాప్నోతి మానవః శతావృత్తం సహస్రం చ యః పఠే ద్వైష్ణవో జనః. శ్రీ బృందావన చంద్రస్య ప్రసాదాత్సర్వ మాప్నుయాత్ యద్గృహే పుస్తకం దేవి పూజితం చైవ తిష్ఠతి. న మారీ న చ దుర్భిక్షం నోపసర్గభయం క్వచిత్ సర్పాద్యా భూత యక్షాద్యా నశ్యంతే నాత్ర సంశయః. శ్రీ గోపాలో మహాదేవి వసేత్తస్య గృహే సదా గృహే యత్ర సహస్రం చ నామ్నాం తిష్ఠతి పూజితమ్

ఓమ్ తత్సదితి శ్రీ సమ్మోహనతంత్రే పార్వతీపరమేశ్వర సంవాదే శ్రీగోపాలసహస్ర నామ స్తోత్రం సంపూర్ణమ్.